The Largest Circulated Telugu Monthly

# చతుర

మార్చి 1998

రు: 7/-



వింజమూరి విజయశాంభవి

## మనిషిచేతి దేవత

# విచిత్ర విచిత్రం



## ఖరీదైన చిరునవ్వు

అమెరికాలోని కాలిఫోర్నియా రాష్ట్రవు, పామ్‌డేట్ అనే ఊరికి చెందిన షెల్బీథామస్ అనే ఈ ఏడేళ్ళ పాపకు హాయిగా నవ్వాలనే కోరిక ఎంతగా ఉన్నా అలా చేయలేకుండా ఉంది. నవ్వాలని ప్రయత్నిస్తే విపరీతమైన బాధ కలుగుతుంది. ఆమెకు ఒక అసాధారణ రోగం కారణంగా. మొహంలోని హావభావాలను కంట్రోల్‌చేసే ఒక ముఖ్యమైన నరం ఈమెకు పుట్టుకతోనే లోపించి ఉండటం ఇందుకు కారణం. 'మోబియస్ సిండ్రోమ్' అనే ఈ వ్యాధి కారణంగా ఈ పాప మొహంలో నవ్వు, కోపం, వగైరా ఏ భావాలూ కనిపించవు.

ఇటీవలనే డాక్టర్ రోనాల్డ్ జాకబ్ అనే కెనెడియన్ సర్జన్ ఈ పాపకు సర్జరీ చేసి, నవ్వేలా చేయగలిగారు. తొడ భాగంలోని ఓ నరాన్ని తీసి మొహంలో ట్రాన్స్‌ప్లాంట్ చేయటం ద్వారా ఈ మార్పును సాధించగలిగారాయన. ఇందుకయిన ఖర్చు 70 వేల డాలర్లు. అంటే మన రూపాయల్లో 25 లక్షల 20 వేలు మాత్రం.

# సనాతనులకీ, ఆధునికులకీ వారధి... వారణాసి



కాశీ విశ్వనాథుని ఆలయం

మనదేశంలో భక్తికీ, సనాతన సంప్రదాయానికీ నెలవులై, మోక్షదాయకాలుగా, మహిమాన్వితమైనవిగా చెప్పే పుణ్యక్షేత్రాలు అనేకం. వాటిలో ప్రధానమైనది కాశీ. దీనినే బెనారస్ అనీ, వారణాసి అని కూడా పిలుస్తుంటారు. గంగా తరంగిణులు, జ్యోతిర్మయ విశ్వేశ్వర మహాలింగం ఈ క్షేత్రమహాత్మ్యానికి ముఖ్యకారణాలయ్యాయి. కాశీ విశ్వనాధునికీ, అన్నపూర్ణాదేవికీ నివాసంగా అలరారుతూవుంది. జన్మలో కనీసం ఒక్కసారైనా కాశీని సందర్శించాలని భక్తకోటి తహతహలాడుతుండటం

చూస్తుంటాం. "కాశ్యం మరణం ముక్తిః" అన్న ఆర్యోక్తిని బట్టి కాశీలో మరణిస్తే మోక్షం లభిస్తుందని భక్తులు విశ్వసిస్తారు. ప్రతి సంవత్సరం లక్షలాది జనం ఈ నగరాన్ని సందర్శిస్తుంటారు. పాప ప్రక్షాళనం కోసం జీవితంలో కనీసం ఒక్కసారైనా కాశీని సందర్శించాలనీ, కాశీలోనే తనువు చాలించాలనీ కోరేవారెందరో కన్పిస్తుంటారు. దక్షిణాదినుండి వెళ్లిన ఎన్నో కుటుంబాలు వృద్ధాప్యంలో కాశీలోనే స్థిరనివాసమేర్పర్చుకున్నాయి.

కాశీవిశ్వనాథుని సన్నిధిలోనే కలుషనివారిణి గంగానది ప్రవహిస్తూ ఉంటుంది. పౌరాణికంగా కాశీగా ప్రసిద్ధికెక్కిన ఈ నగరం వరుణ- అసి అనే రెండు నదుల మధ్యన ఉంది గనుక 'వారణాసి' అనే పేరేర్పడింది. 'కాశ' అంటే కాంతి. ఆధ్యాత్మిక కాంతులతో ప్రకాశిస్తున్న నగరం గనుక 'కాశీ' అని ప్రణుతికెక్కిందని పండితులు విశ్లేషిస్తారు. భగవంతుడు మొట్టమొదట సృష్టి ప్రారంభించినప్పుడే కాశీని సృష్టించాడనీ, ప్రళయకాలంలో కూడా ఈ పట్టణానికి నాశనం లేదనీ పెద్దలు చెబుతారు. పురాణాల్లో దీనిని గూర్చి సమగ్ర వివరణలు, వర్ణనలు ఉన్నాయి. స్కందపురాణం ప్రకారం మూడువేల సంవత్సరాలకు పూర్వమే క్రీ.పూ. 1200 నాటికే ఈ నగరం ఉందని తెలుస్తోంది. చైనా యాత్రికులైన ఫాహియాన్, హ్యూయాన్‌త్సాంగ్‌లు 5, 7 శతాబ్దాలలో ఆనాటి హైందవ దేవాలయాల గురించి రాశారు. అందులో కాశీని గురించి వివరంగా రాయటం విశేషం. క్రీ.పూ. 6వ శతాబ్దంలో వారణాసికి 8 కిలోమీటర్ల దూరంలో గల సారనాథ్‌కి బుద్ధుడు వచ్చాడు. ఇక్కడే సత్యాహింసల మార్గాన్ని, జ్ఞానాన్ని ఉపదేశించాడు. గంగాతీరాన గల వివిధ ఘాట్‌లపై అనేక శివాలయాలు వెలిశాయి. సంపదలతో వైభవోపేతమైన వారణాసి 11వ శతాబ్దం తరువాత ముస్లిం పాలకులచే దోపిడీకి గుర్తై పూర్వవైభవాన్ని కోల్పోయింది. మొగల్ చక్రవర్తి ఔరంగజేబు అన్ని ఆలయాల్నీ ధ్వంసం చేయించాడు. ప్రముఖ స్థలాల్ని, కేంద్రాల్ని మసీదులుగా మార్చాడు. అయినా 18వ శతాబ్దానికి పూర్వపు ప్రాచీన ఆలయాలు ఇప్పటికీ ఉన్నాయి. ఆలయాలు దురాక్రమణకు లోనైనప్పుడు ఇండోర్ పాలకురాలు రాణి అహల్యాబాయి హోల్కర్ పునర్నిర్మాణాలు కావించి ఆలయాలని పటిష్ఠం చేయించింది.

ఒకప్పుడు 'కాశీ' నగరం దేశంలోని అతి పెద్ద విద్యాకేంద్రంగా భాసిల్లింది. విద్యావ్యాసంగానికీ, న్యాయతర్క శాస్త్రాలకీ, సంస్కృత భాషాధ్యయనానికీ, వేదపురాణాల అభ్యాసానికీ, పండిత ప్రకాండులకూ నిలయమైంది. ఆచారాలకీ, కర్మకాండలకీ, భక్తిభావాలకీ కాశీ పెట్టింది పేరు. చరిత్రలో, పురాణాల్లో విశిష్టమైన స్థానం పొందిన ఈ వారణాసిలోనే హరిశ్చంద్రుడు తన సత్యసంధతని నిరూపించుకున్నాడు. బుద్ధభగవానుడు జ్ఞానకాంతుల్ని వారణాసిలోని సారనాథ్‌లోనే తొలిసారిగా లోకానికి పంచిపెట్టాడు. వారణాసిలోనే కబీర్ జన్మించాడు. హిందీ భక్తిసాహితీ గగనంలో ధృవతారగా మెరిసే ఆదిసంత్ కబీర్ తన నిర్గుణోపాసననీ, పరమార్థతత్వాన్నీ ప్రజలకు అందించాడు. మహాభక్తుడైన తులసీదాసు "రామచరిత్ మానస్"ని రచించి శ్రీరామార్పణం చేశాడు. ఆదిశంకరుల విద్యాభ్యాసం ఇక్కడే కొనసాగింది. సంత్‌శిరోమణి దాతాదయాల్ శివవ్రత్‌లాల్‌వర్మన్ హిందీ, ఉర్దూ భాషల్లో దాదాపు ఐదువేల ఆధ్యాత్మిక గ్రంథాల్ని రాశాడు. ఆయన నివసించిందీ ఇక్కడే! ఇలా ఎందరో మహానుభావులు వారణాసిలో జన్మించి, జీవించి, జ్ఞానదీపాలు వెలిగించి కాశీ ప్రాధాన్యతని ద్విగుణీకృతం చేశారు.

వారణాసి వీధుల్లోని ప్రతి ఆలయానికీ ఓ పురాణసంబంధ గాథ వుంది. ఇక్కడి గుళ్లు చిన్నవీ, పెద్దవీ అనేకం ఉన్నా చాలావరకు శివాలయాలే! శివుడే ఈ నగర పాలకుడు, సంరక్షకుడూ! అందుకే ఆయనని వారాణసీ పతి అని కూడా పిలుస్తుంటారు. లోకేశుడైన



అభిషేక జలాలతో సంతృప్తుడవుతున్న కాశీ విశ్వేశ్వరుడు

విశ్వనాథుని ఆలయం అన్నిటిలోకీ మకుటాయమానమైనది. విశ్వనాథుని ఆలయవీధులు జనసందోహంతో సదా సందడిగా ఉంటాయి. భక్తులు, పూజారులు, వ్యాపారులు ఎంత కిక్కిరిసి తిరుగుతున్నా ప్రశాంత వాతావరణమే కన్పిస్తుంది. ఆలయ పరిసరాల చుట్టూరా జేగంటల ధ్వనులు ప్రతిధ్వనిస్తుంటాయి. అవ్యక్తానందాన్ని కలిగించే పూలపరిమళాలూ, గంధలేపనాల సువాసనలూ, అగరుధూపాలు పవిత్రభావనల్ని కలిగిస్తుంటాయి.

**విశ్వనాథమందిరం:** విశ్వేశ్వరుడు జ్యోతిర్లింగంగా వెలిసినది ఇక్కడే! భక్తకోటికి ముక్తిని ప్రసాదిస్తూ, కోరిన కోరికలీడేర్చే భోళాశంకరుని దివ్యమందిరం ఇది. వెండితో నిర్మించిన చత్రం మధ్యగల బంగారు శివలింగాన్ని దర్శించినంతనే పాపాలు పటాపంచలవుతాయని భక్తులు విశ్వసిస్తారు. మందిర గోపురం 22 మణుగుల బంగారుపు రేకుతో నిర్మించబడింది. ఈ బంగారమును పూర్వం రణజిత్‌సింగ్ మహారాజు స్వామికి సమర్పించాడు. ఇప్పటి ఈ ఆలయం 1785లో రాణి అహల్యాబాయి హెూల్కర్ నిర్మింపచేసింది. ఉదయం 4 గంటలనుండి రాత్రి 11 గంటలవరకు మందిరం తెరిచే ఉంటుంది. దూరతీరాలనుండి వచ్చిన జనం విశ్వనాథుని సందర్శనతో ప్రయాసనంతా మరిచి ప్రసన్నచిత్తంతో తిరుగుముఖం పడతారు. ఈ ఆలయంలో ఎదురుగా శివుని పంచముఖాకార విగ్రహం ఉంది.

**అన్నపూర్ణా దేవి మందిరం:** విశ్వనాథుని ఆలయానికి పశ్చిమాన యాభైగజాల దూ

రంలో ఈ గుడి ఉంది. విశ్వనాథుని అర్ధాంగి పార్వతీదేవి ఇక్కడ అన్నపూర్ణాదేవిగా ఆరాధ నలందుకుంటోంది.

**విశాలాక్షి మందిరం:** కాశీ విశాలాక్షి మందిరం విశ్వనాథ మందిరానికి తూర్పున రెండు ఫర్లాంగుల దూరంలో ఉంది. పార్వతీ దేవి అపరావతారమైన ఈ తల్లి కరుణాంత రంగ అంటారు.

**రామాలయం:** దీనినే తులసీ మానస మందిరం అంటారు. దీన్ని శేఠ్ రతన్‌లాల్ సురేఖా 1964లో నిర్మించాడు. పాలరాతితో కట్టిన అతి సుందరమైన రామమందిరం పైభా గాన తులసీదాసు విగ్రహం ఉంది. ఆలయం లోపలిభాగాన పాలరాతి గోడలపై తులసీరామా యణం వ్రాసి ఉంది. రామాయణంలోని ము ఖ్యఘట్టాలు చిత్రించబడి ఉన్నాయి. మందిరా నికి కుడివైపున కైలాసపర్వతం, ఎడమవైపున రామేశ్వరం నిర్మించారు.

**దుర్గామందిరం:** తులసీ మానసమందిరానికి ఒక ఫర్లాంగు దూరంలో ఉత్తరంగా దుర్గా మందిరం ఉంది. దీని పక్కనే దుర్గాకుండ్ (చెరువు) ఉంది. ఇందులో స్నానం చేస్తే సద్గతులు కలుగుతాయంటారు.

**కాలభైరవాలయం:** ఇది గోదేలియా జంక్షన్ నుండి ఒక మైలు దూరంలో ఉంది. విశ్వేశ్వర దర్శనంలాగే కాలభైరవ దర్శనం కూడా ము ఖ్యమని చెబుతారు.

**భారతమాతా మందిరం:** ఇది వారణాసి కంటోన్మెంట్ రైల్వే స్టేషనుకు పోయే మా ర్గంలో ఉంది. ఈ మందిరంలో ఒక మండువా నిర్మించి అందులో భారత దేశాన్ని సిమెంటుతో తయారుచేశారు. పర్వతాలు, నదులు, సముద్రాలు, ముఖ్యప్రదేశాలు స్వభా వసిద్ధములుగా కనిపిస్తాయి. అందుకే దీన్ని భారతమాత మందిరం అన్నారు. దీనికి సమీ పంలోనే కాశీవిద్యాపీఠం ఉంది.

**సంస్కృత కళాశాల:** గోదేలియా జంక్షన్ నుండి ఉత్తరంగా $1^1/_2$ మైలు దూరంలో సంస్కృత కళాశాల ఉంది. దీనిని 200 సంవత్సరాలక్రితం స్థాపించారు. అనేక ప్రాంతా లనుండి విద్యార్థులు వచ్చి విద్యాధ్యయనం చేస్తారు. అన్ని శాస్త్రాల్నీ ఇక్కడ బోధిస్తారు.

**రాధాస్వామి ధామ్:** గోపీగంజ్‌లోని ఈ సువి శాల ఆశ్రమంలో దాతా దయాల్ శివవ్రతలాల్ వర్మ నివసించి అనేక ఆధ్యాత్మిక, భక్తి సం బంధ గ్రంథాల్ని రాశారు. వేలాదిమంది భక్తు లకు జ్ఞానభిక్ష పెట్టారు. అంతర్ముఖ సాధనా భ్యాసాల్ని ఉపదేశించారు.

విశ్వనాథుని ఆలయంవద్దనున్న నందీశ్వరుడు



**కబీర్‌మఠ్:** ఆదిసంత్ కబీర్ నివసించిన ప్రాంతం. ఇక్కడ సమస్త కబీర్ సాహిత్యం లభిస్తుంది.

ప్రతిరోజూ ఉదయం వెలుగురేకలు విచ్చుకోకముందే ప్రాతఃసంధ్యాసమయంలోనే కాశీ నగరం మేల్కొంటుంది. చల్లని గంగాజలాలలో మూడుసార్లు మునిగి అరుణభాస్కరునికి అంజలి ఘటించి గాయత్రి జపించే జనంతో గంగానదీతీరం కిటకిటలాడుతుంటుంది. కాశీలో ద్వాదశ సూర్యులు చక్రరూపంలో పూజలందుకుంటున్నారు. గంగానదీతీరంలో అరవైనాలుగు ఘాట్‌లు (రేవులు లేక ఘట్టములు) ఉన్నాయి. ఏ రెండు ఘాట్‌లూ ఒక్కలా ఉండవు. కొన్ని ఘాట్‌లు స్నానాలకి ప్రత్యేకమైతే, మరికొన్ని శవస్నానాలకీ, చితి మంటలకీ నెలవులై కన్పిస్తుంటాయి. దశాశ్వమేథఘాట్, మణికర్ణికా ఘాట్, ప్రహ్లాదఘాట్, త్రిలోచన్ ఘాట్, రాంఘాట్, అస్సీఘాట్, తులసీ ఘాట్, హనుమాన్ ఘాట్, శివల (కాళి) ఘాట్, బర్నసంగం ఆనందమాయి ఘాట్, కేదార్ ఘాట్, నారద్ ఘాట్, హరిశ్చంద్ర ఘాట్, చౌసటే ఘాట్, రానె మహల్ ఘాట్, దండి ఘాట్ వంటివి సదా జనసందోహంతో కన్పిస్తాయి.

**దశాశ్వమేథ ఘాట్:** అన్నిటిలోకీ పవిత్రమైందంటారు. దీని వెడల్పైన మెట్లపై కూర్చుని భారతీయ సంస్కృతీ సందర్శనం చేయవచ్చు. ఈ ఘట్టంలో ఎల్లప్పుడూ యాత్రికులు స్నానం చేస్తుంటారు. పూలు, పత్రాలు, దీపాలు గంగకు అర్పిస్తారు. దశ అంటే పది. అశ్వమేథం అనగా గుర్రాలతో యాగం. ఇక్కడే పది గుర్రాలతో యాగాన్ని బ్రహ్మ నిర్వర్తించి శివుని మళ్ళీ కాశీకి రప్పించినందున దీనికి దశాశ్వమేథ ఘట్టం అని పేరొచ్చిందంటారు. ఇక్కడ శీతలాదేవి ఆలయం ఉంది.

ఘాట్‌ల మెట్లపై పెద్దపెద్ద తాటిచాపలు పరుచుకుని పండాలు కూర్చుంటారు. స్నానమాచరించి వచ్చిన భక్తులకు తిలకం పెట్టి, గంగాస్నాన ఫలాన్ని చెప్పి, గంగాభవానికి మంత్రయుక్తంగా ప్రణామాలు అర్పింపచేస్తారు. సంకల్పం చెప్పిస్తారు. ఆ తరువాత ఒక పాత్రలో గంగాజలాల్ని తీసుకుని పువ్వులు, బిల్వపత్రాలు, మిఠాయిలు పట్టుకుని విశ్వనాథుని ఆలయానికి వెడతారుభక్తులు. గంగాతీరంనుండి విశ్వనాథుని గుడికి అనేక మార్గాలున్నాయి. నగరంలో ఎన్ని మార్పులు వచ్చినా, నాగరికత ఎంత పెరిగినా ప్రాచీనకాలంనుండే ఉన్న ఈ ఇరుకు సందుల ఆకృతిలో మార్పు రాకపోవటం విశేషం.

**మణికర్ణికా ఘాట్:** ఈ ఘాట్‌లో కూడా విపరీతమైన జన సందోహం ఉంటుంది. భక్తులు మణికర్ణికా ఘట్టంలో స్నానమాడి విశ్వేశ్వరుని దర్శిస్తారు. ఇక్కడ సదా శవదహనాలు జరుగుతుంటాయి. పూర్వం మహావిష్ణువు ఇక్కడ తన చక్రంతో ఒక తటాకాన్ని తవ్వి దాని తీరంలో శ్రీ విశ్వనాథుని గూర్చి తపస్సుచేశాడంటారు. విశ్వేశ్వరుడు ప్రత్యక్షమై ఆ తటాకాన్ని చూసి విష్ణువు తపమునకు మెచ్చి తల ఊపాడు. అప్పుడు శివుని కుడిచెవికిగల మణికుండలం జారి ఆ తటాకంలో పడిపోయింది. కాబట్టే ఈ ఘట్టానికి మణికర్ణిక అనే పేరొచ్చింది. విష్ణువు తన చక్రంతో నిర్మించినది గనుక చక్రతీర్థమని కూడా దీనికి పేరుంది. తరువాత కొంతకాలానికి ఈ చక్రతీర్థం మీదుగా గంగాభాగీరథి ప్రవహించింది. మణికర్ణికా ఘాట్‌నుండి 4 ఫర్లాంగుల దూరంలో పశ్చిమంగా విశ్వేశ్వరుని మందిరం ఉంది. కాశీలో మరణించి ముక్తిపొందాలనుకునేవాళ్ళ కోరికను తీర్చడానికా అన్నట్టు ఈ మణికర్ణికా ఘాట్ సందడిగా ఉంటుంది. శవాల్ని గంగలో ముంచి తరువాత కర్రల చితిపై వుంచి అంటిస్తారు. చీకటిలో సైతం చితిమంటల చిటపటలు, రగిలే జ్వాలలు కన్పిస్తుంటాయి.

**కేదార్ ఘాట్:** ఇక్కడ వశిష్ఠుడు కేదారేశ్వరుని సేవించి ముక్తిని పొందాడు.

**హరిశ్చంద్రఘాట్:** పూర్వం హరిశ్చంద్రుడు



సారనాథ్‌లోని బుద్ధ విగ్రహం

వీర బాహువునకు సేవకుడై ఇక్కడే కాటికాప రిగా ఉన్నాడు. ఇక్కడ కూడా కొన్ని శవాల్ని చందనంతో దహనం చేస్తుంటారు.

**పంచగంగాఘాట్:** ఇది కూడా మరో ముఖ్య మైన రేవే! ధర్మదూత, పాపకిరణ గంగా యమునా నదులు కలిసే స్థానమిదని చెబుతా రు.

మరికొన్ని ఘాట్‌లవద్ద వితంతువులు తె ల్లని దుస్తుల్లో గుంపులు గుంపులుగా కూర్చుని రామాయణమో, భగవద్గీతా పారాయణమో చేస్తుంటారు. కొన్ని ఘాట్ల వద్ద ప్రత్యేక కీర్తన లు, భజనలు చేస్తుంటారు. నదీ తీరాల్లో అనేక పడవలు వరుసగా వుంటాయి. వరుణా ఘాట్



ప్రత్యేక ఉత్సవాలకి ప్రత్యేకంగా అలంకరింపబడుతున్న శివుని తామ్రముఖాలు

నుండి అస్సీ ఘాట్ వరకు గంగానదిపై నౌకా విహారం చేస్తూ తీరంలోగల భవనాల్ని చూసి పరవశించని వారుండరు.

గంగానదీ తోయమాలికలలో స్నాన మాచరించిన భక్తులు ఉదయ భాస్కరునికి అంజలి ఘటించే సన్నివేశం మనోహరంగా ఉంటుంది. వీరు సమర్పించిన బంతిపువ్వులు, బిల్వపత్రాలు, నదీ అలలతో కలిసి ప్రవహించే దృశ్యం అద్భుతంగా ఉంటుంది.

ప్రాచీన యుగంలో శివుడు కాశీకి తన దూతగా సూర్యుణ్ణి పంపించాడని 'కాశీఖండం'లో ఉంది. ఇక్కడ సూర్యుడు తనకు తానుగా 12 భాగాల్లో విభక్తమై కాశీలోని వివిధ ప్రాంతాల్లో స్థితమై వెలుగులు ప్రసాదిస్తున్నాడని 'శతపథ బ్రాహ్మణం' ద్వారా తెలుస్తోంది. వారణాసిలో సూర్యోదయానికి పూర్వమే భక్తులు మేల్కొని గంగానదిలో స్నానం చేసి సంధ్యవారుస్తారు. ప్రతిరోజూ వేలాదిమంది అరుణ భాస్కరునికి అంజలి

ఘటించటం కాశీ ప్రత్యేకత. ఇక్కడ ద్వాదశ సూర్యులు చక్రరూపంలో పూజలందుకో వటం విశేషం.

**1) లోలార్కుడు:** ఈ సూర్యబింబం తులసీ ఘాట్‌వద్ద ఉంది. కాశీని మొదటిసా రిగా దర్శించినపుడు సూర్యుని హృదయం కంపించినందున ఆయనకు లోలార్కుడనే పేరు వచ్చింది. ఆ లోలార్కుడు బింబరూ పంలో స్థితమై లోలార్కకుండ్ వద్ద నెలకొ న్నాడు. ఇక్కడి ఈ లోలార్కకుండ్‌నే సూర జ్ కుండ్ అంటారు. ఇది దీర్ఘ చతురస్రాకా రంలో భూమికి యాభై అడుగుల దిగువన ఉంది. దీనికి మూడు వైపులనుండి మెట్లు ఉన్నాయి. ఈ మెట్లు దిగి భక్తులు లోలా ర్కకుండ్‌లో స్నానాలు చేస్తారు. ఇక్కడి ఓ గోడలో సూర్యబింబ చక్రం కన్పిస్తుంది. వారణాసికి దక్షిణవైపున అనగా 'అసి' నది గంగలో కలిసే సంగమ స్థానానికి సమీ పంలో లోలార్క ఉంది. అందుకే లోలా ర్కకు అత్యధిక ప్రాముఖ్యత కలిగింది. ప్రాచీన సాహిత్యంలో అసి సంగమాన్ని లోలార్క సంగమంగా ఉటంకించడం జరి గింది. కాశీ ఖండంలో లోలార్క, అసిలు రెండూ పరస్పర సంబంధాలు కలవిగా, వారణాసికివి దక్షిణ ద్వారాలుగా చెప్పబ డ్డాయి. కాశీనగరంలో అడుగుపెట్టిన వారి పాపాల్ని 'అసి' ఓ కత్తిలా నరుకగా, లోలా ర్కుడు వాటిని దహనం చేస్తాడని భక్తులు విశ్వసిస్తారు.

కాశీలోని ఆదిత్యులలోనేకాక అక్కడి పవిత్ర స్థలాలుగా చెప్పే అన్ని ఆలయాల కంటే లోలార్కునికి ప్రాచీన చరిత్ర ఉందం టారు. గాహడవాల రాజులు లోలార్కకుం డ్‌లోనే స్నానాలు చేసి లోలార్కుని పూజించి దానాలు చేశారని తామ్ర శాసనా లద్వారా తెలుస్తోంది. ఈ లోలార్కుడు అన్ని వర్గాలవారికి ఆరాధ్యుడయ్యాడు. లోలార్కకుండ్ వద్ద ప్రతి సంవత్సరం జాతర 'మేళా' జరుగుతుంది. వారణాసి పరిసర గ్రామాలనుండి ఇక్కడికి ప్రజలు తండోప తండాలుగా వస్తుంటారు. ఆదివా రాలు, షష్ఠి రోజుల్లోనూ ఇక్కడ సూర్యునికి విశేషారాధనలు జరుగుతాయి. జాతరకి దాదాపు పదివేల మందివరకు జనం హాజ రవుతారు. భాద్రపద మాసంలో వచ్చే షష్ఠి నాడు 'లోలార్కషష్ఠి' మేళా జరుపుతారు. లోలార్క మేళాకి వచ్చేవారు చాలా

గంగ ఒడ్డున అంతిమ సంస్కారంకోసం...



వరకు పుత్ర సంతానాన్ని కోరి వస్తారు. భార్యాభర్తలిరువురూ తమ తమ చీరా, ధోవతుల కొంగులు ముడివేసుకుని జంటగా లోలార్కకుండ్‌లో స్నానం చేస్తారు. స్నానం చేసేటపుడు భార్య కొన్ని కూరగాయల్ని నీళ్ల లోకి వదిలిపెట్టడం ఆచారం. వారి అభీష్టం సిద్ధించి పుత్రుడు కలిగాక మళ్లీ వచ్చే సంవత్సరం లోలార్క షష్ఠికి 'మేళా'కి వచ్చి మొక్కులు తీర్చుకుంటూ ఉంటారు.

ఇక్కడి ద్వాదశాదిత్యులలో లోలార్కుని తరువాత చెప్పుకోదగినవారు

**2) ఉత్తరార్కుడు:** ఈయన బింబం గుప్తా ఆలయం ఆవరణలోపల బకారియా కుండ్ వద్ద ఉంది. మొదట్లో దీనిని ఉత్తరార్కకుండ్ అనేవారు. ప్రస్తుతం ఈ కుండ్ దగ్గర సూర్యబింబ చిహ్నాల తాలూకు చక్రాలు కన్పిస్తాయి.

ఉత్తరార్కుని తరువాత ప్రసిద్ధి చెందిన వాడు

**3) సాంబాదిత్యుడు:** సాంబాదిత్యునికి కూడా ఒకప్పుడు బెనారస్‌లో పెద్ద ఆలయం ఉండేది. ప్రస్తుతం సూర్యకుండ్‌వద్ద చిన్న గుళ్లో సాంబాదిత్యుడు పూజలందుకుంటున్నాడు. ఇక్కడ గత వైభవానికి చిహ్నంగా ఓ చెట్టు కింద రెండు పెద్ద సూర్యబింబ చక్రాలు కన్పిస్తాయి. శ్రీకృష్ణ, జాంబవతులకు కలిగిన పుత్రుడు సాంబుడు. అతనికి కుష్టువ్యాధి సోకగా ఇక్కడి ఆదిత్యుని అర్చించాడనీ, ఆ తరువాత అతని వ్యాధి నయమై ఆరోగ్యం పొందాడనీ పురాణాల కథనం. అందుకే ఇక్కడి దినకరునికి సాంబాదిత్యుడనే పేరు వచ్చింది.

**4) ద్రౌపదాదిత్యుడు:** విశ్వనాథుని గుడికి పడమటివైపు చెట్టుకింద ద్రౌపదాదిత్యుడు నెలకొని ఉన్నాడు.

**5) మయూఖాదిత్యుడు:** మంగళగౌరి ఆలయంలో ఈయన నివాసం.

**6) ఖఖోల్కాదిత్యుడు:** ఆకాశంలోని ఉల్కవంటి ఈ సూర్యుడు కామేశ్వరుని గుడిలో నెలకొని ఉన్నాడు. ఈయన్ని గరుడుని తల్లి వినత నెలకొల్పిందని చెబుతారు.

**7) అరుణాదిత్య:** అప్పుడే ఉదయిస్తున్నట్లున్న ఈ అరుణ భాస్కర బింబం త్రిలోచనాలయంలో ఉంది. దీనిని అనూరుడు నెలకొల్పాడని ప్రతీతి.

**8) వృద్ధాదిత్య:** మీర్‌ఘాట్‌వద్ద ఉన్న విశాలాక్షి ఆలయానికి దక్షిణాన వృద్ధాదిత్యుడు కొలువై ఉన్నాడు.

**9) కేశవాదిత్య:** ఆదికేశవుని ఆలయంలోనే నెలకొన్న సూర్యునికి కేశవాదిత్యుడని పేరు.

**10) విమలాదిత్య:** జంగంబాడి పరిసరాలలో గౌడాలియా చౌరస్తాకి దక్షిణ భాగాన విమలాదిత్యుని నివాసం.

**11) గంగాదిత్య:** లలితాఘాట్ వద్ద గంగాదిత్యుడు నెలకొని ఉన్నాడు.

**12) యమాదిత్యుడు:** యముని సూర్యుడు. వీరేశ్వరునికి దగ్గర్లో ఉన్న యమతీర్థం వద్ద స్థిరపడిన సూర్యుడు యమాదిత్యుడు.

**వారణాసి చుట్టూరా:** వారణాసికి పది కిలో మీటర్ల దూరంలో సారనాథ్ ఉంది. సారనాథ్‌లో డీర్‌పార్క్ ఆకర్షణీయంగా ఉండి చూపరులను ఆకట్టుకుంటుంది. నిర్వాణ పథ సూత్రాల్ని వివరించి, జ్ఞానమార్గాన్ని చూపి సత్యాహింసలు, శాంతి సహనాలని ఇక్కడే తొలిసారిగా బుద్ధ భగవానుడు లోకానికి పంచాడు. భారతీయ చిహ్నంగా మనం వాడే అశోక చక్రం, మూడు తలల సింహం బొమ్మల అసలు రూపాలు ఇక్కడివే! ఇది దాదాపు రెండు వేలేండ్ల క్రిందటిది.

సారనాథ్‌లోనే ఆర్కియలాజికల్ సైట్ మ్యూజియం ఉంది. బుద్ధుని జీవనంలోని ఆసక్తికర అంశాల శిల్పాలెన్నో ఇక్కడ మనకు

కన్పిస్తాయి. అంతేకాదు ఇందులో కుశులు, గుప్తులు, అశోకచక్రవర్తి కాలంనాటి అనేక నిర్మాణాలు, ప్రతిమలు కన్పిస్తాయి.

వారణాసికి 16 కి.మీ. దూరంలో రాంనగర్ ఫోర్ట్ ఉంది. ఇది పూర్వం వారణాసిని ఏలిన మహారాజు నివాసం. ఇందులో రాజదుస్తులు, అప్పటి ఫర్నిచర్, ఆయుధాలు, శకటాలు కన్పిస్తాయి. రాంనగర్ కోట గంగ ఒడ్డునే ఉంది. ఇక్కడ దర్బార్ హాలు, రాయల్ మ్యూజియం, ముఖ్యమైనవి.

అఫ్ఘాన్ పాలకుడు షేర్‌షాహ్ సూరి యొక్క చునార్‌ఫోర్ట్ వారణాసికి 30 కి.మీ. దూరంలో ఉంది.

58 కిలోమీటర్ల దూరంలో జాన్‌పూర్ ఉంది. ఇది 14వ శతాబ్దంలో శార్కి రాజులకు రాజధానిగా ఉండేది. ఇక్కడి భవనాలు, సమాధులు చూడదగినవంటారు.

**స్థానిక పర్వాలు:**

మే నెలలో పూర్ణిమనాడే బుద్ధునికి జ్ఞానోదయం, నిర్యాణం జరిగాయి. సారనాథ్‌వద్ద బుద్ధ ఊరేగింపులు జరుగుతాయి.

**దసరా:** సెప్టెంబర్- అక్టోబర్ నెలల్లో రాంనగర్‌లో ప్రత్యేక ఉత్సవాలు జరుగుతాయి. దుర్గా పూజోత్సవాలు వైభవంగా జరుగుతాయి. నాలుగు రోజుల తరువాత దేవీ ప్రతిమలను నదిలో నిమజ్జనం చేస్తారు.

**భరత్‌మిలాప్:** అక్టోబర్ -నవంబర్ నెలల్లో ఈ ఉత్సవం జరుపుతారు. రామ-భరతుల సమాగమానికి సూచనగా చేసే ఈ ఉత్సవంలోనే బెనారస్ మహారాజు ఏనుగుపై ఊరేగే వాడట.

**నాగనాథయా:** నవంబర్‌లో తులసీఘాట్ వద్ద జరుపుతారు. కాళీయునిపై శ్రీకృష్ణుని విజయ సంకేతంగా ఈ పండగ జరుపుతారు.

**చేత్‌గంజ్ నక్కభట్టాయ్:** సెప్టెంబర్- అక్టోబర్‌లో రాత్రిపూట ఈ ఉత్సవం చేస్తారు.

ఇవేగాక అనేక ఆలయాల్లో మార్చి- ఏప్రిల్ మాసాల్లో చైత్ర నవరాత్రి ఉత్సవాలు, పంచక్రోశి యాత్రను ఏప్రిల్- మే మాసాల్లో జరుపుతుంటారు. కాశీ చుట్టూరా చేసే పవిత్రయాత్రను పంచక్రోషియాత్ర అంటారు. జూన్- జూలైల్లో రథయాత్ర, జూలై- ఆగస్టుల్లో దుర్గా మేలా, జూలై- ఆగస్టులోనే సారనాథ్ బుద్ధ మేలా, ఆగస్టు- సెప్టెంబరులో సోర్హియా మేలా, సెప్టెంబరు- అక్టోబరుల్లో రాంనగర్ రాంలీల, జూన్‌లో గంగా దసరా జరుగుతాయి. ఇవిగాక ఆయా ఆలయాలకి సంబంధించిన ఉత్సవాలు, జాతర్లు వేర్వేరుగా ఉంటాయి.

వారణాసి పుణ్యక్షేత్రంగానే కాక ప్రముఖ వ్యాపార కేంద్రంగా కూడా పరిపుష్టిచెందింది. ఈ నగరం ఉన్ని, పట్టు వస్త్రాలకు ప్రసిద్ధి చెందింది. ఇత్తడి, కంచువంటి లోహాలతో తయారైన వస్తువులిక్కడ అనేకం కన్పిస్తాయి. చెక్కతో తయారైన అందమైన బొమ్మలు పుష్కలంగా లభిస్తాయి. రాతితోను, పాలరాయితోను చేసిన విగ్రహాలూ దొరుకుతాయి. పట్టు చీరలు, పట్టు పంచెలు, మృగచర్మాలు, రుద్రాక్షమాలలు, దర్భాసనములు, శివలింగములు అమ్ముతుంటారు. నగరంలో అందమైన శాలువాలు, ఉలెన్ కార్పెట్లు, ఆభరణాలు, సువాసనల అత్తరులు, నోరూరించే బెనారస్ పాన్‌లు, మిఠాయీలు, బెనారస్ సిల్కు దుకాణాలు విరివిగా ఉంటాయి.

కాశీలో పంజాబ్, నేపాల్, బెంగాల్, గుజరాత్, మహారాష్ట్ర, ఆంధ్రప్రదేశ్, మద్రాస్‌వంటి అనేక రాష్ట్రాల ప్రజలు నివసిస్తున్నారు. మహమ్మదీయులు కూడా ఎక్కువగానే ఉన్నారు. ఇక్కడి ముఖ్యాహారం గోధుమ. గోధుమతో పలు రకాల పిండివంటలు, రొట్టెలు, పరోఠాలు చేసుకుంటారు. పాలూ మీగడలు కూడా ముఖ్యాహారాలే! ఎక్కువగా మిఠాయీలు తింటుంటారు. అన్ని కూరగాయలూ లభిస్తాయి. ఇక్కడ వేసవిలో నూలు వస్త్రాలు, శీతాకాలంలో ఉన్ని దుస్తులు ధరిస్తారు. హిందీ, ఇంగ్లీషు భాషలు అధికంగా చలామణిలో ఉన్నాయి.

**-జ్యోతిరాణి**

# చతుర

సంపుటి: 21 సంచిక: 2 మార్చి: 1998

పచ్చని చెట్లతో, చల్లని వాతావరణంతో, ప్రకృతి రమణీయకత తను అణువణువునా నింపుకున్న ఆ పవిత్రాశ్రమం వేలాది భక్తులతో నిండు గర్భిణిలా కనిపిస్తోందా సమయంలో. అందరూ ఆర్తితో, ఆతృతతో 'అమ్మ' దర్శనంకోసం ఎదురు చూస్తున్నారు.

తమలోని 'తీరని కోరికలు' అక్కడ తీరుతాయనే నమ్మకం. తమ 'భయంకర సమస్యల'కు అక్కడే పరిష్కారం లభిస్తుందనే విశ్వాసం...

సంతాన హీనులు, అవివాహితులు, రోగులు, వ్యాపారవేత్తలు... ఇలా ఎంతోమంది 'అమ్మ' కోసం ఎదురుతెన్నులు చూస్తున్నారు.

18 ఏళ్ల వయసుకే ప్రపంచానికే కన్నతల్లిలా... పూజింపబడుతోన్న ఆ యువతి... నిశ్చలంగా, నిర్వికారంగా తన సింహాసనంపై ఆసీనురాలయింది.

కానీ... ఆరోజునుంచే... తన జీవితం ఊహించని మలుపు తిరగబోతోందన్న విషయం.. అన్నీ తెలిసిన ఆ 'అమ్మ'కే తెలియని పరిస్థితి ఏమిటి?

పద్దెనిమిదేళ్లకే... ఆమె... 'అమ్మవారు'గా ఎలా మారింది? వేలాది భక్తులకు ఆమెయందున్న భక్తి, విశ్వాసాలకు పరాకాష్ఠ ఏమిటి?

ఆపకుండా చదివించే ....

వింజమూరి విజయశాంభవి
రచన

# మనిషిచేతి దేవత

ఈ నెల 'చతుర' సమగ్ర నవల

డైరీలోని పేజీలు తిప్పుతూ అన్నాడు ఎడిటర్!

"ఈమె కథని జనంలోకి తీసుకెళ్ళడం ద్వారా మీరు ఆశిస్తోంది ఏమిటి?

"ఎలాంటి పరిష్కారాన్ని కోరుకుంటున్నారు?

"జనంలో పాతుకుపోయున్న విశ్వాసాల్ని త్రుంచివెయ్యడం అంత సులభం అనుకుంటున్నారా?

"వాళ్లంత తేలిగ్గా తమ అభిప్రాయమూ మార్చుకోవడానికి సిద్ధపడతారని మీరు అనుకుంటున్నారా?

"మీ మనసులో ఉన్నదేమిటో నాకు స్పష్టంగా చెప్పండి"

అతడు తల అడ్డంగా తిప్పుతూ అన్నాడు...

"ఈ సమాజంలోని జనం ఏ విషయంలోనూ తమ ఉమ్మడి అభిప్రాయాల్ని అంత సులభంగా మార్చుకోవడానికి అంగీకరించరు.

"అందులోనూ ఇలాంటి మూఢ నమ్మకాల విషయంలో అసలేమంత సులువుగా లొంగిరారని నాకూ తెలుసు.

"సృష్టితోపాటే ఈ నమ్మకాలూ ఉద్భవించాయి.

"అయితే అప్పుడప్పుడూ అక్కడక్కడా కొన్ని నిజాలు ముసుగు తొలగించుకుని బయటపడుతుంటాయి.

"కొందరు తమ నమ్మకాల్ని వదులుకుంటారు! ఇంకొందరు కనీసం తమ నమ్మకాల్ని గురించి పునరాలోచించుకుంటారు.

"ఇదిగో ఇలాంటి ఒక ఆలోచనని మెజారిటీ జనంలో పుట్టించాలన్నదే నా ఆలోచన.

"అంతకంటే ముఖ్యంగా ఆమెని ధనవలయంలా మన కంటికి కనబడుతున్న ఆ భయంకర విషవలయంలోంచి బయటికి తీసుకురావాలి.

"ఆమె కథ విన్నాక కూడా ఈ జనం నమ్మకంలో, ఆలోచనల్లో మార్పు రాకపోతే వాళ్ల ఖర్మానికి వాళ్లే పోతారు. నా ప్రధాన లక్ష్యం ఆమెను విముక్తురాల్ని చెయ్యడమే!

"ఇదంతా చాలా వేగంగా జరగాలి! శ్రీనివాసరావు అమెరికానుండి వచ్చేలోగానే జరిగిపోవాలి.

"అతడు రావడం అంటూ జరిగితే ఇక ఆమె అక్కడ శాశ్వతబందీయే! లేదా ఆమె కథకి మరో రకమైన ముగింపు అయినా జరగవచ్చు..."

ఎడిటర్ ఆలోచిస్తూండిపోయాడు!

అతడు మాట్లాడసాగాడు...

"ఆమె అతి సాధారణమైన యువతి! ఆమెలో ఎలాంటి ప్రత్యేకతలూలేవు.

"అందరమ్మాయిల్లానే పెళ్లిచేసుకోవాలనీ, ఇద్దరో ముగ్గురో పిల్లల్ని కనాలనీ, భర్తతో ఆనందకరమైన సాదాసీదా సంసారిక జీవితాన్ని అనుభవించాలనీ ఆమెకీ వుంది.

"ఒకప్పుడు బాగా చదువుకోవాలని కలలు కంది! అది తీరని కోరిక అయింది.

"ఇప్పుడు ముప్ఫై ఏళ్లకి చేరువ అవుతూన్న వయసులో పెళ్లీ పిల్లలు కావాలనే కోరిక ఆమెలో మిణుక్కుమంటోంది. నా పరిచయంలో అది చిగురులు తొడుగుతూ వచ్చింది"

"శ్రీనివాసరావు వచ్చేస్తే ఆమెని బయటికి తెప్పించడం కుదరదంటారా మిస్టర్ ఫణీంద్రా?" అడిగాడా ఎడిటర్!

తల అడ్డంగా తిప్పాడు అతడు. "ఒకవిధంగా అసంభవం. ఇంకోవిధంగా సంభవమైనా ఆ తరువాతి పరిణామాలు ఘోరంగా వుంటాయి!

అసంభవం అని ఎందుకన్నానంటే బ్లాక్ కాట్ కమెండోలతో పోల్చదగిన పటిష్ఠమైన సెక్యూరిటీ వుందక్కడ! ఆ కమెండోల్లాంటి వాళ్ల నరనరాల్లో శ్రీనివాసరావుపట్ల అచంచలమైన భక్తి విశ్వాసాలున్నాయి. వారికి అతడు ఇచ్చే జీతభత్యాలు మన ఊహకి అందనటువంటివి! వారి పిల్లలకి చదువులూ, విలాసవంతమైన భవంతులూ,

వాహనాలూ, వారి భార్యలకి నగలూ ఆస్తులూ కొనిపెట్టాడు శ్రీనివాసరావు. వారి కష్టసుఖాల్ని తోడబుట్టినవాడిలా గమని స్తాడు. తమ ప్రాణాలు పోయినా సరే దయ్యాలయి మరీ ఆమెకి కాపలా కాస్తారు వాళ్లు. ఒకవేళ బయటికి తీసుకురాగలిగినా వెంటాడి వేటాడి ప్రాణాలు తీసేస్తారు".

ఎడిటర్ చిన్నగా నవ్వాడీసారి. దయ్యా లయి అన్నమాట ఆయనకి నవ్వు తెప్పించినట్లుంది.

"ఏ రాజకీయ నాయకుడి ఇన్‌ఫ్లుయెన్స్ ద్వారానో ప్రయత్నిద్దామంటే గవర్నర్లుతో సహా కేంద్ర మంత్రులనేకమందీ, అనేక పార్టీల నాయకులూ ఏడాదికోసారన్నా ఆ ఆశ్రమాన్ని సందర్శించే వాళ్లే. పోలీసు అధి కారులూ అంతే! స్వయంగా హోంమంత్రే వీరభక్తుడు! ఇంకెలా తప్పించటం? బయ టికి తెప్పించడం? "

మళ్లీ తనే అన్నాడు, "ఇంకో సంగతేమి టంటే ఈ డైరీల్లోని ఆమె కథని మీరు సీరి యల్‌లా ప్రచురించటానికి కుదరదు! ఓ స్పెషల్ సప్లిమెంట్‌లా పేపర్‌తోపాటు తెప్పించాల్సిందే! జనం ఒక్కసారిగా ఆమె కథని చదవాలి!

దీని ప్రచురణద్వారా జనానికి నిజం చెప్పాలన్న తపన తప్ప మనకి వేరే లబ్ధి పొందే ఉద్దేశ్యం లేదు కాబట్టి కమర్షియల్ ట్రిక్స్ ద్వారా అవసరాన్ని మించిన సంచల నాన్ని, సస్పెన్సునీ క్రియేట్ చేసే అవస రమూ లేదు! సమయమూలేదు"

"అది నేను చూసుకుంటాను! మీ ఆలో చన చెప్పండి? ఆమె ఆత్మకథని జనం చదువుతారు సరే! ఆ తరువాత? ఆమెని ఏవిధంగా బయటికి తీసుకురాగలమన్నది మీరు చెప్పండి"

"నేను ఆశించేపాటి సంచలనం జనంలో వస్తే ఆమెపట్ల వాళ్ల అభిప్రాయాలు మారితే ఆమె బయటికి రావడం కష్టం కాదుగానీ, అది అంత సులభసాధ్యమైన సంగతేం కాదన్నది మీకూ తెలుసు, నాకూ తెలుసు. ఆ జీవితంలోంచి బయటికి రావా లనుకుంటోందన్న ఆమె కోరిక గురించి జనానికి తెలుస్తుందపుడు! ఆమె ఎలా బంధించబడి ఉందో కూడా తెలుస్తుంది. ఆమెని సపోర్ట్ చేసేవాళ్లు నేనూ మీరేగాక ఇంకొందరు తయారయినపుడు ఆమెను బయటికి తీసుకురావడానికి నేనొక ప్రయత్నం చెయ్యాలనుకుంటున్నాను! అదీ చాలా తొందరగా..."

"దాన్ని తక్షణం అమల్లో పెట్టడంలోగల ఇబ్బందులు నాకు తెలుసుగానీ మీరు చెప్పే కారణాలేమిటో కూడా తెలుసుకోవాలని వుంది" అడిగాడాయన.

అతడు తల అడ్డంగా తిప్పి "అది ఎంత మాత్రమూ అనుకూలించే అంశంకాదు! తీసుకురావడం వరకూ తీసుకురావచ్చు! ఆ తరువాత ఆశ్రమానికి ఇరవై అయిదు కిలో మీటర్ల పరిధిలో వుండే పన్నెండు చెక్‌పో స్టుల సిబ్బందీ, ఆ తరువాత ఈ ప్రభుత్వం, పోలీసులూ, ప్రజలూ మా వెంటబడి పిచ్చి కుక్కల్ని తరిమినట్టు తరమరా? అప్పుడు మాకు రక్షణ కల్పించేదెవరు? ఏ ఒక్కరి కనీసపు సానుభూతీ మాకు లభించదు! ఆ సంఘటనని పూర్తి నెపం నా మీదకినెట్టి శ్రీనివాసరావు మరోలా చిత్రీకరిస్తాడు. అందుకే అది అసంభవం అంటున్నది!

"ఆమె కథ అందరూ తెలుసుకుని దాన్ని గురించిన ఆలోచనల్తో కొట్టుమిట్టాడుతున్న ప్పుడు ఆమె పారిపోయింది, లేదా తప్పించు కుంది, అని తెలిస్తే అప్పుడు మీలాంటివారి అండ మాకు వుంటే కనీసం ఓ మామూలు మనిషికి లభించేపాటి రక్షణ అయినా గవ ర్నమెంటునుండీ, సాటి మనుషులనుండీ మాకు లభిస్తుందన్నది నా ఆశ"

ఆ మాట చెప్పి తరువాత అతడు మౌనం వహించాడు.

ఆయన ఆలోచిస్తూండిపోయాడు.

అయిదు నిముషాల తరువాత అతడు ఆ

ఏసీ గదిలోని నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ అన్నాడు,

"గతంలో మీరు జనంలోని ఇలాంటి నమ్మకాల ఆధారంగా కోట్లకి పడగలెత్తుతోన్న స్వార్థపరులైనవారి మోసపూరితమైన కథల్ని ఎన్నింటినో బయటికి తెచ్చారు.

"అయితే అది వేరు! మీ జర్నలిస్ట్‌లు పరిశోధించి తెలుసుకున్న నిజాల్ని మీరు మీ పత్రికలద్వారా బయటపెట్టారు.

"ఇదలాకాదు! స్వయంగా ఆమె తన కథని చెప్పుకుంటానంటోంది. ఇదో పెద్ద సంచలనం సృష్టించాలని కాదు నా కోరిక! ఇంతకుముందు నాటి మీ ప్రయత్నాలకంటే ఎక్కువ ఫలితం వుంటుందని ఆశ! ఏమంటారు? "

"నేను నీతో ఏకీభవిస్తున్నాను! అయితే మన అంచనాలు తారుమారు కావచ్చు అయినా మన ప్రయత్నం మనం చేద్దాం! పైగా ఓ పత్రికాధిపతిగా అది నా బాధ్యత! ఓ మామూలు పౌరుడిగా సమాజంపట్ల, సాటి మనిషిపట్ల నీకూ బాధ్యత వుంది అని నువ్వు అనుకుంటున్నప్పుడు ఓ పత్రికని నడిపేవాడిగా నాకు అంతకన్నా ఎక్కువ బాధ్యతే వుంటుందని నేను భావించడం సమంజసమేగదా? " అన్నాడాయన.

అతడానందంగా తలూపాడు.

"ఆ నమ్మకంతోనే నేను మిమ్మల్ని వెదుక్కుంటూ వచ్చాను! ఇంతవరకూ ఈ విషయం మన ఇద్దరి మధ్యనే వుంది! ఈ డైరీల్లోని కథ పుస్తకరూపంలోకి వచ్చేసరికి కనీసం కొన్ని పదులమందికైనా తెలుస్తుంది. వాళ్లల్లో ఎందరో భక్తులు వుండొచ్చు! ఒకరిద్దరు శ్రీనివాసరావు విధేయవర్గంలోనివారో, వారి బంధువులో, స్నేహితులో, కనీసం వాళ్లకి తెలిసినవాళ్లో వుండొచ్చు" తన ఆందోళనని వ్యక్తపరిచాడతడు!

"కంగారుపడవద్దు ఫణీంద్రా! వీలయినంత తక్కువ మందితో పని జరిపిస్తాను. ఆ కొందరూ కూడా పేపర్ జనంలోకి వచ్చినదాకా పత్రికాఫీసులోంచి బయటికి వెళ్లకుండా జాగ్రత్త పడతాను! లేకపోతే అనివార్య పరిస్థితులు సంభవించడమేగాక నామీద ఏ స్థాయిలో వత్తిడి వస్తుందో వేధింపులొస్తాయో నేను వూహించలేని విషయం కాదు! మరో అరగంటలో నేను ఆఫీసుకు బయలుదేరతాను" అన్నాడు

అప్పుడు సమయం ఎనిమిదిన్నర!

మరికొద్ది గంటల్లో పేపర్ ముద్రణ మొదలవుతుంది.

ఫణి చకితుడై "అంటే... ఈరోజే" అన్నాడు!

"అవును! శ్రీనివాసరావు త్వరలోనే అమెరికానుండి వస్తాడంటున్నావుగదా! ఈ కథ జనంలోకి ఈలోపే వచ్చేస్తే మంచిదికదా! మనక్కాస్త టైమ్ కూడా వుంటుంది. మహా అయితే రేపు పేపర్ రెండుమూడు గంటలు ఆలస్యంగా వస్తుంది. అంతేగదా? " అన్నాడాయన.

అతడు ఆశ్చర్యానందాలనుండి తేరుకుంటూ "థాంక్యూసర్.. థాంక్యూ" ఏదో అనబోయాడు!

"అక్కడితో ఆగండి ఫణీంద్రా! ఇది నా బాధ్యత కూడా అన్నానుగదా! అన్నట్టు మిమ్మల్ని నేనో విషయం అడగవచ్చా?"

"అడగండి"

"రేపామెకొక కొత్త జీవితాన్ని..." అంటూ అర్థోక్తిలో ఆగిపోయాడు.

"నేనే ఇస్తాను అన్నంత పెద్ద పదం వాడనుగానీ ఆమెతో జీవితాన్ని పంచుకోవాలన్న నిర్ణయానికి వచ్చాను"

"యూ ఆర్ గ్రేట్! అయామ్ రియల్లీ ప్రౌడ్ ఆఫ్‌యూ మైబోయ్" ఆయన మనస్ఫూర్తిగా అతడి భుజం తట్టి అభినందించాడు!

"మీరు చేస్తున్న మేలుని నేను నా జీవితంలో మరవలేను" చెప్పాడతడు.

"ఎందుకైనా మంచిది! నువ్వు నా ఇంట్లోనే వుండిపోరాదూ! రేపు ఎలాంటి

పరిణామాలు సంభవిస్తాయో చెప్పలేం! నీ ప్రాణాలకి రక్షణ కావాలిగదా" చెప్పాడాయన.

అతడు తల అడ్డంగా వూపాడు.

"నేను పేటూరు ఆశ్రమం ప్రాంతంలో వుండాలి. ఆమెని బయటికి తెచ్చే ప్రయత్నం చెయ్యాలి గదా! వీలయితే ఈ రాత్రే తెల్లవారేలోగా ఆ ప్రయత్నం చెయ్యాలని వుంది"

"జాగ్రత్త..." హెచ్చరించాడాయన.

ఆ పరిస్థితుల్లో అంతకంటే చెయ్యగలిగిందేంలేదు.

మరో పది నిముషాల తర్వాత ఆ భవంతినుండి ఆయన కారూ, అతడి స్కూటర్ బయటికి వచ్చాయి.

ఆయన కారు పత్రికాఫీసువైపు సాగిపోతే అతడి స్కూటర్ పేటూరువైపు బయలుదేరింది.

ఆయన రాష్ట్రంలో అత్యధిక సర్క్యులేషన్ కలిగిన సంచలనాత్మక పత్రికకి అధిపతి అయితే అతడొక సాధారణ స్కూలు టీచర్!



"అమ్మా తులసీ! ఇంకా బద్ధకంగా వున్నావేం? భక్తులంతా నీ దర్శన భాగ్యం కోసం ఎదురు చూస్తున్నారమ్మా! లేచి తయారవు" మృదువుగా చెప్పాడు శ్రీనివాసరావు.

తులసి తలెత్తి చూసింది.

ఆ కళ్లు నిస్తేజంగా వున్నాయి.

"ఏమ్మా అలా వున్నావు? ఒంట్లో బావుండలేదా ఏం? " ఆందోళనగా అడిగాడు!

"అదేం లేదు పెద్దమామయ్యా! ఈ రోజు నేను రాలేను!"

"ఏమ్మా? ఎందుకని? "

"రావాలనిపించడంలేదు!"

"అలా అంటే ఎలా తల్లీ? నీకోసం ఎంతెంత దూరం నుండో వచ్చిన భక్తులు పడిగాపులు పడుతున్నారు! వాళ్లకి ఆశాభంగం కలిగిస్తావా? పైగా వాళ్లు ఎన్నెన్నో కానుకల్తో వచ్చారు కూడా" లాలనగా చెప్పాడు!

"అవును తులసమ్మా! ఈ రోజు వజ్రాలంకరణ చెయ్యాలని కొందరు ఆశపడుతున్నారు" నడివయస్కురాలైన భూదేవమ్మ చెప్పింది.

తులసి తల్లి వైపు చూసింది. నిర్లిప్తత తప్ప రెండో భావం ఆమెలో కనబడలేదు.

"నువ్వు కాస్త హుషారుగా వుండాలమ్మా! ఫారిన్ నుండి ఏదో కాన్ఫరెన్స్‌కు డెలిగేట్స్‌గా వచ్చిన కొందరు ఈ సాయంత్రమే తిరిగి వెళ్లిపోవాలట. రేపటి ఫ్లయిట్‌కి టికెట్ బుక్ చేయించుకొచ్చారట" మృదువుగా చెప్పాడు.

ఇంతలో శ్రీనివాసరావు సెక్రటరీ వచ్చాడు.

"సార్! మంత్రిగారి బంధువులు ఇరవై అయిదు వేల రూపాయల పట్టుచీర తెచ్చారు. అమ్మవారిచేత కట్టించమంటున్నారు" చెప్పాడు.

"కట్టిద్దాం" చిరునవ్వు నవ్వాడు శ్రీనివాసరావు.

"కాసీ ఉత్తరాది నుండి వచ్చారు చూడండి అక్కడి గవర్నరుగారి బంధువు! అతడుకూడా తను తెచ్చిన జలతారు పట్టు

చీర కట్టించాలనుకుంటున్నారు" చెప్పాడు సందేహంగా!

చెక్కుచెదరని చిరునవ్వుతో "ఆ జలతారు పట్టుచీర ఖరీదెంత? " అడిగాడు.

"ఎనభై అయిదువేలు! తన మనుషుల్ని కంచిలో తిష్టవేయించి నికరమైన జరీతో నేయించాడట. ఆ చీరని అమ్మవారిచేత కట్టించి దాన్ని పట్టుకెళ్ళి అమెరికాలో వున్న భక్తులకి ప్రజంట్ చేయాలట. అతగాడికదో రాజకీయ లబ్ధి. మంత్రిగారి బంధువేమో చీరని అమ్మవారికే సమర్పిస్తామంటున్నారు"

"నువ్వెళ్ళి అతని చీర తీసుకునిరా! అమ్మవారు చీరకట్టుకుని ఆశీర్వదించినందుకు పదిహేను వేల అమెరికా డాలర్లు ఆశ్రమానికి చందా అడుగు! మంత్రిగారి బంధువుల్తో నెలరోజులక్రితమే ఈరోజు చీర బుక్ అయిందని చెప్పి రేపటిదాకా వాళ్ళని ఆగమను. అంతగా వాళ్లు వెళ్లిపోవాలంటే అమ్మవారు వాళ్ళ చీరని చేత్తో ముట్టుకుని ఆశీర్వదిస్తుందని చెప్పు" అన్నాడతను అదే చిరునవ్వుతో.

ఈ సంభాషణంతా తులసి వింటోంది. అయిదు నిముషాల్లో ఆ రెండు పట్టుచీరలూ వచ్చాయి.

"మంత్రిగారి బంధువులు రేపటిదాకా వుంటామంటున్నారు సర్" చెప్పాడు అనంత్.

"గుడ్! నువ్వెళ్ళి ఫారిన్ డెలిగేట్స్‌తో రేపు అమ్మవారు కట్టబోయే చీరని లక్ష రూపాయలకి వేలం ఇచ్చి తీసుకెళ్ళమని చెప్పు. అమ్మవారు పదిహేను నిముషాల్లో దర్శనం ఇవ్వబోతూన్నారని చెప్పు" అంటూ తులసి వేపు చూశాడు.

తులసి ఆలోచిస్తోంది. కేవలం అయిదే అయిదు నిముషాల్లో మామయ్య తన వ్యాపారంలో ఎంత సంపాదించాడా అని లెక్కలు వేసుకుంటోంది.

"సీనయ్యా ఈ రెండు చీరలూ బావున్నాయి. ఇరవై అయిదువేల రూపాయల చీరని భారతికి ఇద్దామనుకున్నానే" అంది.

"భారతికి చీరలకేం తక్కువ. డబ్బు తీసుకెళ్ళి కంచిలో తనక్కావాల్సినవి నేయించుకోమను. తులసి కట్టిన చీరలు అక్షర లక్షల విలువ పలుకుతున్నాయి"

"నిజమేలే" చీరల్ని తిప్పితిప్పి సంతృప్తిగా చూస్తూ అంది.

తల్లినే రెప్పవాల్చకుండా చూస్తోంది తులసి. నిస్వార్థభరితమైనది అంటూ ఈ ప్రపంచంలో ఏదైనా వుంటే అది తల్లి మనసేనని అన్నవారెవరోగానీ ఇప్పుడు తన తల్లిని చూస్తే ఏమంటారు?

"తులసీ నువ్వెళ్ళి ఈ చీర కట్టుకొని డైమండ్ జ్యూయెలరీ అలంకరించుకుని రా! సహాయంగా హేమని పంపేదా? " అడిగాడు శ్రీనివాసరావు.

తల అడ్డంగా తిప్పి అతడు అందించిన ఎనభై అయిదు వేల రూపాయల జలతారు పట్టుచీర తీసుకుని లోపలి గదిలోకి వెళ్ళింది తులసి.

"నువ్వు కాస్త వంటశాలకి వెళ్ళి ఫారినర్స్‌కి అవసరమైన వంటకాల్ని ఎలా చేస్తున్నారో గమనించు భూదేవీ" అన్నాడతను.

అతడి మాటల్లో శ్లేషని అర్థంచేసుకుని తలూపి వెళ్ళిపోయింది భూదేవమ్మ!

మేనకోడలికోసం ఎదురుచూస్తూ విశాలమైన ఆ హాల్లో ఖరీదయిన సోఫాలో కూర్చున్నాడు శ్రీనివాసరావు.

అతడి చేతులకి వజ్రపుటుంగరాలు ధగధగ మెరుస్తున్నాయి.

అతడి కళ్ళకున్న బంగారు ఫ్రేము కళ్ళజోడూ, ధరించిన సిల్కు బట్టలూ ధగధగ మెరుస్తున్నాయి.

అతడెందుకో తనలోతనే నవ్వుకున్నాడు. అంతలోనే తులసి నిర్లిప్తత గుర్తొచ్చి అతడి పెదాలమీద నవ్వు ఆగిపోయి ఆలోచనలో పడిపోయాడు.

ఇంతలో మళ్ళీ సెక్రటరీ అనంత్ వచ్చాడు.

కనీసపు మర్యాదపూర్వకమైన అనుమతినైనా కోరకుండా ఎక్కడికైనా, అతడేస్థితిలో వున్నా రాగలిగిన అధికారం అతడొక్కడికే వుంది!

"ఇపుడే మెసేజ్ వచ్చింది సార్! గవర్నర్ ఎల్లుండి సతీసమేతంగా పేటూరు రావాలనుకుంటున్నారట! ఓ రాత్రి బసచేస్తారట" చెప్పాడు.

"ఒకటో నెంబర్ కాటేజీ తాళం తీసి సిద్ధంచెయ్యించు. ఆయన పరివారానికి వాళ్ళ స్థాయికి తగినట్టు కాటేజీలూ రూములూ ఎలాట్ చెయ్యి! ఎందరొస్తున్నారట? "

"ఈ సాయంత్రానికిగానీ పూర్తి వివరాలు తెలీవు"

"సరే! నేను చెప్పిన జాగ్రత్తలు తీసుకో! స్పెషల్ కుక్‌ని ఏర్పాటుచెయ్యి! డాక్టర్ విలియమ్స్‌కి ఫోన్ చెయ్యి! అందుబాటులో వుండమను. గవర్నర్ దంపతులకి ఖరీదయిన పట్టువస్త్రాలు ఏర్పాటు చెయ్యి. ఓ వెండి పళ్ళెం, బంగారు కుంకుమభరిణె సిద్ధంగా వుంచు"

గవర్నర్ సందర్శనమూలంగా ప్రత్యేకమైన ప్రత్యక్ష ఆదాయం లేకపోయినా బోలెడు పబ్లిసిటీ మాత్రమేగాక పెద్దపెద్ద వాళ్లతో పరిచయం, నాయకుల్తో సంబంధాలు కుదురుకుంటాయి. తద్వారా ఆశ్రమానికి విరాళాలూ, కానుకల రూపంలో చెప్పలేనంత ఆదాయం.

శ్రీనివాసరావు ఆలోచనల్లోనుండి బయటికివస్తూ, "అనంత్! ఆ కొత్తగా వచ్చిన టీచర్ వ్యవహారం" అంటూ అర్థోక్తిలో ఆపేశాడు.

"గమనిస్తూనే వున్నాను. తరచూ ఆశ్రమానికొస్తున్నాడు! ఇప్పుడు కూడా భక్తుల్లో వున్నాడు" చెప్పాడు.

శ్రీనివాసరావు నొసలు ముడివడింది "వాడి చరిత్ర తెలుసుకున్నాంగదా! నాకేదో అనుమానంగా వుంది" చెప్పాడు.

"వాడి మొహం వాడేం చెయ్యగలడు! ఏకాస్త అనుమానం వచ్చినా కాళ్ళూ కీళ్లూ విరిచేస్తాను" చెప్పాడు అనంత్ ఎర్రబడిన మొహంతో.

"జాగ్రత్త! వాడికి పౌరహక్కుల సంఘాలతోనూ విజ్ఞానవేదిక లాంటివాటితోనూ సంబంధాలున్నాయిట! వాడి వ్యవహారం ముదిరితే చాలా జాగ్రత్తగా ఖండించాలి! అల్లరికాకూడదు" చెప్పాడు.

"మీరేనా ఇలా మాట్లాడుతోంది? " ఆశ్చర్యంగా అన్నాడు అనంత్!

"వాడొక సాధారణ వ్యక్తి మాత్రమే అయి వుంటే ఇంతగా ఆలోచించాల్సిన పనేంలేదు. వాడు, వాడి కుటుంబం సమాజసేవలో మునిగి తేలుతూన్న వ్యక్తులు! ప్రజా సంఘాల్లో ప్రముఖ పాత్ర పోషిస్తూన్న వాళ్ళు! వాళ్ళతో పేచీ రాకూడదు. అందుకే జాగ్రత్త పడమంటున్నాను"

అనంత్ తలూపాడు.

అయితే అతడి మొహంలో ఎవడో బిచ్చగాడికి మన స్థాయినుంచి భయపడటం ఏమిటి అన్న అసంతృప్తి.

అదే సమయంలో ఆశ్రమం ఆవరణలో వున్న చెట్ల కింద కూర్చునీ నిల్చునీ అమ్మ వారికోసం ఎదురుచూస్తున్నారు వందలాది మంది భక్తులు. అక్కడ కూర్చోడానికి సిమెంట్ బల్లలున్నాయి. ఆ తోట ఇంద్రుడి ఉద్యానవనమంత అందంగానూ విశాలంగానూ వుంది! వాళ్ళల్లో రాష్ట్రేతరులూ విదేశాలనుండి వచ్చినవారూ అనేకమంది ఉన్నారు. విద్యావంతులున్నారు. విద్యాహీనులున్నారు. ఆగర్భ శ్రీమంతులున్నారు. అష్టదరిద్రులు వున్నారు. ఆరేళ్ళ పిల్లలున్నారు. ఎనభై ఏళ్ళ వృద్ధులున్నారు. అతను వాళ్ళందర్నీ గమనిస్తూన్నాడు. గొంతు తగ్గించి అన్ని భాషల్లోనూ వాళ్ళు మాటాడుకుంటున్న మాటలు అతడి చెవిలో బడుతున్నాయి.

"పేటూరమ్మ మహిమగలతల్లి! పద్దెనిమిదేళ్ళుగా నాకు సంతానం లేదు! ఆశ్రమానికొచ్చాక అమ్మవారి చేతి పనస తొనతో నాకీ బిడ్డపుట్టింది" ఏడాది పాపని చూపిస్తూ చెబుతోందో నలభై ఏళ్ళ స్త్రీ.

"అంతేనా? నాకు కాన్సర్ నయమైంది" ఓ నార్త్ ఇండియన్ చెబుతున్నాడు.

"పేటూరమ్మ దయగల తల్లి! ఆ తల్లి చిరునవ్వు సోకితే చాలు! సర్వరోగాలూ మనలోని దోషాలూ నశించిపోతాయి! మనసుకి ప్రశాంతత చేకూరుతుంది"

ఓ శ్వేత జాతీయుడు వారి సంభాషణల్ని ఇంగ్లీషులోకి తర్జుమా చెయ్యించుకుని వింటున్నాడు ఆసక్తిగా! అనువాదకుడైన ఆ వ్యక్తి అతడికి అమ్మవారి గురించి వివరిస్తున్నాడు.

"పేటూరమ్మ అసలు పేరు రామతులసి! దైవాంశ సంభూతురాలు. కోరికోరి ఓ నిరుపేద కుటుంబంలో పుట్టింది. పదమూడో ఏట తన గురించి కుటుంబసభ్యులకి, ప్రపంచానికి తెలియజేసి భవబంధాలకి దూరంగా ఇక్కడికి చేరుకున్నారు"

"అయితే ఆమెతో తల్లీ ఇతర కుటుంబ సభ్యులు వుంటారు గదా? "

"అది వాళ్ళ మమకారం! ఆమె దృష్టిలో వాళ్ళకీ మనకీ తేడా లేదు!"

ఫణి నవ్వుకుంటున్నాడు. అనువాదకుడిలా వ్యవహరిస్తున్న వ్యక్తి ఎప్పుడూ అదే పాత్రని పోషిస్తుంటాడు. భక్తుల్లో కలిసిపోయిన అలాంటి వాళ్ళు ఇంకొందరున్నారు. బహుశా అతడు ఆశ్రమం మనిషి కావచ్చు.

"పేటూరమ్మని పర్సనల్‌గా కలిసి మాట్లాడవచ్చా? " అడుగుతున్నాడతడు.

"ఓ, కలవచ్చు! అయితే స్పెషల్ పర్మిషన్ కావాలి" రెండో వ్యక్తి చెప్పాడు.

"ఎవరి పర్మిషన్? అమ్మవారిదా? "

"కాదు! అమ్మవారిని ఎవరు కలవచ్చో వారి అర్హతని, అవసరాల్నిబట్టి శ్రీనివాసరావుగారు నిర్ణయిస్తారు"

"అవసరం సరే! అర్హత అంటే? " సందేహంగా అడిగాడు.

"ఆశ్రమానికి కొంత విరాళం ఇవ్వగలిగి వుండాలి" చెప్పాడు.

అతడాశ్చర్యంగా "దేవతతో మాట్లాడేందుకు డబ్బెందుకు? ఇక్కడంతా డబ్బుమయంగా అనిపిస్తోంది. కాటేజీ ధర చాలా ఎక్కువే వుంది! భోజనం కూడా అంతే! అమెరికాలో రేట్లు ఇక్కడి ధరల్తో పోలిస్తే చాలా తక్కువ"

"అపచారం! అలా అనకూడదు" చెప్పాడు ఆశ్రమం వ్యక్తి.

ఈ సంభాషణ అంతా వింటున్న మరో శ్వేతజాతీయుడు "ష్... అలా అనకూడదు! ఈ డబ్బు అంతా ప్రజల సంక్షేమం కోసం వినియోగిస్తారు! మనలాంటి సంపన్నుల దగ్గర తీసుకుని పేదవారిని ఆదుకోవాలన్నది పేటూరమ్మ ఆజ్ఞ! ఆశ్రమం తరపున అమ్మవారి భిక్షగా వీళ్ళు స్కూళ్లు, కాలేజీలూ, ఆసుపత్రులూ, అనాథ ఆశ్రమాలూ, వృద్ధాశ్రమాలూ అనేక సంఘసేవా కార్యక్రమాలూ చేపడతారు. ఇంతటి మహత్కార్యాన్ని చేపట్టటం కేవలం అమ్మవారివల్లనే అయింది. పదేళ్ళనుంచి వస్తున్నానుగదా! నేనొచ్చేసరికి పేటూరమ్మ టీనేజర్‌గా వుండేది. శ్రీనివాసరావు వయసులో వుండేవాడు" పరవశంగా చెప్పాడు.

"అతడెవరు? " అడిగాడు మొదటి వ్యక్తి.

"ఆశ్రమానికో ట్రస్ట్ బోర్డ్ వుందిగదా! దాని ఎం.డి"

"అలాగా? " అంటూ అతడు జేబులోంచి పాకెట్ కెమేరా తీసి ఆశ్రమం పరిసరాల్నీ భక్తసమూహాల్ని మెయిన్ బిల్డింగ్‌నీ క్లిక్‌మనిపించసాగాడు.

అంతలోనే ఎక్కడినుండో ఓ వ్యక్తి దూసుకువచ్చి అతడి చేతిలోని కెమేరా లాక్కుని ఓపెన్‌చేసి రీల్ తీసేసి "ఇక్కడ ఫొటోలూ, వీడియో కవరేజ్‌లాంటివి నిషిద్ధం! ఆశ్రమ నియమాలకి వ్యతిరేకం" అని చెప్పి అతడికి

కెమేరా ఇచ్చేసి వెళ్ళిపోయాడు.

ఆ శ్వేతజాతీయుడు చిన్నబోయిన మొహంతో అన్నాడు. "నేను టూరిస్ట్‌గా భారతదేశంలోని ఎన్నో ప్రాంతాలు తిరిగాను. ఆధ్యాత్మిక సంబంధమైన ఏ ప్రదేశాల్లోనూ ఇలా ఫొటోలు తీసుకోవడాన్ని ఎవరూ వ్యతిరేకించలేదు" చెప్పాడు ఆశాభంగంతో.

"ఇక్కడ అది నిషిద్ధం! ఆశ్రమ వాతావరణం చాలా ప్రశాంతమైనది! దానికి భంగం వాటిల్లితే ఒప్పుకోరు" చెప్పాడు రెండో అమెరికన్.

ఫణి ఈ సంభాషణ అంతా వింటున్నాడు. శ్వేత జాతీయుడికి అనువాదకుడిగా పనిచేసిన వ్యక్తి ఈసారి నలుగురు ఉత్తరాది వాళ్ళ గ్రూప్‌లో చేరిపోయి అమ్మవారి మహిమలు వర్ణిస్తున్నాడు. దాదాపు వంద ఎకరాల విస్తీర్ణంలో వున్న పేటూరమ్మ ఆశ్రమం సువిశాలమైనది. సుందరమైనది. పండ్లతోటలు, పూలతోటలూ, పెద్దభవంతులు. మనుషులస్థాయి బేధాల్నిబట్టి, ఆర్థిక స్థోమతునిబట్టి కేటాయించబడే కాటేజీలు. ఉద్యానవనాల్ని పోలిన తోటల్లో రెండు మూడు చిన్న చెరువులు. మూడు నక్షత్రాల హోటళ్లని తలదన్నే భోజన ఫలహారశాలలు. అడుగడుగునా లాఠీలు తుపాకీలతో దర్శనం ఇచ్చే సెక్యూరిటీ సిబ్బంది. ఓ ఆసుపత్రి కూడా పెద్ద భవంతిలో వుంది.

పిల్లలకోసం రెండు ఆశ్రమ పాఠశాలలు వున్నాయి. వారు అతిముఖ్యుల పిల్లలై వుండాలి.

ఆశ్రమంనుంచి బయటికి వస్తే పేటూరు అని చెప్పబడే ఆ చిన్న గ్రామం మొత్తం ఆశ్రమ విస్తరణలో ధన కనక వస్తువాహన సముదాయంతో విలసిల్లుతూ వుంటుంది. స్కూళ్లు, వృత్తి విద్యాశిక్షణని ఇచ్చే కాలేజీలూ, ఎయిడ్స్‌తోసహా ఏ రోగానికైనా చికిత్స లభించే ఆసుపత్రుల సమూహం, షాపింగ్ కాంప్లెక్స్‌లూ, మ్యూజియం, పార్కులూ, హోటళ్లూ అన్నీ ఉన్నాయి ఒక్క సినిమా థియేటర్ తప్ప. ప్రతి భవంతి ముందు తులసి అంటూ పేటూరమ్మ పూర్వనామంతో మొదలయ్యే బోర్డ్ వుంటుంది. సర్వం ధనమయం! సంచుల్లో డబ్బుతో వస్తే అక్కడ దొరకని వస్తువు అంటూ లేదు! అవన్నీ ఆశ్రమం తాలూకా ఆస్తులే! అయితే ఆ వూరు డెవలప్ కాలేదు! ఆ వూరిజనం అతి సాధారణమైనవారు.

పదిహేను సంవత్సరాలక్రితం పేటూరమ్మ అక్కడ దేవతగా వెలిశాక స్థితిపరులు మధ్యతరగతివారుగానూ, మధ్యతరగతివారు పేదవారిగానూ, పేదవారు గర్భదరిద్రులుగానూ మారారు.

వారివారి జీవనాధారాలైన పొలాలు ఆశ్రమం ఆస్తుల్లో కలిసిపోయాయి! వారి వ్యాపారాలు దివాళతీశాయి.

సంవత్సరంలో సగం రోజులు వారి వృత్తి పనిముట్లు ఖాళీగా పడి వుంటాయి.

కొందరు బతుకుతెరువుకోసం పేటూరు వదిలేశారు. ఇంకొందరు వెళ్ళగొట్టబడ్డారు. ఇది మెజారిటీ వర్గం సమస్య అయితే ఇంకొందరు రాజీపడ్డారు. ఆశ్రమం ఎం.డి. శ్రీనివాసరావుకీ అతడి మనుషులకీ అమ్మవారి దయకీ పాత్రులైనవారు నిలదొక్కుకున్నారు. యువకులు ఆశ్రమం సెక్యూరిటీ ఫోర్స్‌లో చేరారు. కొందరు యువతీయువకులు ఆశ్రమం తాలూకా వివిధ వ్యాపార సంస్థల్లో ఉద్యోగాలు సంపాదించుకున్నారు. ఇంకొందరు బయట ప్రదేశాల్లోని సంస్థల్లో ఉద్యోగాల నిమిత్తం పంపబడ్డారు. అయితే వీరంతా విధేయవర్గానికి చెందినవారే! మిగతావారివి సాదాసీదా పేదబ్రతుకులు. చిత్రం ఏమిటంటే పదిహేను సంవత్సరాల నాడు ప్రభుత్వపరంగా ఆ వూళ్లో ఎన్ని సౌకర్యాలున్నాయో ఈనాడూ అన్నే వున్నాయి. ఒక ఎలిమెంటరీ స్కూలు మాత్రం వుంది. ఓ ప్రైమరీ హెల్త్ సెంటర్‌వుంది. ఓ

డొక్కు ఆర్.టి.సి బస్ తిరుగుతూంటుంది. మిగతా అన్నింటికీ వాళ్ళు ఆశ్రమంకి చెందిన వ్యాపార సంస్థలమీద లేదా బయట వ్వాళ్ళమీద ఆధారపడాల్సి వుంటుంది!

ఆశ్రమం నడుపుతున్న బస్ సర్వీస్‌లూ, వ్యాన్‌లూలాంటి రవాణా సౌకర్యాల్నీ వాళ్ళు ఉపయోగించుకుంటారు. డబ్బు కట్టగలిగినవాళ్ళు ఆశ్రమం స్కూళ్ళకీ ఆసుపత్రులకీ వెళతారు! మిగతా వాళ్ళ కథ మామూలే! వాళ్ళ జీవితాల్లో ఏమార్పూ లేదు! నిర్లిప్తత, నిరాశ, బతుకుపోరాటం, కష్టాలూ, దుఃఖం ఇవీ వాళ్ళ ఆస్తులు.

మొదట ఫణికి ఆ వూరు ట్రాన్స్‌ఫరయినప్పుడు "ఆశ్రమంపట్ల అనవసరమైన ఆసక్తిని పెంచుకోనంటేనే వెళ్ళు" అని సలహా ఇచ్చాడతడి తండ్రి!

సోషల్ వర్కర్‌గా సమాజంలో ఓ స్థాయిలో వున్న వ్యక్తి అయిన ఆయన అలా సలహా ఇవ్వడం అందులోని రిస్క్ ఏమిటో స్పష్టంగా చెబుతోంది.

"మనిషికి ఆదర్శభావాలూ, కుతూహలం, మూఢనమ్మకాల ఖండన, నిజానిజాల నిరూపణ అన్నవి సామాజిక బాధ్యత కావచ్చు కానీ ఎంతవరకూ? ఆ సమస్యకి పరిష్కారపు పోరాటంలో ఫలితం వుండదని, ఓటమి అనివార్యం అనీ, ప్రాణాలే ప్రమాదంలో పడతాయనీ అనిపించనంతవరకే! ఇంత సమస్యలమయమైన సమస్య జోలికి వెళ్ళకపోవడమే మంచిది" చెప్పాడాయన!

"నువ్విలా మాట్లాడడం నాకు నచ్చలేదు నాన్నా" చెప్పాడు.

"నేను ముందు తండ్రిని ఫణీ!

"పరిష్కారం లేని సమస్యలు ఆదినుంచీ అలాగే వుండిపోయాయి. మనల్ని మించిన వారెందరో వున్నా ఇలాంటి ఆశ్రమాలూ, బాబాలూ అమ్మవార్ల విషయంలో వారేం సాధించలేకపోయారు.

"అంతేకాదు, అసలు వాళ్ళ జోలికి వెళ్ళడానికే ఇష్టపడరు వీళ్ళు! ఎప్పుడో ఓ పేపర్ స్టేట్‌మెంట్లో విమర్శించి చేతులు దులుపుకుంటారు!

"ఎందుకూ?

"జనం యొక్క ఆధ్యాత్మిక నమ్మకాల్ని ప్రశ్నించడం వాళ్ళెవరూ సహించరు! అందుకే భారతదేశంలో తామర తంపరల్లా, డబ్బే పునాదిగా ఇలాంటి ఆశ్రమాలు వెలుస్తున్నాయి. నువ్వా పేటూరమ్మ ఆశ్రమం విషయంలో ఎలాంటి ఆసక్తి చూపించనని నాకు మాట ఇవ్వు! లేదంటావా? నా నియమాలకి విరుద్ధమైనా సరే, జీవితంలో తొలిసారిగా ఏ నాయకుడి దగ్గరికో, ఉన్నతాధికారి వద్దకో వెళ్ళి నీ ట్రాన్స్‌ఫర్ కాన్సిల్ చెయ్యమని అర్థిస్తాను" అన్నాడాయన.

కుటుంబ సభ్యులంతా తండ్రినే సమర్థించడం విచిత్రమనిపించిందతడికి.

తల్లి మహిళా సంఘంలో స్త్రీల సమస్యల గురించి పోరాటం చేస్తుంటుంది.

అన్నగారు డాక్టర్ అయినా మూడు రూపాయల నామమాత్రపు ఫీజుతో పేదప్రజల సేవతో తలమునకలైవుంటారు.

అక్కా వదినా వృద్ధాశ్రమం నడుపుతున్నారు.

చెల్లెలు సారా వ్యతిరేకోద్యమంలో ప్రముఖ పాత్ర పోషించి చిన్నవయసులోనే పేరు ప్రతిష్టలు ఆర్జించుకుంది.

తనేమో తండ్రి కోరికతో మాత్రమేగాక తన సొంత అభిరుచి, ఆదర్శంతో ఉపాధ్యాయవృత్తిని ఎన్నుకుని ఏడెనిమిదేళ్ళ సర్వీసులో కుగ్రామాలు తిరుగుతూ గడుపుతున్నాడు.

తన నిజాయితీ, చిత్తశుద్ధి మూలంగా ఎక్కడా ఏడాదికిమించి నిలవలేక బంతిలా పనిష్మెంట్ ఏరియాలకి తన్నబడుతున్నాడు.

అది తనకి మరీ సంబరం! అతడి కుటుంబసభ్యులకి కూడా! ఎందుకంటే పనిష్మెంటు ఏరియాలు అని పేరుబడ్డవి అయితే పూర్తిగా వెనకబడినవే అయివుంటాయి.

అక్కడ అతడి అవసరం ఎలానూ వుంటుంది. అతడికి మానసిక సంతృప్తి లభిస్తుందని!

గతసారి అతడు వున్నచోట ఏ సమస్యలు లేకుండానే వున్నాడు. అయినా ఏ రాజకీయ నాయకుడి పలుకుబడితోనో స్థానికుడైన టీచర్ అక్కడికి రావడంతో అతడ్ని పేటూరుకి నెట్టారు. ఇది యాదృచ్ఛికంగా జరిగినా తను వెళ్ళాల్సినచోటుకే వెళుతున్నానన్న భావం అతడికి కలిగింది. అయితే కుటుంబసభ్యులకి మాత్రం అది నచ్చలేదు.

"అక్కడి ఏ విషయాల్లోనూ ఆసక్తి చూపించను! పట్టించుకోను. పేటూరి సాదా సీదా పిల్లలకి నాలాంటి టీచర్ అవసరం బాగా వుందని మీకు తెలుసు. నా ఉద్యోగ బాధ్యతల గురించి తప్ప మరేదీ పట్టించుకోను" అని బుద్ధిమంతుడిలా మాట ఇచ్చి అతను బస్సెక్కుతూంటే బస్టాండ్‌లో కూడా హెచ్చరించారు కుటుంబసభ్యుల్తోపాటు కొందరు స్నేహితులు కూడా!

ఓ చిన్న పట్టణంలోదిగి అక్కడినుంచి పేటూరు వెళ్ళే ఆశ్రమ వాహనంలో ఎక్కిన అయిదు నిముషాల్లోనే అతడిలో చెప్పలేనంత క్యూరియాసిటీ మొదలయింది. ఇప్పటిదాకా వారి ద్వారా వీరి ద్వారా వినడం, పేపర్లలో చదవడం తప్ప ప్రత్యేకంగా పేటూరమ్మని చూసివచ్చిన భక్తుల ద్వారా ఆమె కథలూ, మహిమలూ వినడం అదే ప్రథమం. అతడిలో విపరీతమైన ఆసక్తితో పాటు ఆశ్రమంలోకి వెళ్ళాలన్న కోరిక కూడా బలపడింది.

గత నెలరోజులుగా అతడు ఆరుసార్లు ఆశ్రమంలోకి వచ్చాడు. అక్కడ ఆమెను గురించి విన్నాడు. చాలా చూస్తున్నాడు. ఆశ్రమం బయట జనంనుంచి మరోలాంటి సంగతులు విన్నాడు. ఆశ్రమం మూలంగా వాళ్ళెంతగా నష్టపోయారో కళ్ళారా చూస్తూ చెవులారా వింటున్నాడు.

అక్కడ అతడికి అడుగడుగునా కనిపిస్తోంది ఒకటే! ధనం.. ధనం... దోపిడీ... దోపిడీ... అంతే!

అయితే అతడికి తెలీని సంగతి ఊహించలేని సంగతి మరోటి వుంది. అతడ్ని గురించిన అన్ని సంగతులూ అతడి ఆసక్తిని గురించిన వివరాలూ ఆశ్రమానికి వచ్చిన పదిరోజులకే శ్రీనివాసరావుకి చేరిపోయాయి! ఎన్నో కళ్ళు తన కదలికల్ని గమనిస్తున్నాయని అతడికి తెలీదు.

★ ★ ★

అలంకరించుకుని గదిలోంచి హాల్లోకి వచ్చింది తులసి! ఆ వేలాది రూపాయల పట్టుచీరలో ఆమె అపురూప సౌందర్యం మహాద్భుతంగా మెరిసిపోతోంది. పెద్ద కుంకుమబొట్టు, ఒంటినిండా వజ్రాల నగల్తో భక్తులకి దివినుంచి భువికి దిగివచ్చిన దేవతలా కనిపించే తన మేనకోడలి సౌందర్యం ఎప్పటిలానే అప్పుడూ ఆశ్చర్యచకితుణ్ని చేసింది శ్రీనివాసరావుని.

"ఆహాఁ... ఎంత అందంగా వున్నావు తులసీ" అన్నాడు అతడు సంభ్రమంతో.

ఆమె చివ్వున తలెత్తి చూసింది.

ఒళ్ళంతా కళ్ళున్నట్టు చూస్తూన్న శ్రీనివాసరావు అంతలోనే సర్దుకుని "ఎంత పవిత్రంగా వున్నావు? " అంటూ సవరించాడు.

"అచ్చు దేవతలా వున్నావు" అన్నాడు.

"నాకెప్పుడూ అలా అనిపించలేదు మామయ్యా! నా ప్రతిరూపాన్ని అద్దంలో చూసుకున్నప్పుడు నాకేం అనిపిస్తుందో తెలుసా? ఏ పండగనాడో పట్టుచీరతో చక్కగా తయారయి నా భర్తతో కలిసి ఏ గుడికో బయలుదేరబోయేప్పటి అలంకరణేమో అన్న అనుభూతి తప్ప నేను దైవాంశసంభూతురాలినన్న భావం నాకు ఎప్పుడూ కలగలేదు మామయ్యా" నెమ్మదిగా అంది.

శ్రీనివాసరావు బదులు చెప్పలేదు.

చెప్పలేక కాదు. చెప్పడం అతడికి ఇష్టం



వుండదు.

ఇరవై ఎనిమిదేళ్ళ అందాల తులసి అలా భవబంధాలపట్ల ఆసక్తి పెంచుకోవడం అతడికి నచ్చదు.

"సరిసర్లే! అవన్నీ మళ్ళీ ఆలోచించుకుందాం! భక్తులు ఎదురుచూస్తుంటారు పదమ్మా" అన్నాడు.

మళ్ళీ తనే "ఈమధ్య ఆ పెదవులమీద నవ్వుని మర్చిపోతున్నావు తులసీ. నవ్వు మొహంతో ప్రశాంతంగా వుండాలమ్మా" చెప్పాడు అనునయంగా!

'నా శరీరానికి కృత్రిమమైన అలంకరణ చేసి ఓ దేవతగా చూపించగలిగావు! కానీ మొహం మీద చిరునవ్వుని ఎలా తెప్పించగలవు మామయ్యా' మనసులో అనుకుంది తులసి!

ఆమె దర్శనం ఇవ్వబోతోందన్న సూచనగా ఆలయప్రాంగణంలో ఘంటానాదం భక్తుల్ని హెచ్చరించింది. కాటేజీల్లో వున్న ఖరీదయిన భక్తులతోసహా అందరూ ప్రధాన భవంతిలోని సువిశాలమైన హాల్లోకి చేరుకున్నారు.

అంతా అక్కడి పట్టుతివాచీల మీద వరసల ప్రకారం ఒక పద్ధతిలో ఆశీనులై పేటూరమ్మకోసం ఆత్రంగా ఎదురుచూడసాగారు. అయిదు నిమిషాల తరువాత ఒక ప్రత్యేక ద్వారంలోనుండి శ్రీనివాసరావు వెంట నడ



వగా ఛత్రంపడుతూ వింజామరలు వీస్తూ సేవకులు వెంటరాగా ఆశ్రమంలోని మరో ప్రముఖ వ్యక్తి పూలతో మెత్తని దారిని ఏర్పరుస్తుండగా సహజమైన హంసగమనంతో ఆ హాల్లోకి ప్రవేశించింది ఆమె!

ఒక్కసారిగా 'పేటూరి మాతకీ జై' అంటూ గుండెలు పులకరించేలా ఆగకుండా అయిదునిమిషాలపాటు జయజయధ్వానాలు చేశారు భక్తులు. తులసి సింహాసనం లాంటి ఆసనంలో ఆశీనురాలైంది. శ్రీనివాసరావు చేతిసంజ్ఞతో జనం ఒక్కసారిగా జయజయధ్వానాల్ని ఆపి నిశ్శబ్దాన్ని ఆశ్రయించారు.

తులసి పదిహేను సంవత్సరాలుగా తనకి అలవాటయిన చిరునవ్వుతో అందర్నీ కలియజూసింది.

శ్రీనివాసరావు కళ్ళతోనే వచ్చిన భక్తుల్లో బాగా ప్రయోజనకరమైనవారిని అంచనా వేస్తున్నాడు.

అమ్మవారి పక్కన ప్రత్యేకంగా అమర్చబడిన కుర్చీల్లో ఆశ్రమం ట్రస్టీలూ ఎం.డి. శ్రీనివాసరావు కూర్చున్నారు. ట్రస్టీలంటే వాళ్ళంతా శ్రీనివాసరావు బంధువర్గం మిత్రవర్గంలోనివారే. ప్రతి మంగళవారం వారంతా బోర్డ్‌మీటింగ్ పెట్టుకుని ఆదాయ వ్యయాల పట్టికలు సరిచూసి ఆశ్రమం సంస్థల అభివృద్ధి గురించి సుదీర్ఘ చర్చలు జరిపి నిర్ణయాలు తీసుకోవడం ఆనవాయితీ!

వారెవరికీ వేరే వ్యాపకాలు లేవు. అమ్మవారి పేరుమీద హాయిగా బ్రతుకుతున్నారు.

అమ్మవారొచ్చి అక్కడ కూర్చున్న క్షణాల్లో ఓ భక్తురాలు ఇంకో భక్తురాల్ని "ఇక్కడ నిత్యాన్నదాన సంతర్పణ వుందటగా భక్తుల కోసం. వంటకాలూ అవీ రుచికరంగా ఉంటాయటగా" అని అడగడం విన్న ఫణీంద్ర నవ్వు ఆపుకోలేకపోయాడు.

ఆశ్రమంలోని ఆ ప్రముఖుడు అమ్మవారి మహిమల్ని, ఆవిడ చేస్తోన్న నిస్వార్థ సమాజసేవను గురించి, తనని నమ్మినవారి ఎడల ఆమె యొక్క ప్రేమాభిమానాల్ని దయా కటాక్షవీక్షణాల గురించి చెప్పి తన ప్రసంగం ముగించి "అమ్మవారు ఆహ్వానించిన భక్తులు ఒకరొకరే వచ్చి ఆవిడ ఆశీర్వాద భాగ్యాల్ని అందుకోవచ్చు" అంటూ అనుమతి ఇచ్చాడు.

ఇదే సమయంలో శ్రీనివాసరావు వంగి తులసి చెవిలో ఏదో చెప్పాడు. ఆమె తల ఊపింది. ఫణి రెప్పవాల్చకుండా చూస్తున్నాడు. నమ్మినవారి కొంగుబంగారంలా, పోతపోసిన బంగారపు ప్రతిమలా, దివినుంచి దిగివచ్చిన మహాలక్ష్మిలా, భక్తిభావం కలిగించేలా వుంది ఆమె! ఆమె చిరునవ్వు నవ్వుతోంది.

అయితే ఎందుకనోగానీ ఆమెను తొలిసారి చూసినప్పటినుండి కూడా ఆమె నవ్వులో ఏదో సహజత్వం లోపించినట్టు అతడికి అనిపించడమే చిత్రం!

దేవత ముసుగులో భోగభాగ్యాలను అనుభవించే ఆమెకేం కొరత అని అతడు తనకి తను సర్దిచెప్పుకోబోయినా ఎందుకనో పదే పదే అదే ఆలోచనకి గురికావడం ఆశ్చర్యంగా ఉందతనికి.

మొట్టమొదట చెయ్యిచాపి ఓ స్త్రీని, ఓ పురుషుడ్ని, ఓ బాలుడ్ని దగ్గరికి పిలిచింది పేటూరమ్మ. వాళ్ళెళ్ళి సాష్టాంగ పడిపోయారు. బాలుడికి ఓ పండుని సృష్టించి ఇచ్చింది. పురుషుడికి శివలింగాన్ని స్త్రీకి ఓ తాయెత్తునీ, పసుపు కుంకుమల్ని ఇచ్చింది. చూస్తున్న భక్తులు పులకించిపోయారు. అసలు ఆమె దయకి పాత్రులైన వారి సంగతి చెప్పనే అక్కరలేదు. విదేశీయులైతే మెస్మరైజ్ చేయబడినవారిలా అద్భుతంగా చూస్తున్నారు. ఆమె వారితో చిన్నగా మాట్లాడడంతో మిగతావారికి వినిపించడం లేదు.

మొదట ఆమె ఆశీర్వచనాలు అందుకున్న వారిలో బాలుడూ, స్త్రీ నిరుపేదవర్గానికి చెందినవారైతే పురుషుడు మధ్యతరగతి బడుగుజీవి. ఫణికి తెలుసు! అదో టెక్నిక్. రోజూ జరిగేతంతు!

రెండో విడతగా ఆమె ఓ ఫారినర్‌ని ఆహ్వానించింది. అతడామె పాదాల దగ్గర వుంచిన డాలర్లకట్ట మరుక్షణం మాయమైంది.

అతడికామె ఓ శిలువను బహూకరించింది. అతడు పడిపడి దణ్ణాలు పెట్టాడు. ఆ తరువాత ఆమె చేతిసంజ్ఞతో ఒక్కరొక్కరినే చూపించనారంభించింది. అంత ఖచ్చితంగా ఆమె ధనవంతుల్నే గుర్తించడంలో గల సులభతరమార్గాన్ని ఫణీంద్ర ఊహించాడు. బహుశః ఆశ్రమవాసులు వారితో కలిసిపోయి వారి పక్కన కూర్చుండివుంటారు.

పిలువురాని భక్తులు నిరాశ చెందుతున్నారు. ఓ గంట మాత్రమే ఈ ఆశీర్వచన కార్యక్రమం కొనసాగుతుంది. మిగతావారు రేపటికోసం ఎదురుచూస్తారు. వారి వారి స్థోమతనుబట్టి ఆశ్రమం ఆవరణలోనో లేదా బయట హోటళ్ళలోనో వుంటారు. వారి మూలంగా ఆశ్రమానికి ఊహకందనంత ఆదాయం. ఇక హుండీల ద్వారా వచ్చే ఆదాయం చెప్పలేనంత. బీదా బిక్కీ దగ్గర్నుండి ఆగర్భశ్రీమంతులదాకా హుండీకి ఏదో ఇంతని సమర్పించనివారు వుండరు. నిలువెత్తు హుండీలు ఆరింటిని వారంలో మూడుసార్లు తీసేరోజులు కూడా వుంటాయట.

రాష్ట్రంలో అత్యధిక ఆదాయం కలిగిన ఇలాంటి ఆశ్రమాల్లో పేటూరమ్మ ఆశ్రమం రెండు మూడు స్థానాల్లో వుండొచ్చు అని ఒక అంచనా! దైవప్రతినిధులం... కాదు... కాదు... సాక్షాత్తూ దైవాంశ సంభూతులం అని చెప్పుకుంటూన్న అమ్మవార్లూ, బాబాలూ, స్వాములూ ఎన్నివిధాల వీలయితే అన్నివిధాలా భక్తుల్ని తరింపజేస్తూనే ఉంటారు.

పురాణాల్లో చెప్పబడిన రాముడూ కృష్ణుడులతోపాటు, బుద్ధుడూ, జీసెస్ క్రైస్టలాంటి దైవాంశ సంభూతులైన మహాపురుషులు ప్రజలకోసం సర్వస్వం ధారపోసినవారేగానీ ఇలా శివలింగాలూ, శిలువలూ, మేడిన్ జపాన్ వాచీలూ సృష్టించి ఇవ్వలేదు. ధర్మ బోధలూ, దుష్టసంహారాలూ చేశారేగానీ మనుషుల్లానే బతికారు. ఇలా నిలువెల్లా నగలు ధరించుకొని విలాసాల్లో మునిగితేలలేదు. జనంకోసం అవి చేస్తున్నాం ఇవి చేస్తున్నాం అంటారుగానీ వీరి ప్రతిక్రియలోనూ ధనాపేక్ష! స్కూల్‌కానీ కాలేజీకానీ హాస్పిటల్‌కానీ సామాన్య జనానికి అందుబాటులో వుండవు.

ఒకింత ఇచ్చి నాలుగింతలు పుచ్చుకోవడం సమాజసేవా?

ఫణికి నవ్వొచ్చింది. ఆగ్రహం కలిగింది. దైవాంశ సంభూతులంటే ఎవరు? కుళ్ళాయి కట్టుకుని జీవితాన్ని జనంకోసం ధారపోసిన ఓ గాంధీ, దేశంకోసం జీవితాన్ని అంకితం చేసిన ఓ సీతారామరాజూ ఇలాంటివారు! కానీ వీళ్ళలా వాళ్ళు తమని ఎక్స్‌పోజ్ చేసుకోలేదు. పేటూరమ్మ చెయ్యి ఊపుతోంది. చప్పున లేచాడు ఫణి.

"నువ్వు కూర్చో అమ్మవారు పిలిచింది నిన్ను కాదు. ఇతన్ని" ఫణి పక్కనే వున్న లావుపాటి వ్యక్తిని చూపిస్తూ చెప్పాడు తరచూ అక్కడ కనిపించే ఓ వ్యక్తి.

తన అనుమానం నిజం. అతడు లావుగా ఇంత పొట్టతో పది వజ్రపుటుంగరాలు ధరించిన వ్యక్తి పక్కన కూర్చునివున్నాడు. అయినా ఫణి "అమ్మవారు నన్నే పిలుస్తోంది" అంటూ మొండిగా కదిలాడు.

ఈ దృశ్యం చూస్తున్న శ్రీనివాసరావూ మిగతావారిలో కొంత సంచలనం! డయాస్ మీద మైక్ దగ్గరున్న వ్యక్తి ఏదో చెప్పబోయాడు. ఇంతలో ఫణి కూడా వూహించని

విధంగా అతణ్ణాగమన్నట్టు సంజ్ఞ చేసి ఫణి వేపు చిరునవ్వుతో చూసింది అమ్మవారు.

ఫణి తన ఆశ్చర్యాన్ని తనలోనే దాచుకుంటూ వేదికలాంటి ఎత్తయిన ప్రదేశపు మెట్లు ఎక్కసాగాడు. శ్రీనివాసరావుకి ఎవరో ఏదో చెప్పారు. అతడి మొహంలోని ప్రశాంతత మాయమైంది.

ఫణినే గమనిస్తోంది తులసి. ఇంతక్రితం కూడా నాలుగుసార్లు అతడ్ని గమనించిందామె. వీలయినంతవరకూ భక్తుల్లో మొదటి వరసలో కూర్చుంటాడు. జయ జయ ధ్వానాలు చెయ్యడు. మొక్కడు! తన దృష్టిలోకి రావాలన్న తపన ఆతృత అతడిలో మచ్చుకి కూడా కనిపించవు. అయితే అత్యంత పరిశీలనాత్మక దృష్టితో తనని గమనిస్తూంటాడు. అతడి మొహం ఆమెకి బాగా గుర్తుండిపోయింది. పైగా ఇప్పుడతడు తను పిలిచింది ఇంకో భక్తుడ్నని తెలిసి కూడా కావాలని పైకి లేచాడని కూడా ఆమె గ్రహించింది. ఆమెకి ఆగ్రహం కలగలేదు. ఆశ్చర్యం కలిగింది. 'బహుశః ఇప్పుడతడు తన దయాకటాక్ష వీక్షణాల కోసం ఆశపడుతూండి వుండొచ్చునేమో' అనుకుంది.

కానీ తన వూహ పొరపాటని నిరూపిస్తూన్నట్టు అతడు అందరిలా సాష్టాంగ నమస్కారం చెయ్యకపోగా, ఓ కొత్త పరిచయస్థురాలికిలాగా మర్యాదపూర్వకంగా చేతులు జోడించి నమస్కరించాడతడు. ఆమె ఆశ్చర్యాన్ని అణచుకుని తన అలవాటు ప్రకారం ఓ పండుని సృష్టించి అతడికి ఇస్తూ "నీ సమస్యలు పరిష్కరించబడతాయి" అంది.

అతడు నవ్వి, చాలా మెల్లిగా ఆమెకి మాత్రమే వినిపించేలా "నాకేసమస్యలూ లేవు తులసిగారూ! మీ గౌరవానికి భంగం కలిగించరాదనే దీన్ని స్వీకరిస్తున్నాను" అంటూ దాన్ని అందుకున్నాడు.

అక్కడినుంచి కదులుతూ ఆమె మొహంలోకి చూశాడు! నివ్వెరపోయినట్టు కనిపించిందామె.

అతడొచ్చి తన స్థానంలో కూర్చుంటూ ఇందాక అవకాశంకోల్పోయిన భక్తుడికి ఆ పండుని ఇచ్చాడు.

పిచ్చివాడ్ని చూస్తున్నట్టు అతడ్ని చూస్తూ మహాప్రసాదంలా అందుకున్నాడు అతగాడు.

ఈ దృశ్యాన్ని తులసి చూసింది! శ్రీనివాసరావు కూడా కనుబొమలు ముడివేసి చూశాడు.

ఆ తరువాత అరగంట సమయాన్నీ తులసి అన్యమనస్కంగానే గడిపింది.

తను ఏం తెలుసుకోవాలని, ఏం ఆశించి అక్కడికి వస్తున్నాడన్న దానిమీద ఓ స్పష్టమైన ఆలోచన లేనటువంటి ఫణి అమ్మవారి దృష్టిలోకి తను రాగలిగినందుకేగాక ఆమెని తను ఓ దేవతలా భావించడం లేదని ఆమెకి తెలియచేయగలిగినందుకు ఆనందించాడు.

అదే సమయంలో దీనివలన ఏదైనా 'ఇబ్బందులు ఎదురవుతాయా? ' అని కూడా ఆలోచించాడతడు.

అదేసమయంలో అతడికి తన స్కూల్ స్టూడెంట్ తల్లి ఒకామె తన మేనమామ వరస అయ్యే 'నరసయ్య' అనే వ్యక్తి ఆశ్రమంలో నమ్మకస్థుడైన నౌఖరుగా పనిచేస్తున్నాడని చెప్పడం గుర్తొచ్చింది.

ఇంతలో తులసి ఆశీర్వచనాల ఘట్టాన్ని ముగించి తన విశ్రాంతిమందిరానికి బయలుదేరింది.

ఆమె తల్లి, పినతల్లి ఇంకొందరు బంధువులూ కలిసి ఓ విశాలమైన హాల్లో వి.సి.పిలో ఏదో తెలుగు సినిమా చూస్తున్నారు. ఆశ్రమంలో ఓ మినీ థియేటర్ వుంది. వి.వి.ఐ.పి. లకోసం. కుటుంబసభ్యులు అక్కడికి వెళ్ళడానికి ఇష్టపడడు శ్రీనివాసరావు. జయింట్ సైజ్ స్క్రీన్‌తో వున్న టి.వి. సెట్‌లు వారివారి గదుల్లో పెట్టించాడు బంధుబలగం ఎంజాయ్‌మెంట్

కోసం. ఓ టి.వి. సెట్‌ని తులసి పడకగదిలో కూడా అమర్చాడు.

తులసి తన గదిలోకివచ్చి ఖరీదయిన చీరని, నగల్ని విప్పి అతిసాధారణమైన చీర, జాకెట్ ధరించి మంచంమీద వాలిపోయింది. రెండు నిముషాలయినా గడవక ముందే ఇంటర్‌కమ్ చప్పుడు చేసింది.

ఆమె దాన్ని అందుకుని అన్యమనస్కంగా "హలో" అంది.

"నేనమ్మా! పెద్ద మామయ్యని! లోపలికి రావచ్చామ్మా" శ్రీనివాసరావు అడిగాడు.

అతడు బయట హాల్లోంచే మాట్లాడుతున్నాడని అర్థమైంది ఆమెకి! ఇంతలో ఏమెచ్చింది. ఏదో కారణంలేందే ఇంతలోనే రాడు.

"రా మామయ్యా" అందామె.

మరుక్షణంలో అతడు లోపలికి వస్తూ "చీరకోసం తులసీ..." అన్నాడు. అది నిజం కాదని ఆమెకి తెలుసు. చీరకోసం అతడు రానవసరంలేదు. అక్కడ కింద గుట్టగా పడేసివున్న చీరని తీసి జాగ్రత్తగా మడతలు వేస్తూ, "తులసీ ఇందాక నువ్వు పండు ఇచ్చావే అతడెవరో తెలుసా? " అడిగాడు.

ఆమెకి అర్థమైంది అతడెవర్ని గురించి మాట్లాడుతున్నాడన్నది.

"లేదు" అంది.

"అతడొక అభ్యుదయవాద కుటుంబానికి చెందినటువంటి వ్యక్తి! టీచరుగా ఈ వూరొచ్చి నెలయింది. ఆశ్రమంమీద ఆసక్తి పెంచుకున్నాడు. మనం భయపడాల్సింది లేదనుకో! ఎందుకైనా మంచిదని అతడి మీద ఓ కన్నేసి వుంచాను. ఇందాక నువ్వు పిలవకపోయినా అతడు నీదగ్గరికి వచ్చాడు! నీతో ఏదో మాట్లాడడానికి ప్రయత్నించాడు"

అంటూ ప్రశ్నార్థకంగా చూశాడు.

'నన్ను పేరు పెట్టి పిలిచాడు మామయ్యా' అని చెప్పబోయి తన మేనమామ మొహం చూసి ఆగిపోయింది.

అతడ్ని గురించిన తన మనసులోని సందేహాన్ని ఆమె ముందు వ్యక్తపరచడం శ్రీనివాసరావు చేసిన పొరపాటు. ఇప్పుడు తను చెప్పబోయిన మాట మేనమామ సహించలేనిదనిపించిందామెకి. అతడ్ని గురించి ఆమెకి తెలిసినంతగా మరొకరికి తెలీదు.

అందుకే ఆమె చెప్పే ఉద్దేశ్యం విరమించుకుని, "నేను సరిగ్గా పట్టించుకోలేదు మామయ్యా! కృతజ్ఞతలు చెప్పినట్టున్నాడు" అంది.

"ఈసారి వాడికి నీదగ్గరికి వచ్చే అవకాశం కల్పించకూడదమ్మా మనం! ఇలాంటివాళ్ళకి ప్రతిదాన్నీ సందేహించడం, అనుమానించడం, ప్రశ్నించడం అలవాటు. వాళ్ళని దూరంగా వుంచడం మంచిది" చెప్పాడు శ్రీనివాసరావు.

'అలాంటివాళ్ళు కొందరైనా లేకపోతే నీలాంటివాళ్ళకి అంతూ అదుపూ ఎక్కడ మామయ్యా? 'చెడు' కొంతయినా కంట్రోల్లో వుందీ అంటే 'మంచి' భయానికేగా? " అనుకుంది మనుసులో.

"ఏమీ లేదమ్మా. ఎందరో అసూయాపరులు నీమీద కన్నేసి వున్నారు. ఏ లొసుగు దొరుకుతుందా అని వెదుకుతున్నారు. అందుకే చిన్న పాముమీదనయినా పెద్ద కర్రని ఉపయోగించాలిగదాని" అన్నాడు.

ఆమె ఉలికిపాటుని అణచుకుంటూ "పోనీ మామయ్యా, ఎవరో అనామకుడు" అంది.

అదే క్షణాన ఆమె మనసులో సాదాసీదాగా కనిపించిన ఆ యువకుడిపట్ల ఓ ప్రత్యేకమైన అభిప్రాయం కలిగింది. అది గౌరవంతో కూడినది.

"మంచిదమ్మా! నువ్విక విశ్రాంతి తీసుకో! రెండురోజుల్లో గవర్నర్ వస్తున్నారు. ఆయన పర్యటన తరువాత మనం వైజాగ్ వెళ్ళాలి. అక్కడ ఓ కాలేజీ, ఓ హాస్పిటల్ ప్రారంభోత్సవాలకోసం" చెప్పాడు.

"అదేదో నువ్వే జరిపించెయ్ మామయ్యా" నిర్లిప్తతతో అందామె.

"ఇదేంబాగాలేదు తులసీ. ఇవన్నీ నీ సమర్ధతతో భగవంతుడు నీకిచ్చిన శక్తితో సాధ్యమవుతున్న సత్కార్యాలు. నీ బంగారు హస్తాలతోనే వాటిని ప్రారంభించాలి. నాదేముంది. నీ దయమీద బతికేవాడ్ని"

"అంత పెద్ద మాటలు ఎందుకులే మామయ్యా! వెళదాంలే! కానీ పెద్ద మామయ్యా! నాకు ఈ జీవితం చాలా భారంగా, బోరుగా అనిపిస్తోంది. అంతే కాదు, జనాన్ని అబద్ధాల్తో మాయల్తో నమ్మిస్తూ, మోసగిస్తూ ఇలా ఎంతకాలం మామయ్యా? దీనికి అంతంలేదా? మనం సంపాదించుకున్న డబ్బు చాలదా?" నెమ్మదిగా అడిగిందామె.

శ్రీనివాసరావు మేనకోడలివైపు రెప్పవాల్చకుండా చూశాడు. తరువాత నవ్వాడు.

"మాయలూ, మోసాలూ...! అలా ఎందుకనుకోవాలి తులసీ? భగవంతుడు ఏ పది కోట్ల మందిలోనో ఏ ఒక్కరికో మాత్రమే ఇచ్చే అవకాశాన్ని నీకు ఇచ్చాడని అనుకోవాలమ్మా. నేనెప్పుడూ అలా భావించను. నీ అదృష్టానికి నా తెలివి తేటల్ని జోడించానను కుంటాను అంతే.

"ఈనాడు నిన్ను దేవతలా భావిస్తున్న ఈ అపారమైన భక్తసమూహం నువ్వు ఈ అవతారాన్ని వదిలేస్తున్నానూ అంటే దాన్ని భరించగలరా. అంతదాకా ఎందుకూ ఆ వూహ నాకే చాలా బాధాకరంగా అనిపిస్తుంది. నువ్వు నమ్మవేమోగానీ నేనూ నిన్ను దేవతలా భావించే స్థితికి వచ్చానమ్మా

"'డబ్బు చాలదా' అన్నావు! తెలివైనవాడెప్పుడూ సాధించిన దానితో తృప్తిపడడు! పైగా మనం మన కోసం కాదమ్మా సంపాదిస్తోంది ప్రజలకోసం"

"మరీ అంత గొప్పమాట ఎందుకు వాడతావు మామయ్యా. నాకు తెలిసి మనం సహాయసహకారాలు అవసరమైన జనం కోసం పైసాఎత్తు సాయం చెయ్యడంలేదు.. అయినా ఇప్పుడు ఆ చర్చ అంతా ఎందుకులే. నాకీ జీవితం చాలా విసుగుని కలిగిస్తోంది మామయ్యా, అర్థంచేసుకో" దీనంగా అందామె.

"అంటే మామూలు తులసిలా బతకాలని వుందంటావు అంతేనా?"

ఆమె చాలా ఆశగా "అవును మామయ్యా" అంది.

అతడు అక్కడినుండి కదులుతూ, "తులసీ! ఒక్కసారి పదిహేను సంవత్సరాల వెనక్కి వెళ్లు! మీ అమ్మతో కలిసి చింతచిగురు అమ్మిన రోజుల్ని గుర్తుతెచ్చుకో! ఒంటిమీద ఖరీదైన బట్టలకి నోచుకోని. నీ బాల్యాన్ని నీ తండ్రి మరణానికి కాస్త ముందు వెనకాల జీవితాన్ని గుర్తుతెచ్చుకో. మళ్ళీ అలాంటి జీవితాన్ని తిరిగి ప్రారంభించాల్సివస్తే ఎలా వుంటుందో వూహించడానికి ప్రయత్నించు..." ఈ మాటల్ని అతడు వ్యంగ్యంగానూ నిష్టూరంగానూ అనలేదు.. ఆమెకి గుర్తుచేస్తున్నట్టన్నాడు.

తరువాత "విశ్రాంతి తీసుకో తులసీ" అనేసి వెళ్ళిపోయాడు.

గతం... దయనీయమైనదే కావచ్చు! ఈ బంగారు పంజరం కంటే కాలే కడుపుల్తో స్వేచ్ఛగా గాలి పీల్చిన ఆ రోజులు తక్కువ ఎందుకవుతాయి? మధురస్మృతులు... ఎన్నెన్నిలేవు? అవి మామయ్యకేం అర్థం అవుతాయి? మామయ్య చెప్పిన దరిద్రం ఒక ఏడాదిపాటు అనుభవించింది కావచ్చు! అంతకుముందు బాల్యం... అదొక బంగారపు అనుభూతులమయం అని ఈ మామయ్యని నమ్మించడం ఎలా?

ఆమె కళ్ళకి ఆమె బాల్యం కనిపిస్తోంది. అందులోంచి నడిచొచ్చే గ్రీకు శిల్పంలాంటి శ్రమజీవి ఆమె తండ్రి కనబడుతున్నాడు. ఇరవై ఎనిమిదేళ్ళ తన జీవితానికి రెండు పార్శ్వాలు వున్నాయి. పన్నెండేళ్ళదాకా ఆమెను అంటిపెట్టుకుని వుండిన ఆమె

# రచయితలకు మనవి



- ★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.
- ★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.**
- ★ **ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**
- ★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టలోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.
- ★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.
- ★ **ప్రతి నవలకు అందజేసే రు: 3000/– పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.**

**ఎడిటర్:**

# చతుర

**'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.**




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

మార్చి చతుర నవల మనిషిచేతి దేవత
..........................................................

సమీక్షకుని పేరు : ..........................................................

చిరునామా : ..........................................................

..........................................................

..........................................................

..........................................................

తండ్రి ఒక పార్శ్వమైతే, పదమూడో ఏట నుండి తన గుప్పెట్లోకి తీసుకున్న మేన మామ దాని రెండో పార్శ్వం! ఒకరు రూపెత్తిన ప్రేమకి మారుపేరు! ఇంకొకరు పోతపోసిన స్వార్థపు పోగు. ఆమె జీవితంలో మధురమైన అనుభూతులు మిగిల్చిన వ్యక్తి తండ్రి అయితే అనుభవంలో వున్న అత్యంత చెడు అనుభవం మేన మామ! ఇద్దరూ పురుషులే, ఒకరు చదువుకోలేదు. ఇంకొకరు విద్యాధికుడు. ఇద్దరికీ ఎంత తేడా?

ఒక్క కూరతోనో పచ్చడితోనో అన్నం పెట్టగలిగిన తండ్రి ఆమె మనసులో అక్షరాలా ఒక కథానాయకుడిగా మిగలగలిగాడు! బంగారపు సంకెళ్ళతో హంసతూలికా తల్పాలూ, మృష్టాన్న భోజనాలూ సమకూర్చిన మేనమామ ప్రతినాయకుడయ్యాడు.

తండ్రి నిస్వార్థంగా ప్రేమానుభూతుల్ని పంచివెళితే మేనమామ తను ఎక్కదలచుకున్న అందలాల్ని అధిరోహించడానికి తననూ తన లేలేత జీవితాన్నీ నిచ్చెనగా ఉపయోగించుకున్న పరమ స్వార్థపరుడు.

ఆమె మనసు దుఃఖాతిశయంతో నిండిపోయింది. ఆమెకి ఈనాడు అందరూ ఉన్నారు. తల్లి, పినతల్లి, మేనత్త, తోబుట్టువులూ, మేనమామలూ అందరూ వున్నారు. ఎంతో దగ్గరి, దూరపు బంధుబలగం ఉంది. కానీ ఆమె ఒంటరి. ఆమెకి ఆపాదించబడినటువంటి దైవత్వం ఆమెకి వాళ్ళను కొంతవరకూ దూరం చేస్తే తనవాళ్ళయిన మనుషుల్లో స్వార్థాన్ని చూడాల్సిరావడం ఆమెను వాళ్ళకి దూరంగా ఒంటరిగా తయారుచేసింది. తనని దహించే ఒంటరితనంలో ఆమెకి ఓదార్పుని ఇచ్చేది ఆమె. గతంలోని బాల్యం అయితే ఆ చిరుజీవితంలో ఆమె ఆరాధించే కథానాయకుడు ఆమె తండ్రి.

అవును... అతడు బతికి వుండి వుంటే ఆమె జీవితం మరోలా వుండివుండేది. ఈ మేనమామ కబంధహస్తాలకి ఆమె అంది వుండేది కాదు. ఆమె కళ్ళు మగతగా మూతలు పడుతుండగా ఆమె మనసు మెల్ల మెల్లగా తన బాల్యంలోకి జారిపోయింది.



'హీరో' అంటే అతగాడు గొప్ప అందగాడు, సాహసవంతుడూ, విద్యాధికుడూ మాత్రమే అయివుండనవసరం లేదు.

కూలిపని చేసేవాడిలో, కట్టెలు అమ్ముకునేవాడిలోనూ, మట్టిపని చేసేవాడిలోనూ, పశువుల కాపరిలోనూ కూడా కథానాయకుడికి వుండవలసిన ఉదాత్తమైన గుణగణాలు, శౌర్య సాహసాలూ వుండొచ్చు.

అయితే అవి బయట ప్రపంచంలోకి రంగులు పూసుకుని కథలరూపంలోకి రావు. ఎందుకంటే ఆయా వ్యక్తులు గొప్ప వాళ్ళు కాదు, ప్రపంచానికి చాటింపు వేసుకునే చాతుర్యం, ఆలోచనా వాళ్ళకి వుండవు. పైగా వాళ్ళు విద్యాగంధం లేని వాళ్ళు కాబట్టి. అయితే వారిలోని కొన్ని గొప్ప గుణాలూ ధైర్యసాహసాలూ వారి స్థాయి మనుషుల్లో గుర్తింపబడతాయి. వారికొక ప్రత్యేకతను ఆపాదించి పెడతాయి. అలాంటి ఒక ప్రత్యేకత కలిగిన వ్యక్తి ఆమె తండ్రి.

అతడి పేరు కిష్టయ్య. 'నల్లానల్లని

కిష్టయ్యా' అని తల్లి అతడి చిన్నతనంలో అతడికి జోలపాడేది. కిష్టయ్య నల్లని శరీరంతో పోతపోసిన ఉక్కులాంటి శరీరంతో ఎగదువ్విన గిరిజాల జుట్టుతో చెయ్యెత్తు మనిషి! నడుస్తుంటే అతని చేతులు మోకాళ్ళని అంటుతుండేవి.

"మా కిష్టయ్య నలుపైతే అయ్యాడుగానీ మా రాజసంగల మనిషి. ఏ జమీందారుల ఇంట్లోనో పుట్టివుంటే బావుండేది" అని చింతపోయేదట అతడి తల్లి.

నాలుగో తరగతి చదువుతున్న కిష్టయ్య తండ్రి పక్షవాతంతో మంచంలో పడడంతో బతుకుతెరువుకోసం నాయుడుగారి పశువులను మేపుకు రావడంకోసం తనకెంతో ప్రియమైన చదువుకి మంగళం పాడాల్సి వచ్చింది. ఈ అసంతృప్తి అతడ్ని జీవితాంతం వరకూ అంటిపెట్టుకునే వున్నా అతడు అసంతృప్తజీవి కాడు. నిరుపేద కిష్టయ్యకి దేవుడిచ్చిన ఆస్తి కండబలం, బుద్ధిబలం. నలుగుర్ని ఆదుకునే గుణం అతడికి పుట్టుకతో అబ్బింది.

తనతోపాటు తల్లినీ చెల్లినీ రోగిష్టి తండ్రినీ ముసలి తాతగార్నీ పోషించడం కోసం పదోఏటనుంచే రెక్కలు ముక్కలు చేసుకోవడం కిష్టయ్యకి అలవాటయిపోయింది. దానికోసం అతడు పశువుల్ని కాశాడు. కూలిపనికి వెళ్ళాడు. కొండకి (అడవికి) వెళ్ళి కట్టెలు కొట్టుకొచ్చి పక్క టౌన్లో అమ్ముకొచ్చేవాడు. ఇలా కనిపించిన ప్రతి పనీ చేసేవాడు.

అతడి తల్లి అతడి కష్టానికి నొచ్చుకుంటే తన కండల్ని దండల్ని ఉబ్బించి "ఎందుకే అమ్మా దిగులు పడతావు? నాకు భగవంతుడు ఇచ్చిన ఆస్తి నా ఈ ఒళ్ళు, ఆరోగ్యం. ఈ రెండూ వుండగా మీకేలోటూ రానీయను" అనేవాడు.

అన్నట్టుగానే అతడు తన తాతగారినీ తండ్రినీ ఎందరో డబ్బున్న కొడుకులకన్నా మిన్నగా పువ్వుల్లో పెట్టి చూసుకున్నట్టుగా కడతేర్చి సాగనంపాడు. తల్లి కోరిక మేరకు తన శక్తినంతా ధారపోసి కూడబెట్టిన డబ్బుతో చెల్లెల్ని స్థితిమంతుల ఇంటికి కోడలుగా పంపాడు. ఇక తన జీవితంలో మిగిలిన కోరిక కొడుకు పెళ్ళి అనుకుంటూనే ఓ ప్రశాంతమైన రాత్రి నిద్రలోనే సుఖమృత్యువుని పొందింది అతడ్ని కన్న అదృష్టవంతురాలైన అతడి తల్లి!

తల్లి మరణం ఎంతగా బాధించిందో ఆవిడ చివరికోరికను తీర్చలేక పోయాను అన్న విషయం అంతగానూ బాధించింది కిష్టయ్యను. అతడి ఒంటరితనాన్ని వదిలించడం కోసం బంధుమిత్రులంతా కలిసి ఓ సంబంధం తెచ్చారు! అంతకుముందు తల్లి వుండగా అరడజను సంబంధాలు ఏదో కారణంగా కుదరనిది కాస్తా ఈ సంబంధం టకీమని కుదరడం ఆశ్చర్యం! తన ఇరవై ఏడవ ఏట భూదేవితో అతడి పెళ్ళి అత్తవారింట కొంత ఘనంగానే జరిగింది.

భూదేవిని చూసి "చిదిమి దీపం పెట్టుకోవచ్చు" అనని వాళ్ళు లేరు.

"అతడి అదృష్టంకొద్దీ దొరికింది" అన్నారు దాదాపు ప్రతి ఒక్కరూ.

"ఆ... కిష్టయ్యలాంటి సమర్థుడు దొరకడమే ఆ అమ్మాయి అదృష్టం" అన్నాడు అతడికి పినతండ్రి వరసయ్యే పెద్దాయన అందరి మాటలూ కొట్టివేస్తూ.

నిజంగా భూదేవి పుట్టింటివారు కిష్టయ్య ఆర్థికస్థితితో పోల్చి చూస్తే నాలుగు మెట్లు పైన వున్నారు. ఆమె అన్న శ్రీనివాసరావు గవర్నమెంటు ఉద్యోగి. బాగా చదివాడు. అక్క ఓ బ్యాంకు ఉద్యోగి భార్య. తమ్ముడు నారాయణ పదెకరాల మాగాణిని సాగుచెయ్యడంలో తండ్రికి చేదోడు వాదోడుగా వుంటాడు. లంకంత పాతకాలంనాటి కొంప. దాని దర్పానికి తగినట్టు తాతలకాలంనాటి మంచాలూ, కుర్చీలూ, బల్లలూ ఆడంబరంగా వున్నాయి. భూదేవి చెల్లెలికి

కూడా ఓ అయినింటి సంబంధం సిద్ధంగా వుంది.

ఆ స్థాయిమనుషులు భూదేవిని కిష్టయ్యకి ఇవ్వడం వెనక ఒక కథ వుంది. భూదేవికి రెండేళ్ళక్రితం ఓ సంబంధం కుదిరింది. వరుడికి రెవెన్యూ డిపార్టుమెంట్లో ఉద్యోగం. ఘనంగా కట్నకానుకలూ లాంఛనాలూ ఇచ్చి పుచ్చుకోవడానికి ఒప్పందం కుదిరింది. ఏర్పాట్లన్నీ పూర్తయ్యాక పెళ్ళివిడిదినుంచి గుళ్ళో పెళ్ళికి తరలివస్తున్న పెళ్ళికొడుకు జీపుని ఉప్పులోడ్‌తో వస్తున్న లారీ గుద్దేసింది. ఆ ప్రమాదంలో ప్రాణాలు పోగొట్టుకుంది పెళ్ళికొడుకు ఒక్కడే.

ఈ సంఘటన భూదేవిమీద దురదృష్ట జాతకురాలిగా ముద్రవేసింది. రెండేళ్ళు తిరిగాయి. ఆమె తండ్రికి ఎన్నో చెప్పులజతలు అరిగాయి. తోడబుట్టినవాళ్ళ, బంధువుల ప్రయత్నాలు ఏవీ ఫలించలేదు. ఆ రోజుల్లో అలాంటి పరిస్థితుల్లో మళ్ళీ పెళ్ళిసంబంధం కుదరడం ఎంత అసంభవమో అంత అసంభవమైనది. ఆమె తల్లి కంటతడి ఆరనేలేదు. ఎప్పుడూ ఏడుస్తుండేది. ఇక జన్మలో తన కూతురికి పెళ్ళికాదేమోనన్న భయంతో తప్పనిసరి అయి తమకంటే తక్కువ స్థితివాడికి ఇవ్వడానికి సిద్ధపడితేగానీ కిష్టయ్య సంబంధం కుదరలేదు.

ఆ మాటకొస్తే ఆ స్థాయివాళ్లు కూడా కొందరు తిరస్కరించారు. ఈ సంగతి కిష్టయ్యకి తెలుసు. అతడు చదువు లేనివాడైనా అజ్ఞాని కాడు. సంతోషంగా భూదేవిని తన అర్ధాంగిని చేసుకున్నాడు. పెళ్ళిపందిట్లో భార్య తరఫువాళ్ళ మొహాల్లో కళాకాంతులు లేకపోవడం గమనించి "భూదేవిని ప్రాణసమానంగా చూసుకోవాలి. తను డబ్బు లేనివాడన్న కొరతని తన ప్రేమద్వారా తీర్చాలి" అని నిర్ణయించుకున్నాడు కిష్టయ్య.

అత్తవారికి అతడిపట్ల బాగా చిన్నచూపుగా వుండేది. కట్నకానుకలు అతడు అడగకపోయినా అతని స్థితిని బట్టి అన్నట్టు అయిదువేల రూపాయల డబ్బు, మూడు తులాల బంగారం కూతురికి పెట్టారు. అంతక్రితం సంబంధాల్లో అంతకు నాలుగింతలు ఇవ్వజూపాడు ఆమె తండ్రి.

"ఆయనకి ఓ ఉంగరం అయినా పెట్టలేదు" అని భూదేవి కష్టపడుతోంటే "అంతోటి షావుకారుకి మేం ఇచ్చింది చాల్లే! అయినా ఎన్నడూ డబ్బు మొహం ఎరగని వాళ్లు ఒక్కసారిగా డబ్బుని, సొమ్మునీ కళ్ళజూస్తే వెదజల్లేస్తారు. వాళ్లకి డబ్బు విలువ తెలీదు. నీ దగ్గరున్న కాస్తా కూస్తా బంగారం జాగ్రత్తే అమ్మాయీ" అంటూ ఈసడిస్తూనే చివర్లో జాగ్రత్త చెప్పాడు ఆమె తండ్రి.

"మా తదనంతరం నీక్కొంత పొలం ముట్టజెప్పేట్టు మీ నాయనకి నేను నచ్చజెప్తాలే" అంటూ సముదాయించి భర్త వెంట సాగనంపింది తల్లి.

ఈ బాధని, భర్తపట్ల తనవాళ్లు చూపిన నిరాదరణనీ మనసులోనే దాచుకుంది భూదేవి. ఆ వెంటనే భూదేవి చెల్లెలి పెళ్లి జరిగింది. మొదటి పండగకి అత్తవారింటికి వెళ్లిన ఇద్దరు కొత్త అల్లుళ్లలో చిన్నామె భర్తకి ప్రత్యేకమైన గది ఏర్పాటుచేసి భూదేవినీ ఆమె భర్తనీ మేడమీద సర్దుకోమంది తల్లి. భోజనం దగ్గరా బట్టల దగ్గరా అంతే! ఉద్యోగస్థులైన పెద్ద, చిన్నల్లుళ్లకి లభించిన ఆదరణ నడిపివాడైన కిష్టయ్యకి లభించలేదు.

ఆనాడు ఆ అవమానాల్ని బలవంతాన దిగమింగిన కిష్టయ్య మళ్ళీ వారింటి మొహం చూసి ఎరగడు. అలాగని భార్యని కట్టడి చేసిందీ లేదు. భార్య పుట్టింటివాళ్ళొస్తే అమర్యాద చేసిందీ లేదు.

కిష్టయ్య ఆత్మాభిమానం గలవాడేగానీ సంకుచితుడు కాదు. ఈ కథలన్నీ చిన్నతనంలో తన తల్లి ద్వారా వింటూండేది తులసి. తన తాతగారూ, అమ్మమ్మ, తల్లి,

అక్క, చెల్లెళ్లమీద చాలా కోపం వచ్చేది తులసికి. తన తండ్రిపట్ల ప్రేమాభిమానాల్తో పాటు అతడి వ్యక్తిత్వంపట్ల ఆరాధన కలగడానికి ఇంకా ఎన్నో విన్న సంగతులేకాదు, కళ్ళారా చూసిన ఎన్నో సంఘటనలు కారణం.

పెళ్ళయ్యాక కాస్త తపించాక నాలుగేళ్ల తరువాత పుట్టిన బిడ్డ కావడంతో కూతురి పట్ల అపరిమితమైన ప్రేమని, మమకారాన్ని పెంచుకున్నాడు కిష్టయ్య. తల్లికంటే తండ్రి దగ్గర చేరిక ఎక్కువ తులసికి. అందులో భార్య పోలికల్లో బంతిలా వుండేది తులసి.

కిష్టయ్య కూతురిని "తులసీ" అని ఎంతో ప్రేమగా పిలిచేవాడు.

ప్రేమజాస్తయినప్పుడు 'తులసమ్మా' అనేవాడు.

మరీ జాస్తయినప్పుడు 'రామతులసమ్మా' అంటూ కూతురిపట్ల తన ప్రేమనీ అభిమానాన్నీ మమకారాన్ని కంఠంలో నింపుకొని పిలిచేవాడు. అప్పుడు తులసి గర్వంతో తల ఎగరేస్తూ వచ్చి తండ్రి వడిలో చేరేది. తండ్రిని చూడకుండా ఓరోజు ఉండడం కూడా కష్టమయ్యేది ఆ పసిదానికి.

తల్లితోపాటు ఒక ఉబలాటంతో అమ్మమ్మగారింటికి వెళ్ళినా ఒకరోజైనా గడవకుండానే "నాన్న దగ్గరికి పోతా" అంటూ మారాం చేసేది.

"అబ్బో... మీ నాన్నకి మేం కంట్లో ఆనమే తల్లీ. పెళ్లయిన తొలి పండక్కి ఏం వచ్చాడోగానీ మళ్ళీ ఈ గడపతొక్కి ఎరగడాయె" అంది పెద్దమ్మ.

"ఆయనకి మీరు చేసిన అవమానాలు అలాంటివి. నేనేదో పుట్టింటిమీది మమకారాన్ని చంపుకోలేకవస్తున్నానుగానీ..." చాలా కష్టంగా అనేది తల్లి.

"ఏదో పొరపాటయిందే అమ్మా! ఆ తరువాత ఎన్నిసార్లు మీ నాయనొచ్చి అతగాణ్ణి బతిమాలలేదు? " అంటూండేది అమ్మమ్మ.

తరువాత తన పోరుపడలేక అమ్మ వెంటనే ఊరికి ప్రయాణమయ్యేది. లేదా చిన్న మామయ్య తనను తెచ్చి నాన్న దగ్గర వదిలేసేవాడు. ఈ చిన్నమామయ్య అంటే నాన్నకి కొంత అభిమానం వుండేది.

"అమాయకుడు. వాణ్ణి చదివించక పొలానికి అంకితం చేశాడు మీ నాన్న! ఇతగాడు చెమటోడ్చి సంపాదిస్తూ వుంటే మీ అన్న తిని బలాదూరు తిరుగుతుంటాడు" అనేవాడు అమ్మతో.

కానీ, అప్పట్లో తనకి పెద్దమామయ్య అంటేనే ఇష్టం వుండేది. చిన్నమామయ్య ఊరినుంచి వచ్చి తిరిగిపోయేప్పుడు తనకి ఒక్కరూపాయో రెండు రూపాయలో ఇచ్చి వెళ్ళేవాడు. అదే పెద్ద మామయ్య అలా కాదు. వస్తూ సంచీడు పండ్లూ, పూలూ, స్వీట్లు తెచ్చేవాడు. వెళ్తూ అయిదురూపాయలో, పదిరూపాయలో ఇచ్చేవాడు. నాన్నకి అలా డబ్బులు ఇవ్వడం ఇష్టం లేకపోయినా ఏమీ అనేవాడు కాదు. వాళ్ళు నొచ్చుకుంటారని. పెద్ద మామయ్య పేరు శ్రీనివాసరావు.. అందరూ అలాగే పిలిచేవారు.

నాన్న మాత్రం 'శీనయ్యా' అనేవాడు.

మామయ్య అమ్మతో "భూదేవీ! ప్రపంచం అంతా నన్ను గొప్పగా గౌరవిస్తారు. కన్నతండ్రి కూడా శ్రీనివాసరావూ అనే పిలుస్తాడు. నీ భర్తకి మాత్రం నేనంటే లెక్కలేదే. శీనయ్యా అని పిలుస్తాడు" అంటూ హాస్యంగా అనేవాడు.

"అభిమానంతో ఎలా పిలిస్తే ఏంలే అన్నయ్యా" అనేది అమ్మ.

ఒకరోజు, రెండు రోజులుండి వెళ్ళిపోయేవాడు మామయ్య.

"చేస్తున్న ఉద్యోగం మానేసి రాజకీయాలూ, పార్టీలూ అంటూ తిరుగుతున్నాడు. మా శీనయ్య తెలివైనవాడేగానీ కాస్త చపలచిత్తుడు" తన స్నేహితుడైన పుల్లయ్యతో నాన్న అనడం తను వినేది.

వాళ్ళెవరు వచ్చినా నాన్న కోడిని కోసే వాడు. అమ్మ మినప్పప్పు నానబోసి వడలు చేసేది. పాయసం చేసేది. అంత బాగా మర్యాద చేసేవాళ్లు.

పెద్ద మామయ్య అనేవాడు "భూదేవీ పేద ఇల్లు అయినా నీ ఇంటి మర్యాద తరువాతనే ఎక్కడైనా" అని.

నిజంగా నాన్న చదువు నాలుగోతరగతి దాటలేదుగానీ బోలెడు మర్యాదలూ, విషయాలూ తెలుసు. నాన్నకి చదవడం వ్రాయడం చక్కగా వచ్చు. నాన్న అక్షరాలు ముత్యాల కోవలా చక్కగా వుండేవి. అప్పుడప్పుడూ ఉత్తరాలు వ్రాస్తుండేవాడు. ఎక్కడో వుండే తన చిన్ననాటి స్నేహితులకట. చుట్టుపక్కల వాళ్ళొచ్చి నాన్నచేత ఉత్తరాలు రాయించుకుంటుండేవాళ్ళు. మరో తమాషా సంగతి అమ్మ ఎనిమిదో తరగతి వరకూ చదువుకుందిగానీ నాన్నలా బాగా రాయలేదు. చదవనూలేదు.

"మీ నాన్న ఎంతయినా తెలివైన మనిషి. కాలంగాక చిక్కిపోయాడుగానీ" అంటూండేది అమ్మ.

అసలు నాన్నకి పేపర్ చదవందే నిద్రపట్టేది కాదు. పంచాయితీఆఫీసు దగ్గరికి వెళ్ళి చదివిగానీ పన్లోకి వెళ్ళేవాడు కాదు.

అక్కడివాళ్ళు "ముందు కిష్టయ్యకి పేపరివ్వండి! తను పన్లోకి వెళ్ళాలిగదా పాపం" అనేవాళ్ళుట.

చుట్టుపక్కల చిన్న చిన్న రైతులంతా ఏరోజు కారోజు నాన్నని అడిగి మార్కెట్ ధరలు తెలుసుకుంటుండేవాళ్ళు.

అక్కడ ఎవరికి ఏ అవసరం వచ్చినా నాన్న పేరు వినబడేది.

"కిష్టయ్యని పిలవండి"

"కిష్టయ్యని సలహా అడగండి"

"ఆ సంగతి పూర్వాపరాలు కిష్టయ్య అయితే బాగా చెబుతాడు" ఇలా.

ఎవరికైనా జబ్బులొచ్చి టౌన్లో ఆసుపత్రికి తీసుకుపోవాలంటే "కిష్టయ్యని తీసుకుపోండిరా! డాక్టర్లతో బాగా మాట్లాడతాడు" అని నాన్నని పిలుచుకెళ్ళేవాళ్లు.

ఏ పనిమీదయినా పట్నం పోవాలంటే నాన్న మల్లెపూవులాంటి తెల్లని బట్టలు వేసుకునేవాడు. అడ్డపంచ, పొడుగు చేతుల చొక్కా, తోలు చెప్పులూ!

"కిష్టయ్యా! ఇలా నిన్ను చూస్తే ఎవరో పెద్ద ఆసామి అనుకుంటారు. నీ రూపం అటువంటిది. మట్టిపిసుక్కునేవాడివంటే ఎవరూ నమ్మరనుకో" అనేవాళ్ళు ఇరుగూ పొరుగూ పెద్దోళ్లు.

నాన్న నవ్వితే, "ఆయన రోజులు బాగోక గానీ లేకపోతే గొప్పోడు కావాల్సిన కళ వుంది మొహంలో" అనేది అమ్మ విచారంగా.

నిజంగా నాన్న కష్టజీవి. తెల్లవారురఝామున లేచి కొండకి వెళ్ళిపోయేవాడు. తెల్లారేసరికి ఇంత పెద్ద కట్టెలమోపూ ఓ పచ్చగడిమోపు తెచ్చిపడేసి కొట్టంలో వున్న బర్రెగొడ్డు పాలు పితికేవాడు. దానికి మేత పెట్టి, అప్పుడు వేపపుల్లతో పళ్లుతోమి దాలిబానలోంచి అమ్మతోడి ఇచ్చిన వేడినీళ్ళతో గబగబ స్నానం చేసి వచ్చికూర్చుంటే అమ్మ చద్దెన్నం వడ్డించేది. గుండ్రని పెద్ద కంచంలో ఇంత అన్నం పెట్టి గంజిపోస్తే అందులోకి కొరివికారమో ఎర్రగడ్డో అదీ లేకపోతే పచ్చిమిరపకాయో నంజుకొని తిని ఆ తరువాత అమ్మ ఇచ్చిన గ్లాసుడు పాలు తాగి వెళ్ళిపోయేవాడు పంచాయతీ ఆఫీసు దగ్గరికి. అటునుంచి అటే పనికి. అది పొలంలో పనికావచ్చు. బేల్దారి పని కావచ్చు మట్టిపని, రాళ్లు కొట్టేపని కావచ్చు.

సాయంత్రం ఇంటికొస్తూ చేతిలో అమ్మకి పూలూ తనకి పండో లేక ఇంకే తినుబండారమో లేకుండా వచ్చేవాడు కాదు. పూలూ, ఆరోజు సంపాదనా తల్లి చేతిలో పెట్టి ముసిముసిగా నవ్వేవాడు. మిగతావి తన చేతికి ఇచ్చి తనని ఎత్తుకొని ముద్దులు పెట్టుకునేవాడు. తరువాత కొట్టంలోకి వెళ్ళి

పేడకళ్లు ఎత్తేసి పశువులకి మేతవేసి మళ్ళీ స్నానంచేసి పాలుపిండి అమ్మకి ఇచ్చి తనని ఒళ్లో పెట్టుకుని ఆరుబయట మట్టి అరుగు మీద కూర్చునేసరికి ఇరుగూ పొరుగూ వచ్చి చేరేవారు. వాళ్ళంతా నాన్నలా స్నానం చేసి తలదువ్వుకుని చక్కగా తయారయి వచ్చే వాళ్లే కారసలు.

"నీళ్ళు పోసుకోండిరా! అదే అసలు ఆరోగ్యం" అనేవాడు నాన్న!

"పోపోరా! నువ్వయితే నీటుగాడివి. మాకంత షోకు ఎక్కడ? ఓపిక ఎక్కడ? " అనేవాడు పక్కింటి పుల్లయ్య మామ.

తరువాత వూళ్ళో సంగతులు, పొరుగూరు సంగతులు టౌను విషయాలూ, మార్కెట్ ధరలూ ఆరోజు పేపర్లోని సంగతులూ, రాజకీయాలూ ఇతర లోకాభిరామాయణం మాట్లాడుకునేవాళ్లు అంతా! నాన్న వక్త! వాళ్ళంతా శ్రోతలు! ఆ మాటలు అర్థం కాకపోయినా నాన్న ఒళ్లో కూర్చుని అలా వినడం, ముఖ్యంగా వాళ్ళంతా భక్తిశ్రద్ధల్తో నాన్న మాటలు వినడం తనకి చాలా చాలా బావుండేది. నాన్న దగ్గరుండే రేడియోలో వార్తలు వినిగానీ వాళ్ళంతా కదిలేవాళ్ళు కాదు.

అప్పటికీ అమ్మ "అన్నాలకి లేవరా ఏం? మధ్యాహ్నం ఎప్పుడు తిన్నారో ఏమిటో" అని కేకవేసేది.

"ఇక కూచోవడం మర్యాద కాదు. భూదేవి తరిమికొట్టుద్ది" అంటూ లేచిపోయే వాళ్ళు.

నాన్న ఇంట్లోకి వచ్చేసరికి అమ్మ కంచంలో వేడివేడి అన్నం నాన్నకి ఇష్టమైన కూరో లేక పచ్చడో చింతాకుపొడో నెయ్యితో సహా వడ్డించేది. పక్కనే చిక్కని మజ్జిగా వుండేది. తనూ కూర్చునేది. కబుర్లు చెప్పుకుంటూ నవ్వుకుంటూ తినేవాళ్ళు. మధ్య మధ్యలో తనకి గోరుముద్దలు వెన్నముద్దల్లా దొరికేవి. ఆ తరువాత నాన్న తనకి కథలు చెబుతూ నిద్రపుచ్చేవాడు. తనకి నాన్న చెప్పే రాజకుమారులూ ఏడు చేపలూ కథ, కాశీమజిలీ కథలూ, భేతాళ కథలకంటే నాన్న కథ అంటే ఇష్టం!

అవును అది నాన్న సొంత కథ! అది వినాలంటే తనకి ఎంత ఇష్టమో! ఎన్నిసార్లు విన్నదో! అయినా తృప్తితీరదు. ఆ కథలో నాన్నొక కథానాయకుడు కాబట్టి.

"నాన్నా! నీకథ చెప్పవా నాన్నా! దొంగల్ని కొట్టిన కథ" అంటూ మారాం చేసేదాన్ని.

"ఎన్నిసార్లు వింటావురా" అనేవాడు.

"నాకదే ఎంతో బావుంది. చెప్పు నాన్నా" అనేదాన్ని.

"పోనీ చెప్పరాదా" అనేది అమ్మ కూడా వినాలన్న కోరికతో.

"చెప్పు నాన్నా చెప్పు చెప్పు"

అసలు మా ఇరుగూ పొరుగూ స్నేహితులైనవాళ్ళూ వాళ్ళ నాన్నల దగ్గరికి అంతగా వెళ్ళరు. ఆడపిల్లలైతే అసలే పోరు. వాళ్ళ నాన్నలూ వాళ్ళని అంతగా పట్టించుకోరు. వాళ్ళంతా నాన్నల్ని 'నాయనా' అనే వాళ్ళు. నేను 'నాన్నా' అనేదాన్ని. నాన్నే చిన్నప్పటినుండి అలా అలవాటు చేశాడట.

నాన్న కథ చెప్పటం ప్రారంభించేవాడు.



తొమ్మిదేళ్ళక్రితం సంగతి అది. అప్పటికి నాన్నకి ఇంకా పెళ్ళి కాలేదు. రోజూ కట్టెలకి

వెళ్ళడం తప్పనిసరి పని ఆయనకి. ఎందుకంటే అవి ఇంట్లోకి కాదు. రోజూ ఓ పెద్ద మోపు తెచ్చి ఇంట్లోపడేస్తే కొన్ని రోజులకి ఓ బండిలో వేసుకుని వాటిని తీసుకెళ్ళి టౌన్లో అమ్ముకుంటే బాగా డబ్బులొస్తాయంట. అక్కడ నాన్నకి ఖాతాదార్లు ఉన్నారంట. అత్త పెళ్ళి చెయ్యడానికి చాలా డబ్బు కావాలంట.

ఆరోజు ఎప్పటిలాకాక ఏదోపనిమీద టౌనుకి వెళ్ళొచ్చిన నాన్న మధ్యాహ్నం అన్నంతిని కాసేపు పడుకుని సాయంత్రం అవుతుండగా కొండకి బయలుదేరిపోయాడంట.

అప్పటికీ నాయనమ్మ "ఇప్పుడు పోకపోతేనేంరా కిష్టయ్యా? అసలే కొండమీద ఈమధ్య దొంగలు తిరగడం ఎక్కువైందంటున్నారు" అందట.

"వాళ్ళ మొహం" అంటూ బయలుదేరిపోయాడంట నాన్న!

మా వూరిని ఆనుకునివుండే పెద్ద కొండ మీదా, కిందా చిట్టడివి ఉంది. కొండంటే మామూలు కొండ కాదు ఎన్నో మైళ్ళ వైశాల్యంతో వుండే ఎర్రకొండ.

అప్పట్లో అది బాగా దట్టంగా వుండేదంట. నాన్న తన గొడ్డలి భుజంమీద వేసుకుని తన పొడుగుకాళ్ళతో పెద్ద పెద్ద అంగలేసుకుంటూ కొండమీదకి చేరుకుని బాగా లోపలికి వెళ్ళి కట్టెలు కొట్టసాగారంట. గంటలో కట్టె కొట్టడం అయిపోయిందంట. అందరూ మూడు గంటలపాటు చేసేపనిని నాన్న గంటలో చేసేస్తాడంట. అందుకే ఊళ్ళో అందరూ నాన్న తమ పన్లోకి రావాలని కోరుకుంటూరంట.

అప్పటికి సూర్యుడు పడమటికొండల్లోకి దిగిపోతున్నాడు.

నాన్న ఆరడుగుల పొడవూ రెండడుగుల వెడల్పుగా పేర్చిన కట్టెల్ని తాళ్ళతో మోపుగా బిగించుకుంటూ "ఇక తొందరగా వెళ్ళడం మంచిది. చీకటిపడితే పురుగూ పుట్రా తిరుగుతాయి. అంతగా అయితే పశువుల గడ్డి కోసం రేపు రావచ్చు" అనుకుంటున్నాడంట!

పైగా ఆమధ్య కొందరు దోపిడీదొంగలు పోలీసులకి భయపడి కొండమీదకి చేరుకున్నారంట. అక్కడే సారా కాచుకు తాగడం, కోళ్లు కోసుకుతినడంలాంటి పనులు చేసి బాగా చీకటిపడ్డాక కొండ దిగుతున్నారట. వాళ్ళకి అక్కడ మనిషి కనబడితే చాలు. వాళ్ళ దగ్గరున్న కొద్దో గొప్పో డబ్బా ఉంగరాల్లాంటివీ, ఆఖరికి వాళ్ళు తెచ్చుకున్న అన్నంతోసహా లాగేసుకుంటున్నారట. నోరు విప్పితే చావకొడతారంట.

నాన్న చకచక కట్టెలమోపు బిగిస్తోంటే 'ఏవూర్రా నీది? " అన్న కరకు కంఠం వినిపించిందంట.

నాన్న త్రుళ్ళిపడి ఒంగి వున్నవాడు నిటారుగా అయినాడంట. ఎదురుగా నల్లగా లావుగా పెద్ద పొట్టతో గున్నఏనుగులా వున్న మనిషి ఉరిమి చూస్తూ కనిపించాడు.

"మాట్లాడక ఎనుబోతులా బెల్లంకొట్టిన రాయిలాగా నిలబడిపోతావేంటిరా? నీ పేరేంది? " మళ్ళీ గద్దించి అడిగాడట వాడు.

నాన్నకి అసలే పౌరుషం జాస్తి! దగ్గరివాళ్ళు ఒకరిద్దరూ పెద్దవాళ్ళు తప్ప వూళ్ళో ఎంత పెద్ద ఆసామి అయినా నాన్నని 'ఒరే అరే' అనరు. 'కిష్టయ్య' అంటారు. కొందరు 'కిష్టన్నా' అని మర్యాదిస్తారు. పంతులుగారయితే మరీ 'కిష్టయ్యగారూ' అంటాడు.

నాన్న కోపాన్ని అణచుకుని "తలుపూరు పాడు" చెప్పాడు.

వాడు దొంగ అని నాన్న పసిగట్టేశాడు.

"నీ పేరు? " అడిగాడు వాడు ఎగాదిగా చూస్తూ.

"కిష్టయ్య" చెప్పాడు నాన్న.

"అబ్బో... ఉఫ్ అంటే ఎగిరిపోయే గుడ్డ లేశావుగదరా" అన్నాడు వాడు.

ఆరోజు నాన్న టౌన్‌కి వెళ్ళి పని చూసు

కుని ఉదయం ఆట సినిమా చూసుకుని వచ్చాడుగదా. ఒంటిమీద తెల్లటి బట్టలున్నాయి.

"చేతులు చూపించు" అన్నాడు వాడు.

నాన్న వెనక్కి పెట్టుకున్న చేతులు ముందుకి చాపాడు. నాన్న చేతికి పట్నం వెళ్ళినప్పుడు మాత్రమే పెట్టుకునేవాచీ వుంది. ఎవరో అమ్ముతోంటే సెకండ్‌హేండ్‌ది కొన్నదట నాయనమ్మ ఎంతో మోజు పడి పాలు అమ్మి కూడబెట్టిన డబ్బుతో నాయనమ్మ చెయ్యించింది వెండి ఉంగరం కూడా వుంది. అందుకనే అవంటే నాన్నకి చాలా ఇష్టం.

"ఉంగరం వెండిదా? నీ షోకు చూస్తే షావుకారోడు మాదిరి వున్నావుగదరా" అని "సరి సర్లే జేబులో డబ్బుంటే అదీ ఆ వాచీ ఉంగరం తియ్" అన్నాడు ఆ దొంగ.

నాన్న తప్పనిసరిగా జేబులోంచి డబ్బు తీశాడు. ఆరోజు కట్టెలమ్మిన డబ్బు అది. నాన్న ప్రాణం విలవిలలాడింది. నాన్న ఆలోచిస్తున్నాడు. వాడొక్కడే అయితే చావ చితక్కొట్టగలడు తను. కానీ ఇంకా లోపల వాడి మనుషులుంటే అంతా వచ్చి కమ్ముకున్నారంటే తనకి సున్నంలోకి ఎముకలేకుండా చితకతంతారు. చంపినా చంపేస్తారు. ఇంట్లో తనమీద ఆధారపడిన ముసలి తల్లి, పెళ్ళికావాల్సిన చెల్లెలూ వున్నారు.

ఇలా ఆలోచించి నాన్న తప్పనిసరిగా డబ్బూ వాచీ తీసి వాడు చెప్పినచోట పెట్టాడు.

"ఊఁ ఆ బట్టలు విప్పు" చెప్పాడు వాడు ఈసారి!

నాన్న చివ్వున తలెత్తాడు.

రక్తం సలసల మరిగిపోయింది.

"నిన్నేరా! బట్టలు విప్పుతావా లేదా?" అంటూనే "బాగా కండలు పెంచావే!" అన్నాడుట వాడు.

వాడు తన కండల్ని చూసి భయపడక అంత నిర్భయంగా వున్నాడంటే నిశ్చయంగా ఆ దగ్గర్లోనే వాడి మనుషులు అడవిలోనే ఉన్నారన్నమాటే!

ఇపుడేమిటి కర్తవ్యం?

"విప్పరా" అంటూ గర్జించాడు వాడు!

నాన్న చేసేది లేక తప్పనిసరిగా పంచె, చొక్కా విప్పేశాడు. "ఆ బనీను అదీ కొత్తవిలా వున్నాయి! విప్పు" చెప్పాడా నీచుడు!

అవమానంతో నాన్న శరీరం దహించుకుపోతోంది. అప్పటికే వాడు జేబులోంచి కత్తి తీసి దానితో ఆడుకుంటున్నాడు.

నాన్న లోపలి దుస్తులు విప్పేశాడు. మనసు మండిపోతోంది.

వాడు బిగ్గరగా నవ్వి "శభాష్! ఇక ఆ. కట్టెల మోపు తీసుకుని పో! వూళ్ళో నీకంతా హారతులిస్తారు" అన్నాడు హేళనగా.

అని ఒంగి బట్టలూ డబ్బూ తీసుకుంటున్నాడు.

ఆ క్షణంలో ఆలోచించాడు నాన్న! ఈ అవతారంతో ఊళ్ళోకి వెళ్ళేకంటే ఆత్మహత్య చేసుకుని చావడం మేలు. అలా చచ్చే ముందు ఇంత ఘోరంగా అవమానించిన వీణ్ణి చంపి చావడం మేలు. ఈ ఆలోచన రావటం ఆలస్యం... మెరుపు వేగంతో ఒంగి కట్టెల మోపులోంచి ఓ కట్టెలాగి వాడి తల మీద బలంగా బాదాడు. ఒక్కసారి కాదు... దెబ్బమీద దెబ్బగా.

వాడు చావు కేకలు పెడుతూ రక్తం ధారల్లో కూలిపోయాడు. అంతే నాన్న కిందకి ఒంగి బట్టల్లోంచి చేతికి అందిన పంచె తీసుకున్నాడు. కనీసం దాన్ని కట్టుకునే వ్యవధి లేదు. వాడి కేకలకి అడవిలో మనుషుల అలికిడి తెలుస్తోంది. వాళ్ళొస్తే తనని బతకనీయరు. పంచెని అంగమొలకి అడ్డం పెట్టుకుని పారిపోవడం ప్రారంభించాడు. వాళ్ళొచ్చేసరికి కనుమరుగయ్యాడు.

కింద పడినవాడు రెండు మాటలు మాత్రమే చెప్పగలిగాడు వాళ్ళతో. "నల్లగా, ఎత్తుగా వున్నాడు. గిరిజాల జుట్టువాడు" అంటూ!

వాళ్లు తరుముకు రాసాగారు. పారి పోతూన్న నాన్న వాళ్ళ కంటబడ్డాడు.

"ఓరేయ్! ఆగరా నాకొడకా..." బండబూతులు తిడుతున్నారు వాళ్లు.

నాన్న ఒకసారి వెనుదిరిగి చూశాడు.

నలుగురు వాళ్లు!

ఇంకా వేగంగా పరుగెత్తసాగాడు.

వాళ్లు బూతులు తిడుతున్నారు. ఆగక పోతే చంపిపోగులు పెడతామంటున్నారు. చేతికి అందిన రాళ్లు తీసి విసుర్తూ తరుము కొస్తున్నారు.

ఆ రాళ్లు తగిలి నాన్న శరీరం చీరుకు పోయి గాయాలవుతున్నాయి. ఒక్కోసారి వెనుదిరిగి బాధ భరించలేక చెయ్యి అడ్డు పెడుతున్నాడు...! పారిపోతున్నాడు...! వాళ్లకీ తనకీ మధ్య దూరం తరగకుండా జాగ్రత్త పడుతున్నాడు. శరీరంలోని శక్తి నంతా కాళ్లలోకి తెచ్చుకుని పారిపోతున్నాడు.

మృత్యువు వెంటబడి తరుముతోంది.

ప్రాణాలు దక్కించుకోవడానికి పారిపోతూనే కొండదిగేశాడు. తరుముతూన్న దొంగల్లో ఒకడు పడిపోయాడు ఎదురు దెబ్బ తగిలి. వాళ్లు కాస్త వెనకబడ్డారు.

తాను 'తరుణవాయి' అన్న వూరుచేరాడు అన్న విషయం గమనించాడు నాన్న.

రెండు క్షణాలు ఆగి నడుముకి పంచెకట్టుకుని వూళ్లోకి జొరబడ్డాడు! అప్పటికి చీకటి పడడంతో వూళ్లోవాళ్లు లాంతర్లు, బుడ్డిదీపాలూ వెలిగించుకున్నారు. అప్పటికా పల్లెల్లో చాలావరకూ కరెంటు రాలేదు! ఆ వూళ్లో నాన్న బంధువులు వున్నారు! నాన్న తన బంధువుల ఇంటికి చేరుకున్నాడు! జరిగింది చెప్పాడు! ఆ ఇంటి ఆవిడ నాన్నకి పెద్దమ్మ వరస.

గుండెలు బాదుకుంటూ "ఓర్నాయనో కిష్టయ్యా! వాళ్లతో పెట్టుకున్నావా? నిన్ను బతకనిస్తారా? ఇంతకీ నువ్వు కొట్టినవాడు బతికాడా? చచ్చాడా?" అని అడిగింది.

"తెలీదు" అన్నాడు నాన్న!

పెదనాన్న వూళ్లో వాళ్ళని కొందర్ని పిలుచుకు వచ్చాడు! అంతా కలిసి ఏం చెయ్యాలా అని ఆలోచించారు! ఆ దొంగలు పరమకిరాతకులు! వాళ్ల బారినుండి నాన్నని తప్పించాలి! నాన్నని ఆ ఇంట్లో ఓ పెద్ద ధాన్యపు గాదెలో దాచి పైన గడ్డికప్పారు! ఊళ్లో ముసలీ ముతకా తప్ప మగాళ్లు చాలావరకూ మాయం అయి పొలాల్లో చేరారు! ఓ కుర్రాడిచేతికి ఓ కొమ్ముబూర ఇచ్చి అంత ఆపదవస్తే ఊదమని చెప్పారు! ఓ దగ్గర పారలూ, పలుగులూ, కత్తులూ దాచివుంచారు.

మరో అరగంటగ్గానీ దొంగలు ఆవూరు రాలేదు! బహుశా తమ మనిషి ఏమయిపోయాడో అడవిలో ఏ తోడేళ్లబారిన పడతాడో అని వెనక్కి వెళ్లివుండొచ్చు!

ఇంటింటి తలుపుతట్టి "నల్లగా ఎత్తుగా పోతపోసిన ఉక్కుమనిషిలా వుంటాడు! గిరిజాలజుట్టు! అడవిలో కట్టెలుకొట్టి మా పెద్ద పులిని కొట్టాడు. మా నాయకుడ్ని పడేశాడు! చావు బతుకుల్లో వున్నాడు! ఛస్తాడో బతుకుతాడో కూడా తెలీదు! ఆ గిరజాలజుట్టు వాడు ఎవరు? ఏ వూరివాడు! వాడెవడో చెప్పండి! వాడి ఒంటిమీది గుడ్డలివిగో! గుర్తుపట్టి వాడెవడో చెప్పండి" అని అడగసాగారు.

ఆడవాళ్లు తమకసలు తెలీదంటే తెలీదని చెప్పసాగారు.

"వాడీవూరే వచ్చాడు! తెలిసీ చెప్పకపోయారంటే తరువాత ఉప్పుపాతర పెడతాం"

అంటూ బెదిరించసాగారు.

"ఐదు వందల డబ్బిస్తాం! వాడి ఆచూకీ చెబితే" పగతో రగిలిపోతూ ఆశపెట్టాడొకడు. ఆ రోజుల్లో ఐదు వందలంటే చిన్న సంగతికాదు!

అయినా ఎవరూ చెప్పలేదు. పెద్దమ్మ ఇంటికి కూడా వచ్చారు.

"మాకేం తెలుసునాయనా! మగాళ్లింకా పొలంనుంచి రాలేదు! ఆడాళ్లకేం తెలుస్తుంది" అంది పెద్దమ్మ.

"వాడు దొరికితే వాడ్ని ముక్కలు ముక్కలుగా నరికిన దాకా మా పగచల్లారదు. ముసిలిదానా! నువ్వు అబద్ధం చెప్పావనుకో నిన్నూ నీ మొగుడ్నీ నీ బిడ్డల్నీ నరికేస్తాం!" అన్నాడు.

పెద్దమ్మ "ఇల్లంతా వెదుక్కోండి నాయనా! నా మాటమీద నమ్మకంలేకపోతే" అంది.

వాళ్లు ఇల్లంతా సోదాచేశారు. గాదెలోకి తొంగిచూశారు! నాన్న ఊపిరిబిగబట్టాడు! వాళ్లు వెళ్లిపోయారు.

ఆ తరువాత అర్ధరాత్రి నాన్నను బయటికి రప్పించి స్నానం చెయ్యించి అన్నం పెట్టి మళ్లీ గాదెలోకి దింపింది పెద్దమ్మ! తెల్లార్ధి నాన్న వూరికి కబురు పంపింది. మూడు రోజులు అనుమానం తీరక తరుణ వాయి చుట్టూ తిరిగారు దొంగలు! వారం రోజులపాటు నాన్నని గాదెలోనేదాచి తరువాత రోజు మంగలిని పిలిపించి నాన్న గిరజాలజుట్టుని చక్కగా గొరిగించి నున్నగా గుండు కొట్టించి గోచీపోసి పంచకట్టించి చొక్కాలేకుండా జంధ్యం మెడలోవేసి కండువా భుజాలమీద కప్పి నుదుటన విబూది నామాలు తీసి ఓ బ్రాహ్మడిలా తయారుచేసి ఆ వూరినుంచి అటే టౌన్‌కి పంపేశారు.

మూడు నెలలపాటు ఆ దొంగలు చుట్టుపక్కల పల్లెలన్నీ తిరిగి నాన్న ఆచూకీ కోసం అడుగుతూనే వున్నారు.

ఆ మూడు నెలలూ నాన్న పట్నంలోనే వున్నాడు.

అక్కడా వూరికే వుండలేదు. తెలిసిన వాళ్లింట్లో వుండి ఏదో పని వెదుక్కునేవాడు! అత్త పెళ్లికి కావలసిన డబ్బు కూడబెట్టేశాడు కూడా! అంతటి సమర్థుడు నాన్న.

ఆ తరువాత తిరిగి మావూరొచ్చాడు! ఆ తరువాత నాన్నచేత చావు దెబ్బలుతిన్న దొంగ చచ్చాడో బతికాడో! ఆ మిగతా దొంగలు తమ పగని మర్చిపోయారో లేక వాళ్లని పోలీసులు పట్టుకుపోయారోగానీ మరో మూడ్నెల్లు ఆగి నాన్న మామూలుగా కట్టెలకోసం కొండకి వెళ్లసాగాడు.

ఆ చుట్టుపక్కల పదివూళ్లలో నాన్న సాహస గాథ కథలు కథలుగా చెప్పుకోవడమేగాదు ఎందరిలోనో ఈ సంఘటన ఆయనపట్ల గౌరవాన్నీ ఆరాధనా భావాన్నీ పెంచింది.

నాన్న చెబుతూన్న కథ వింటూ నిద్రలోకి జారుకున్నాను! నా కలల్లో నాన్న ఓ రాజు! కత్తి పట్టుకుని దొంగల్తో యుద్ధం చేస్తూ వాళ్లని ఓడించేవాడు!



"నాన్నా! ఆ రోజు నువ్వు దోపిడీ దొంగల్ని చావు దెబ్బలు తీశావు!

మరి ఈ రోజు నీ ప్రియాతి ప్రియమైన కూతురు దేవత ముసుగులో పట్టపగలు పబ్లిగ్గా జనాల్ని దోచుకునే దోపిడీ దొంగ అయిపోయింది నాన్నా!

కానీ ఆ తప్పు నాదికాదు నాన్నా! నేను కావాలని ఇదంతా చెయ్యడంలేదు!

నాకీ జీవితం అసలు ఇష్టంలేదు.

ఈ మోసాలు నాకు అవసరంలేదు.

నేను కేవలం నిమిత్తమాత్రురాలిని.

ఊహ తెలిసీ తెలీని రోజుల్లో బలవం తాన ఊబిలోకి దించబడినదాన్ని.

అందులోంచి బయటపడేదారి తెలీక, నన్నాదుకునే నాథుడులేక ఇక్కడ ఇలా మగ్గిపోతున్నాను నాన్నా!, అనుకుంది తులసి

చేతిలో ఉన్న తండ్రి ఫోటోను చూస్తూ

"తులసమ్మా..."

తల్లి పిలుపుతో ఈ లోకంలోకి వచ్చింది తులసి! లేచికూర్చుంది.

"గుల్బర్గానుంచి ఫోనొచ్చింది" చెప్పింది.

ఏమిటన్నట్టు చూసింది తులసి.

"భారతి నీళ్లపోసుకుందట! రెండు నెలలు నిండిపోయాయట! నీ మరిది ఫోన్‌లో చెప్పాడు. వదినగారికి కూడా చెప్ప మన్నాడు"

"అవునా? " ఆనందంతో పొంగిపోయింది తులసి.

భారతి తన తరువాత ఆరేళ్లకి పుట్టింది. రెండేళ్లక్రితం పెళ్లయింది! దాని భర్త రవికు మార్ జాయింట్ కలెక్టర్‌గా గుల్బర్గాలో వున్నాడు.

"దాన్ని పిలిపించి పురుడుపోసిన దాకా ఇక్కడే వుంచుకుందామనుకుంటున్నానమ్మా! పసిది. దానికేం తెలుసు? అక్కడ పెద్ద దిక్కు ఎవరూలేరుకదా? " అంది భూదే వమ్మ.

"అలాగే పిలిపించమ్మా! అనంత్‌కి చెప్పు ఫ్లయిట్‌కి టికెట్ బుక్ చేయిస్తాడు" చెప్పింది తులసి.

"ఆమె మొగుడు పంపుతాడో లేదో తుల సమ్మా! అతగాడికి ఆ పిల్లంటే ప్రాణం! క్యాంపులకి కూడా వెంటపెట్టుకుని తీసుకెళ తాడు" కొద్దిపాటి గర్వంతో అని "ఇప్పుడలా తిరక్కూడదు. అతగాడు పంపనంటే ఎలా? పోనీ నేనే వెళ్లనా? దగ్గరుండి బిడ్డని చూసుకుంటాను. తొలిచూలుగదా! తల్లి మనసు నిలవడంలేదు తులసమ్మా!" అంది.

'తల్లి మనసు.'

తులసి పెదవుల మీద నవ్వు మెల్లగా ఆరిపోయింది. ఆ తల్లిమనసు కరిగేది ఒక్క భారతి, రాజు విషయాల్లోనే! తన విష యంలో అది చలించదేమో! మోడులా వున్న తననీ తన జీవితాన్ని చూసి అమ్మ ఎప్పుడైనా బాధపడుతుందా?

ఎప్పుడైనా ఈవిడకి దీనికీ భర్తా బిడ్డా వుండివుంటే బావుండేదిగదా అనిపించదా?

బహుశా అనిపించకపోవచ్చు! ఎందు కంటే తను బిడ్డకాదుగదా!

దేవత...

దేవత బిడ్డ ఎలా అవుతుంది?

దేవత బిడ్డ అయితే ఈ విమానయా నాలూ, వజ్రనగలూ, ఏసి భవంతుల్లో నివా సాలూ, కలెక్టరు అల్లుడూ ఇవన్నీ ఉండవు గదా! ఇవన్నీ ఇలా వుండాలంటే తను దేవ తగానే వుండాలి.

ముగ్గురు బిడ్డల్ని కన్నతల్లి ఓ బిడ్డపట్ల ఎంత స్వార్ధంతో కనికరంలేని తనంతో ప్రవ ర్తించగలదు?

సంబరంగా మాట్లాడుతోన్న భూదేవమ్మ హఠాత్తుగా గ్రహించింది తులసి మొహంలో మారిన భావాల్ని. అప్పుడే చూసింది ఆమె చేతిలోవున్న పాత ఫోటోని. అది తన భర్తది!

ఆమె మొహంలో నవ్వు, ఆనందం ఆవిర యిపోయాయి. నీలినీడలు ఆమె మొహాన్ని కమ్ముకున్నాయి. తులసి తల్లి మొహంలో మారుతున్న భావాల్ని రెప్పలార్పకుండా చూస్తోంది.

చప్పున తలదించుకుని "వస్తాను తుల సమ్మా" అంటూ వేగంగా వెళ్లిపోయింది తల్లి.

తులసి పెదవులమీద విరక్తితో కూడిన నవ్వు...

ఇలాంటి సందర్భాల్లో తల్లి అపరాధ భావంతో పారిపోతుంది. అంతేగానీ ఈ



జీవితంలోనుంచి బయటికి రావడానికి తల్లి తన వంతు సహాయం చెయ్యాలనుకోదు! అదసలు ఆవిడకి ఇష్టంలేని విషయం కావచ్చు కూడా! తననామె ఓ బిడ్డలా చూడడం ఎప్పుడో మర్చిపోయి దేవతలానే చూస్తోందేమో!

"తులసీ" అని పిలవడం మానేసి కూడా ఎన్నాళ్లయిందో!

అవసరం వచ్చినపుడు 'తులసమ్మా' అంటుంది.

తల్లి పరాయిదనిపించడం మొదలెట్టి చాలాచాలా రోజులు కాదు... ఏళ్లూ గడిచి పోయాయి! తోబుట్టువులూ అంతే!

"అక్కా..." అన్న ప్రేమపూరితమైన పిలుపుకి నోచుకొని ఎన్నాళ్లయింది? తనకి ఎవరూ లేరు! అందరికీ తను వుంది.

ఎలా?

ఓ బిడ్డగా, ఓ మేనకోడలిగా, ఓ తోడబుట్టిన దానిలాకాదు... ఓ దేవతలా...

ఆమెకి దుఃఖం ముంచుకొచ్చింది.

భరించరానంత దుఃఖం...

తండ్రి ఫోటోని చూసింది. అదెప్పుడో ఏ సంతలోనో తండ్రి ముచ్చటపడి తీయించుకున్న ఫోటో!

చూశావా నాన్నా! నువ్వెళ్లిపోయావు! నేను ఒంటరిదాన్నయిపోయాను నాన్నా! నాకెవరూ లేరు! నా మనసులోని దిగులూ

బాధ విని నన్ను ఓదార్చే అమృతహస్తమే లేదునాన్నా! నాకు ఒక్కోసారి చచ్చిపోవాల నిపిస్తోంది నాన్నా" ఏడుస్తోందామె.

లోకానికామె దేవత...

ఆమె మొరని ఆలకించే దేవుడు కాదు గదా కరుణగల సాటిమనిషే లేడు. ఆమె దుఃఖిస్తూనే వుంది.

ఫొటోలోంచి ఆమె తండ్రి ప్రేమపూరిత దయాదృక్కులతో ఆమెనే చూస్తున్నాడు.

గంట తరువాత ఆమెకి దుఃఖోపశమనం అయింది. లేచి మొహం కడుక్కుంది. తండ్రి ఫొటోని జాగ్రత్తగా దాస్తుండగా ఆమెకి అంత క్రితం తనని 'తులసిగారూ' అని సంబోధించిన ఆ యువకుడు గుర్తొచ్చాడు.

ఎవరతడు?

తనతడికి దేవతలా ఎందుకు కనిపించ లేదు?

నాస్తికుడా?

ఎంత బాగా పిలిచాడు తన పేరుతో...

'తులసిగారూ...'

ఆ పిలుపు గుర్తొచ్చినకొద్దీ ఆమె మనసులో విషాదం మెల్లమెల్లగా కరిగిపోయి చిత్రమైన ప్రశాంతత చేకూరింది.

★ ★ ★

ఆరోజు స్కూలుకి నర్సింగం అనే కుర్రాడి తల్లి వచ్చింది.

"మీరొచ్చిన కాణ్నించి మావోడు సదువులో మెరుగు పడినాడు సార్" అందామె.

"ఇంకా బాగా చదువుతాడు! మీవాడు కాస్త మొండిగానీ తెలివైనవాడే" చెప్పాడు ఫణి నవ్వుతూ!

"అంతా మీ పుణ్యం సారూ! అంతకు ముందుసారు మావోణ్ని మొద్దోడనేవోడు! అన్నట్టు సారూ మాతోటలో కాసిన వంకాయలు పంపనా? " అడిగింది సంబరంగా.

అతడు స్వయంగా వంట చేసుకుంటున్నాడని అందరికీ తెలుసు.

"అవేం వద్దులేమ్మా! నాకలా తీసుకోవడం ఇష్టంవుండదు" మెత్తగానే అయినా ఖచ్చితంగా చెప్పి "అవునూ! ఇక్కడ పేటూరమ్మ దగ్గర పనిచేసే నరసయ్యతో మీకేదో బంధుత్వం వుందని విన్నాను" అడిగాడు తెలీనట్టు!

"అవును సారూ! నాకు సొంత మేనమామ! ఈసారి మా మామ ఇంటికొచ్చినప్పుడు నీకు తెచ్చి పరిచయం చేస్తాలే సారూ" అందామె ఉత్సాహంగా.

"అతగాడు అమ్మవారి సేవలోనే వుంటాడా? " మెల్లగా మాటలు పెంచాడతడు.

పిల్లలంతా రాయడంలో, చదవడంలో మునిగి వున్నారు. అది ఏకోపాధ్యాయ పాఠశాల!

"సేవ ఏముంది సారూ! ఆయమ్మ ఒకరి సేవ చెయ్యించుకొనే తల్లిగాదే! ఆయమ్మ పేరుతో లచ్చలమంది బతుకుతున్నారు. నూటాయాభై రూపాయల సీర తప్ప కట్టుకోదు! ఒక్కకూరతో, మజ్జిగతో బువ్వ సరిపెట్టుకుంటుంది. బంగారు తల్లి..." చెప్పింది.

"అంటే...? "

నాగమణి అటూ ఇటూ చూసి కంఠం తగ్గించి "ఆయమ్మ మనకంతా దేవతగానీ తనసలు దేవతనని ఒప్పుకోదంట! శీనివాసరావుగారితో గొడవకూడా పడుతుందంట! సాదాగా బతకటం ఇష్టంట. ఏం చేసుద్ది... పాపం.." అని అంతలోనే నాలుక కొరుక్కుని "సారూ బుద్ధిమాలి ఏదో వాగేసినా. ఈ మాట బయటికి పోయిందంటే నా బతుకు కుక్క బతుకే. ఎక్కడా ఎవరితో అసలీ సంగతులే ఎత్తొద్దు సారూ! మంచిది గాదు..." అంటూ రయ్యిన వెళ్ళిపోయింది.

ఇక అది మొదలు రోజూ స్కూలుకి వచ్చి కొడుకు చదువు గురించి వివరాలు సేకరించే నాగమణి అతనికి ఇంక కనబడలేదు గానీ అతడి మనసుకోరే ఉప్పేదో అందించి

పోయినట్టయింది.

ఒకవేళ ఆ తులసి తనకి ఇష్టం లేని జీవి తాన్ని గడపటంలేదుగదా?

శ్రీనివాసరావు ఆమెకి స్వయానా మేన మామ అంటారు.

ఎవరి ప్రోద్బలంతో ఆమె అమ్మవారు అయింది?

ఆ నౌఖరు నర్సయ్యతో మాట్లాడే అవ కాశం దొరికితే బావుండుననిపించింది. కానీ, అది ఎంత అసాధ్యమో అతడికి తెలీనిది కాదు! వారం గడిచినా తెలిసిన దానిమీద అదనంగా ఒక్క సంగతీ అతడికి తెలీకపో వడమే గాక దార్లో ఎదురయినా నాగమణి అతడ్ని తప్పించుకుపోవడం ప్రారంభిం చింది.

ఆరోజు పేటూరమ్మని పేరు పెట్టి పిలి చాక అతడు మళ్ళీ ఆశ్రమంలోకి వెళ్ళలేదు. వెళ్ళి సాధించేదేం కనబడలేదు అతడికి. దానికి బదులు సాయంత్రంవేళ అలా వాకింగ్‌కి వెళ్లడం అలవాటు చేసుకున్నాడు.

పేటూరు ఓ అడవిని అంటుకున్నట్టు అడవి మొదట్లో వున్నవూరు. ఆశ్రమం ప్రాంతపు వెనకనుంచి చుట్టు తిరిగి అడవి లోకి వేళ్ళే వాడతడు. కొందరు కట్టెలు కొట్టే వాళ్ళు అడవిలోకి వెళుతూండేవాళ్ళు. అడ వంటే పెద్ద అడవేంకాదు. నశించిపోయి నామమాత్రంగా మిగిలింది.

అక్కడ ప్రైమరీ హెల్త్ సెంటర్‌లో పని చేసే ఓ మేల్ నర్స్ తనూ వాకింగ్‌కి వస్తూ ఫణిని చూసి హెచ్చరించాడు. "సార్! మీరు ఇక్కడికి వస్తే వచ్చారుగానీ తూర్పు వేపు వెళ్ళకండి మంచిదికాదు"

"ఎందుకని? "అడిగాడు.

"అది ఆశ్రమం వెనకభాగం అవుతుంది. పేటూరమ్మ ఆవైపు వ్యాహ్యాళికి వస్తుందని అటువైపు ఎవర్నీ రానీయరు" చెప్పాడతడు.

చాలా ముఖ్యమైన సంగతి తెలిసింది.

ఆరోజునుంచి అతడు ఆవైపు వెళ్ళడం ప్రారంభించాడు. అయితే ఎవరికంటా పడ కుండా వుండేందుకు జాగ్రత్తలు తీసుకునే వాడు.

అక్కడికి ఆశ్రమం వెనకభాగం కనబడు తుంది. అంటే దూరంనుంచి బిల్డింగుల్లా వాటి వెనకవుండే పెద్దతోటా కనిపిస్తాయి. అతి పెద్దదైన ఆతోటలో కృత్రిమ సెల యేళ్ళు కుడి ఎడమల కనిపిస్తున్నాయి. అయితే ఈవేపు నుంచి లోపల ఎవరూ ప్రవేశించకుండా దట్టమైన ఐరన్ ఫెన్సింగ్ వుంది. బహుశః అందులోంచి ఇరవై నాలు గ్గంటలపాటూ కరెంట్ ప్రవహిస్తూండి వుండొచ్చని వూహించాడతడు.

నిజంగా ఐరన్ ఫెన్సింగ్ వెనకనుంచి కన బడే గార్డెన్ దేవతలు విహరించే దివ్య ఉద్యానవనంలా అతడెక్కడా చూడనంతటి పూల ఫలజాతులతో విలసిల్లుతోంది. ఆ సువాసనలు గాలిలో తేలివచ్చి మనసుని ఆహ్లాదపరుస్తున్నాయి.

మనిషి చేతిలో డబ్బుండాలి గానీ జీవి తాన్ని మహాద్భుతంగా అనుభవించవచ్చు అసాధ్యాల్ని సుసాధ్యాలు చెయ్యనూవచ్చు అనుకున్నాడు.

అక్కడ సెక్యూరిటీ అలికిడి వినిపించలేద తడికి.

కరెంట్‌ని మించిన సెక్యూరిటీ ఏముం టుంది? అనుకున్నాడతడు.

అతడు రోజూ అటువేపు రావడం అలవా టుగా మార్చుకున్నాడు. అయితే దీనికోసం అడవిలోంచి చుట్టు తిరిగి రావడంలాంటి జాగ్రత్తలతోపాటు ఏ చెట్టునో పుట్టనో చాటు చేసుకుని ఫెన్సింగులోంచి లోపలికి చూస్తూండేవాడతడు. అతడి నిరీక్షణ మరో వారంరోజుల తరువాత గానీ ఫలించలేదు.

ఓ సాయంత్రం అయిదూ నలభై అయిదు ప్రాంతంలో కనిపించింది అతడికి తులసి. ఆమెని చూసి అతడు చాలా జాగ్రత్తగా ఫెన్సింగ్ సమీపానికి చేరుకున్నాడు. అక్కడ ఎవరూ లేరు. ఆమె మాత్రమేవుంది. పరా

కుగా ఆలోచిస్తూ తోటలో విహరిస్తూన్న దుప్పులూ, లేళ్ళు, నెమళ్ళలాటి వాటిని యధాలాపంగా గమనిస్తూ అడుగులో అడుగు వేసుకుంటూ నడుస్తోంది.

ఆమెను తను సాహసించి పిలిస్తే ఆమెకి వినిపిస్తుందా? అని ఆలోచించాడతడు.

అది రిస్క్‌తో కూడిన విషయం కావచ్చు తనకి కనబడని సెక్యూరిటీ పోస్ట్‌లాంటిదేమయినా అక్కడవుంటే చాలా పెద్ద ప్రమాదం ఎదురవుతుంది. ఆమెకి తన ఉనికిని తెలియచేయడం ఎలా? దానికి ఆమె ఎలా ప్రతిస్పందిస్తుంది?

అయితే అతడి అదృష్టంకొద్దీ తోటచివరివరకూ నెమ్మదిగా నడుచుకుంటూ వచ్చిందామె. అతడి పిలుపుకు అందేంత దూరంలో వుంది. స్పష్టంగా కనిపిస్తోంది ఫెన్సింగ్‌లోంచి. ఆకాశంరంగు గోరంచు జరీ చేనేత చీర కట్టుకుంది. పొడవాటి కురుల్ని జడగా అల్లుకుంది. మొహాన చిన్న తిలకం బొట్టుంది. ఆశ్చర్యకరంగా ఆమె చేతులకి ఎర్రని మట్టిగాజులు తప్ప శరీరం మీద ఏ ఇతర ఆభరణాలూ లేవు.

ఆమె ఆ సాయంసంధ్యలో వన విహారం కోసం మారువేషంలో వచ్చిన దేవకన్యలా మెరిసిపోతోంది. ఆమె నునులేతసోయగం ఆమెను 'చాలా అమాయకంగానూ చిన్నదానిలాగా కనిపింపచేస్తోంది.

'ఈమె పట్ల జనానికి వున్న భక్తి భావానికి తోడు ఆకర్షణ కూడ జతయివుండొచ్చు. దానికి కారణం ఈ రూపమే' అనుకున్నాడతడు.

అతడామెను పేరుతో పిలవబోయి అంతలోనే ఆగిపోయి మెల్లగా చప్పట్లు కొట్టాడు. పరాకుగా వున్న ఆమె ఆ నిశ్శబ్దంలోంచి వినిపించిన ఆ చిరుచప్పుడుకి తల ఎత్తి చూసింది.

అతడు అడవి పొదలచాటునుంచి బయటికి వస్తూ "ఇక్కడ" అన్నాడు. అతడ్ని చూసి ఆమె ఆశ్చర్య చకితురాలు కావడమే కాదు అతడ్ని చూసి మరుక్షణాలలో అసంకల్పిత ప్రతీకారచర్యలా చివ్వున తల తిప్పి చుట్టూ చూసింది.

ఎవరూలేరని నిర్ధారించుకున్నాక కంచె దగ్గరికి నడిచింది. అప్పుడే అర్ధమైంది అతడికి ఆశ్రమంలో ఎవరికైనాసరే ఆమె భయపడే అవకాశం వుందన్నమాట?

ఆమె ఫెన్సింగ్ దగ్గరికి వస్తూనే, "మీరా? ఎందుకొచ్చారు? ఇక్కడికి రావడం అంత మంచిది కాదని తెలీదా? " అంది గబగబ తన మృదువైన సన్నని గొంతులో ఆందోళన వ్యక్తపరుస్తూ.

"తులసిగారూ! నాపేరు ఫణీంద్ర. మిమ్మల్నో మాట అడుగుతాను. జవాబు చెప్పగలరా? " కొద్దిపాటి సమయంలోనే వీలయినంత విషయసేకరణ జరపాలన్న తపనతో తెగించాడతడు.

సైగా ఆమె ప్రవర్తనా తీరూ అతడికి ధైర్యాన్నిచ్చాయి.

"అడగండి" అందామె.

తనో దేవతనో లేక ప్రత్యేకమయిన వ్యక్తిననో... ఇలాంటి ఫీలింగ్ ఆమె దగ్గర కనబడలేదు.

"మీరిక్కడ బందీనా? ఒక దేవతలా కొలవబడడం మీకు ఇష్టంలేని విషయమా? ఎవరు మీచేత ఈ నాటకం అంతా ఆడిస్తోంది? ఎవరామనిషి? " అడిగేశాడతడు.

అతడి మాటలకి ఆమె నిర్ఘాంతపోయింది.

అయితే అతడి ప్రశ్నలకి ఆమె జవాబీయక "దయచేసి వెళ్ళిపోండి. ఆశ్రమం వాళ్ళు మిమ్మల్ని ఇంతకుముందే గమనించడం ప్రారంభించారు. చాలా పెద్ద ప్రమాదంలో చిక్కుకుంటారు. మళ్ళీ ఈ ఛాయలకి రావద్దు" అనేసి చరచర కదిలి వెళ్ళిపోయింది.

అతడిలో ఆశాభంగం, ఆనందం, ఆశ్చర్యం సమపాళ్ళలో కలిగాయి. ఆమెని

పలకరించి ఆమెలో కొంతయినా కలవరాన్ని రేపగలిగినందుకు ఆనందం. ఆమెద్వారా ఏమీ వినలేకపోయినందుకు ఆశాభంగం.

అప్పుడే ఆశ్రమం వాళ్ళు తనని గమనించి అనుమానించడం మొదలయిందనేది తెలిసి అది ఆశ్చర్యం కలిగించే విషయం అయింది.

ఆరోజునుండి ఫణి ఒక ఆశావాదంతో అక్కడికి రాసాగాడు. మళ్ళీ అతనికి మూడో రోజు కనిపించిందామె. ఆమె తన కోసం వెదుక్కోవడం కూడా గమనించాడతడు. అయితే అతడ్ని చూసీ చూడగానే ఆమె వెళ్ళిపోయింది.

మరో రెండురోజుల తరువాత ఆమె అతడితో మాట్లాడుతూ "మీమీద పూర్తిగా అనుమానం వచ్చిందంటే మీరసలు ప్రాణాల్తో వుండరు" అంది.

అనేసి వెంటనే వెళ్ళిపోయింది.

ఆమె వెళుతూండగా "మీమీద చాలా జాలిగా వుంది తులసీ నాకు" అన్నాడతడు. ఈమాట ఆమె విన్నదో లేదో తెలీదు.

మళ్ళీ అతడికి రెండురోజులపాటు ఆమె కనిపించలేదు. మరో రెండురోజులు అతడేవో కారణాంతరాలవల్ల వెళ్లలేకపోయాడు. అయిదో రోజు అతడు వెళ్ళేసరికి తులసి అక్కడ వుంది.

అతడ్ని చూడగానే ఫెన్సింగ్ దగ్గరికి వస్తూ "నాల్రోజులుగా కన్పించలేదేం? " అడిగింది.

అతడికి చెప్పలేనంత ఆనందం కలిగింది. తనకోసం తులసి ఎదురుచూసింది.

ఆమె మళ్ళీ "ఆశ్రమానికి కూడా రావడం లేదేం? " అంది.

"కొన్ని పనులవత్తిడి కారణంగా" అని ఆగి "అయినా ఆశ్రమానికి వచ్చి సాధించేదేంవుంది? మీతో మాట్లాడలేనుగదా"అన్నాడు.

"నాతో మాట్లాడడం ఎందుకూ? " అందామె.

"తొలినాటి నా ప్రశ్నకి మీరు జవాబివ్వలేదు తులసీ" అన్నాడతడు.

"తెలుసుకుని మీరేం చేయగలరు? " అందామె.

ఆ ప్రశ్నకేం జవాబియ్యాలో అతడికి తోచలేదు.

"చూడండి ఫణీంద్రా! అందరిలా నన్నొక దేవతలా కాక మీసాటి మనిషిగా గుర్తించారు. మీపట్ల నాకు గౌరవం ఏర్పడింది. అందుకే చెబుతున్నాను. ఆపదల్ని కోరికోరి ఆహ్వానించక దయచేసి ఈ ఆశ్రమానికి దూరంగా వుండండి. ఈ ఆశ్రమం చాలా అందమైనదేకాదు, భయంకరమైందికూడా" అనేసి ఆమె వెళ్ళిపోయింది.

అతడికి పూర్తిగా అర్థమైపోయింది. ఆమె ఖచ్చితంగా ఆశ్రమంలో బందీ. ఆమెతో సంభాషణ పెంచడం ఎలా? ఆమెని కాసేపు నిలబెట్టడం ఎలా? అది ప్రమాదంతో కూడుకున్నదికూడా. అసలామెకి లభించే స్వేచ్ఛకి ఆ ఫెన్సింగే సరిహద్దు కావచ్చు అతడారాత్రంతా ఆలోచిస్తూనే వున్నాడు. తులసి ఆశ్రమంలోని దేవత వేషధారణని వదిలేసి ఇక్కడ ఓ అతిసాధారణమైన మామూలు అమ్మాయిలా కనబడడం, మాట్లాడడం, భయపడడం చాలా ఆశ్చర్యాన్నీ ఆలోచననీ కలిగిస్తోంది.

ఈ పరిణామాలన్నిటినీ తన కుటుంబసభ్యులకి తెలియజేసి వారి సలహా తీసుకుందామా అన్న ఆలోచన అతడికి వచ్చింది కానీ అంతలోనేవాళ్ళు సహకరించకపోవడమే గాక తన ప్రయత్నాన్ని హర్షించరని కూడా గుర్తొచ్చింది అతనికి.

నిజంగా తులసి ఆశ్రమంలో బందీ అయి వుండి ఆమె స్వేచ్ఛను కోరుకుంటూ వుండి వుంటే ఆమెను బయటికి తెచ్చి స్వేచ్ఛను కల్పించాలన్న ఆలోచన వచ్చింది అతనికి. అంతలోనే అతడికి నవ్వు కూడా వచ్చింది. అదంత సులభమా? భయంకర విషసర్పం

తోకని పట్టుకుని అగ్ని పర్వతాల్ని దాటాల నుకోవడం లాంటిది. పైగా తనకి తులసి మామూలు అమ్మాయిలా కనబడుతోంది. కానీ లోకానికి ఆమె దేవత. దేశవిదేశాల్లో ఆమె భక్తులు తామర తంపరగా వున్నారు.

'తన ఈ ఆలోచన ఈ వీర భక్తుల్లో ఒక్కరికి తెలిసినా తనని ఉప్పు పాతర వేస్తారు' అనుకున్నాడతడు.

ఆ మర్నాడే ఆమె విశాఖపట్నంలోని ఆసుపత్రి, మెడికల్ కాలేజీల ప్రారంభోత్సవ సభల్లో పాల్గొనడానికీ, అటునుంచి అటే యూరప్ పర్యటనకీ వెళ్ళిపోయింది. అది భక్తుల్ని కలవడానికి ఉద్దేశించిన ఆధ్యాత్మిక పర్యటన. అక్కడ ఆశ్రమపు శాఖల్ని ప్రారంభించబోతోంది అని రాశాయి పత్రికలు. నిజానికది కోట్లాది రూపాయల్ని విరాళాలుగా సేకరించే ప్రయత్నం అని ఫణికి అనిపించింది.

తులసి ఆకాశంలో విహరించే యక్షిణిలా అనిపిస్తోంటే తను ఆమె అష్టకష్టాల నడుమ బ్రతుకుతోందని భావించో, భ్రమించో ఆ ఆకాశంలోంచి ఆమె కిందకి దిగడాన్ని కోరుకుంటోందనీ అందుకు ఆమెకి తన సహకారం అవసరమవుతుందేమోననీ అనుకుంటున్నాడు.

నిజంగా తను వెర్రివాడుకాడుకదా? తన అనుమానాలూ ఆలోచనలూ ఆధార రహితాలేమో!

కానీ, అతడి మనసు ఈ ఆలోచనని అంగీకరించటంలేదు.

ఎవరెవరో వస్తున్నారు, ఏదేదో మాట్లాడుతున్నారు.

అంతా గొప్పవాళ్ళే. తన దయతో ఆశీర్వాదంతో కష్టాల్ని రూపుమాపమని, సమస్యల్ని పరిష్కరించమనీ వేడుకుంటున్నారు.

కుప్పలు తెప్పలుగా కానుకల్ని పోగు పోస్తున్నారు. నోట్ల కట్టల్ని సమర్పిస్తున్నారు.

బంగారం, వజ్రాలు, వెండి ముప్వలూ పోగుపడుతున్నాయి. యూరోపియన్స్‌లో కూడా ఆమె పేరు మారుమ్రోగుతోంది. గొప్ప గొప్ప ధనికులు ఆతిధ్యాలకి ఆహ్వానిస్తున్నారుగానీ, వీటిని అనుభవించి ఆనందించే స్థితిలో ఆమెలేదు.

ఆమె బంధుమిత్రులూ తల్లీ, తోబుట్టువులూ జీవితాన్ని ఎంజాయ్ చేస్తున్నారు.

ఆమె మేనమామకి సూట్‌కేస్‌లను జాగ్రత్త చెయ్యడానికే సమయం సరిపోవడంలేదు. ఎక్కడికెక్కడికో ఫోన్‌లు చేస్తున్నాడు.

తులసి అతడు మాట్లాడమన్నట్టు మాట్లాడుతోంది. చెప్పినట్టు చేస్తోంది. నడుస్తోంది.

ఇదంతా ఇపుడు కొత్తేంకాదు. గత పదిహేను సంవత్సరాలుగా జరుగుతోందే!

ఆమెలోని ఈ నిర్లిప్తత శ్రీనివాసరావుకి నచ్చడంలేదు. అతడి మనసులో ఇదొక సమస్యగా మారి ఆలోచనల్ని రేపుతోందీ మధ్య.

ఆమె కోరిక చాలా చిన్నది. భర్తతో సంసారాన్ని చేసుకోవాలన్నది.

మామూలుగా కోరిక అయితే చిన్నదే. కాని దైవాంశ సంభూతురాలయిన స్త్రీకి అలాంటి అల్పమైన కోరికలు వుండకూడదు.

ఆమె కోరుకుంటే ఎలాంటి అనుభవాల్నయినా ఆమె ముందు వుంచగలడు తను. కానీ, తులసికి కావలసింది స్వేచ్ఛ. అది ఆమెకి దొరికే వీలు లేదు.

భగవంతుడు కొందరికి కొన్ని ఇస్తాడు. కొన్ని ఇవ్వడు. ఎంతో సున్నితంగా ఈ విషయం చెప్పినా తను గ్రహించకుండా వుంది. ఒక్కోసారి అతడకి విసుగొస్తోంది.

రేపే ఇండియాకి తిరుగు ప్రయాణం. దాదాపు తనతో వచ్చినవాళ్ళంతా బయట చూడదగిన ప్రదేశాలు చూడడానికి వెళ్ళారు. ఆ గదిలో తులసి ఒక్కతేవుంది.

షాల్ కప్పుకుని విండోలోంచి రమణీయంగా కనబడుతోన్న ఆ నగరపు అందాల్ని చూస్తోందామె.

ఎందుకో ఆమెకి ఆక్షణాల్లో ఫణి గుర్తొచ్చాడు.

ఎందుకతడికి తనపట్ల అంత ఆసక్తి?

అసలు ఎవరతను?

చాలాకాలం తరువాత తన గురించి పట్టించుకున్న వ్యక్తి.

ఆమెకి సడెన్‌గా తన తండ్రి గుర్తొచ్చాడు.

ఆమెకి ఆనందం కలిగించే అంశాలంటూ ఏవైనా వున్నాయంటే అవి తన తండ్రితో కూడినవి మాత్రమే. మెల్లగా ఆమె మనసు బాల్యపు అంచుల్లోకి జారిపోయింది.



"నాన్నా... నాన్నా... నాకు రామతులసి అని పేరెందుకు పెట్టావు? "

"ఇంకేం పెట్టాలమ్మా? "

"రాణి అని పెట్టొచ్చుగదా నాన్నా? "

"నువ్వు నా బంగారు రాణివే తల్లీ. నీ పేరు మా అమ్మదమ్మా. మా అమ్మన్నా నువ్వన్నా నాకు చాలా ఇష్టం. అందుకే ఆ పేరు పెట్టాను" తల నిమురుతూ ఆరేళ్ళ తులసితో అన్నాడు తండ్రి.

"మరి మా అమ్మంటే? "

"ప్రాణం అమ్మా. అచ్చం మీ అమ్మలా వుంటావుగాబట్టే నువ్వంటే నాకు ప్రాణం" చెప్పాడు.

"నాన్నా! నువ్వు దొంగని కొట్టిన కథ నాకు ఎంత ఇష్టమో. నేను బళ్ళో అందరితో చెబ్తా" గర్వంగా చెప్పింది.

"మా అమ్మ కూడా నీలాగే అనేదమ్మా" అంటూనే కూతుర్ని ఒళ్ళోకి లాక్కుంటూ "నాకోసం ఎంత తపించేదనీ? పొద్దస్తమానం నాబిడ్డకి కాయకష్టం చెయ్యక తప్పడంలేదు అని విలవిల్లాడిపోయేది. నాకాశ్రమలోనే ఆనందం వుందంటే నమ్మేది కాదు. అన్నంటేనే నీకు ఇష్టం అని మీ అత్త ఉడుక్కునేది"

"నాన్నా! అత్త మన ఇంటికి ఎప్పుడోగానీ రాదేం నాన్నా? "

ఈ ప్రశ్నకి నాన్న జవాబు చెప్పలేదుగానీ అమ్మ అందుకుని, "పదీపన్నెండేళ్ళు రెక్కలు ముక్కలు చేసుకుని కూడబెట్టి గొప్ప ఇంట్లో ఇచ్చాడుగదా! ఆ విశ్వాసం బాగా వుందిలే మీ అత్తకి. పెద్దింటి కోడలు మన పూరిళ్ళలో ఎక్కడ వుండగలదులే" దెప్పిపొడుపుగా అంది.

"పోనిద్దూ భూదేవీ. చిన్నపిల్ల ముందు ఏమిటా మాటలు? సుబ్బలక్ష్మి సుఖంగా సంతోషంగావుంది. అది చాలదా? " అన్నాడు మందలింపుగా.

పెద్దవుతుండగా తెలిసింది తనకి డబ్బుతో పాటు గర్వం, నాగరికత పెరిగిన అత్తకి తన పుట్టిల్లంటే చిన్నచూపు! సౌకర్యాలు లేవని ఏ రెండు మూడేళ్ళకో ఓసారి మాత్రం చుట్టపుచూపుగా వచ్చి వెంటనే వెళ్ళిపోతుంది. నాన్న చెల్లెలి మర్యాదకీ అత్తవారింట గౌరవానికీ ఏం లోటులేకుండా పెట్టుపోతలు జరుపుతాడు ఈనాటికీ. అయితే అభిమానస్తుడైన తను చెల్లెలి ఇంటికి వెళ్ళేదీ అంతంతమాత్రమే. అత్త పిల్లలు పెద్దపెద్ద స్కూళ్ళలో చదువుకుంటు

న్నారంట.

"తులసీ... నువ్వు బాగా చదువుకోవాలమ్మా" అనేవాడు నాన్న.

"బాగా అంటే ఎంత నాన్నా? "

"కలక్టరమ్మ అంత" అమ్మ వెక్కిరింపుగా అనేది.

"కలక్టరే అవుతుందో, డాక్టరే అవుతుందో దాని అదృష్టం, తెలివితేటలు నిర్ణయిస్తాయి. తులసి చదువులో బహు హుషారయిందీ తెలివైందే. సూక్ష్మగ్రాహి అని పంతులు గారు చెప్పారు భూదేవీ. అది చదవాలేగానీ నా కండల్ని పిండిచేసుకుని ఎంత చదువైనా చదివించనా" ఒకింత ఆవేశంతో అనేవాడు.

నాన్నలో తను చదువుకోలేకపోయానన్న వెలితి చాలాచాలా వుండేదట. అసలు నాన్న చదువు లేని వ్యక్తి అంటే ఎవరు నమ్ముతారు? ఎంతో స్వచ్ఛంగా మాట్లాడేవాడు.

తనని బాగా చదివించాలన్న కోరిక మాత్రమే కాదు భవిష్యత్తులో తన చదువు కోసం అని ఇప్పటినుంచే తన సంపాదనలో నెలకి ఇంత అని పోస్టాఫీసులో కూడా దాచేవాడట.

"చూద్దాం అదీ. రేపోమాపో ఇంకొకరు దిగబోతోంటే ఎందరికని చదువులు చెప్పిస్తాం. పెళ్ళిళ్ళు చేస్తాం. మనకేం ఆస్తి పాస్తులా? " అనేది అమ్మ.

"అంటే నీకూ నా కండలమీద నమ్మకం లేదన్న మాట? " అనేవాడు.

అత్త పెళ్ళి తరువాత నాన్న పెళ్ళి చేసుకొన్నాక నేను పుట్టేదాకా దాచిన డబ్బుతో తాతలకాలం నాటి పాక తీసివేసి కాస్త దిట్టమైన పెద్దపూరిల్లు వేయించాడు నాన్న. నిజంగా నాన్నది ఉక్కు శరీరం. సంక్రాంతి వచ్చిందంటే నాయుడు, రామ్మూర్తి రెడ్డి లాంటి పెద్దింటివాళ్ళు కబురంపే వాళ్ళు. అరిసెలకోసం బియ్యం నీళ్ళలో పోస్తే తొలి కోడి కూతతో లేచి వెళ్ళి తెల్లారేసరికి మూడు కుంచాల బియ్యం ఒంటిచేత్తో పిండి చేసేవాడంట. వాళ్ళు వడ్లు కొలిచేవాళ్ళు. పదిరోజులపాటు నాన్నకి ఊపిరి తిరగని పని. పండక్కి అవసరమైన కట్టెపేళ్ళు చీల్చి పెట్టడం, అరిసెలు వండేప్పుడు నూనె ఒత్తి పెట్టడం, భోగిమంట కోసం తాటాకులు కొట్టుకొచ్చి వెయ్యడం లాంటి పనులు.

పండగ వెళ్ళిపోయిన నెలదాకా తమ ఇంట్లో అరిసెలూ, లడ్లూ తరిగేవి కావు. అమ్మ ఏమీ చెయ్యాల్సిన అవసరం వుండేది కాదు. ఇంకా ఇరుగూ పొరుగూకి అమ్మ ఇస్తూ వుండేది.

వాళ్ళు "నీకేంటే భూదేవమ్మా. కిష్టయ్య పదిపదిహేను రోజులు కష్టపడితే పడ్డాడు గానీ ధాన్యానికి ధాన్యం అప్పచ్చులకి అప్పచ్చులు. మా ధేభ్యం మొహాలూ వున్నాయి" అనేవాళ్ళు కాస్త ఈర్ష్యగా

నాన్న కొత్తబట్టలు తెచ్చేవాడు తమకి. భోగి పండగరోజు తమ ప్రాంతపు ఆచారం ప్రకారం అమ్మ దోసెలుపోస్తే నాన్న కోడిని కోసి ఇచ్చేవాడు. తల స్నానంచేసి కొత్తబట్టలు వేసుకుని పొయ్యిదగ్గర పీటమీద కూర్చుని అమ్మ పెనంమీంచి దోసెలు తీసి వేస్తుంటే కోడికూరతో డజనుకి తక్కువకాకుండా ఇరవై దోసెలుదాకా తినేవాడు నాన్న. మళ్ళీ కనుమ పండగరోజు వడలూ కోడికూర.

మంచి తిండి పుష్టిగల మనిషి నాన్న.

కొత్త గౌనో పావడానో వేసుకొని నాన్న వెంబడి వెళితే పెద్దింటి ఆడవాళ్ళు "కిష్టన్నా! నీ కూతురు రాణీలా వుందయ్యా" అనేవాళ్ళు.

వాళ్ళంతా నాన్నని చాలా అభిమానంగా చూసేవాళ్ళు.

ఆరోజు తనకి బాగా గుర్తు. నాన్న ఉదయాన్నే పట్నం వెళ్ళినవాడు పనిచూసుకుని ఇంటికొచ్చేసరికి బాగా పొద్దుబోయింది. నిద్దట్లో వున్న తనని లేపి లౌజు ఉండల పాకెట్ చేతికిచ్చాడు. తను తింటూంటే స్నానంచేసి అన్నానికి కూర్చున్నాడు.

ఒక్క ముద్ద నోట్లో పెట్టుకున్నాడో లేదో రంగరాజుగారి పాలేరు రొప్పుకుంటూ రోజు కుంటూ వచ్చాడు "కిష్టన్నా! జంట త్రాచులు. పొగరుమీద వున్నాయి. బుస్సు మంటూ కస్సున లేస్తున్నాయి. చిన్న పాప మంచంకింద దూరింది. అమ్మగారు అల్లాడి పోతున్నార. దొర బిత్తరపోయినాడు. నువ్వు చప్పున రా అన్నా" అంటూ.

అంతే! నాన్న చెయ్యి కూడా కడగలేదు. రివ్వున లేచి ఇంట్లో మూలనున్న పామును కొట్టే కర్రని అందుకుని పరుగెత్తాడు.

"ఇదుగో! కంచందగ్గర్నుంచి లేచిపోతవే" అంటూనే వుంది అమ్మ.

"ఊళ్ళో ఎవరింటికి పామొచ్చినా ఈయనే గుర్తొస్తాడు" గొణుక్కుంది అమ్మ.

నిజమే చాలామంది తమ లోగిట్లో పాము కనిపిస్తే చాలు "కిష్టయ్యా పాముని కొట్టాలి రావయ్యా" అంటూ పరుగెత్తుకువస్తారు.

సగం వూరన్నట్టు నాన్న వెంట వెళ్ళింది. నాన్న తిరిగి వచ్చేవరకూ అమ్మ ఆరాటంగా ఇంట్లోకీ బయటికీ తిరుగుతూనేవుంది.

అడవి దగ్గరకాబట్టి విషసర్పాలు ఎక్కువే. చాలామందికి పాముని కొట్టడం భయం. ఇంకొందరికి పాము దేవుడన్న నమ్మకంతో కూడిన భయం. కానీ నాన్నకి ఆ భయాలేం లేవు. నలుగురికి సాయం చేయాలనే పరోపకార పరాయణత్వం ఆయన్ని అలా పరుగులెత్తించేది. దానికోసం ఆయన ఒక వాటమైన కర్రని కూడా తయారుచేసి పెట్టుకున్నాడు. అయితే నాగు పాముని చంపితేమాత్రం నాన్న దాన్ని పాలుపోసి రాగినాణంవేసి తగలబెట్టేవాడు.

నాగుపాముని చంపితే కళ్ళు పోతాయని భయమేమో. అది దేవుడు కదా అని ఎవరైనా అంటే "పిచ్చిమొహాల్లారా! దేవుడు మనచేతిలో చావడానికి మన ఇంటికొస్తాడా? మా అమ్మ అలా అలవాటుచేసింది. అదామె నమ్మకం. ఆమెమీది అభిమానంతోనే నేను దీన్ని అలవాటుగా కొనసాగిస్తున్నాను" అనేవాడు.

నాన్న గుడికి అదేపనిగా వెళ్ళడం దేవుడికి మొక్కడం తను ఎప్పుడో తప్ప చూసింది చాలా తక్కువ. అమ్మ ఇంట్లో దేవుడికి పూజచేసి హారతి ఇచ్చి దణ్ణం పెట్టుకోమంటే "పిచ్చిదానా మనసులో దేవుడు లేడంటే? " అంటూ వచ్చి ఆవిడ సంతృప్తికోసం అన్నట్టు దణ్ణం పెట్టేవాడు.

అమ్మ పెట్టిన ప్రసాదాన్ని ముసిముసిగా నవ్వుకుంటూ తినేవాడు.

ఆరోజు రంగరాజుగారింటికి పాముని కొట్టడానికి వెళ్ళిన నాన్న గంట తరువాత తిరిగివచ్చాడు.

తను ఎదురు పరుగెత్తుకెళ్ళి "పాముల్ని చంపావా నాన్నా? " అడిగింది.

"చంపాన్రా" అని తనని ఎత్తుకుని అమ్మతో "భూదేవీ... మంచి పొగరుమీద వున్న పాములనుకో! పైకి ఎగబడ్డాయి. నా జీవితంలో అలాంటి పాముల్ని చాలా తక్కువ చూశాను. కాస్త ఆలస్యం అయివుంటే బిడ్డ ప్రాణాలు తీసివుండేవి" చెప్పాడు.

"వూళ్ళో వాళ్ళందర్నీ ఉద్ధరించడానికి నువ్వు వెళితే నీకేదయినా అయితే నేనూ నా బిడ్డ ఏం కావాలయ్యా" అంటూ గొల్లుమంది అమ్మ.

"పిచ్చిదానా... నాకేం అవుతుందే? కష్టంలో వున్న వాళ్ళని ఆదుకోవద్దా? నాకు ఒడుపు తెలుసు. ఇప్పటికి ఎన్ని పాముల్ని కొట్టివుంటానో, ఒక్కటీ నన్ను కాటెయ్యలేదు తెలుసా? అసలు పాములు పగపట్టడం అన్నది పిచ్చిమాటే. పాములకి అసలు చెవులు వుండవు. మనుషుల్ని గుర్తుపట్టలేవు" అంటూ అమ్మని దగ్గరికి తీసుకుని ఓదార్చాడు.

అయితే ఇక ఆ రాత్రికి నాన్న అన్నం తినలేదు. చేతులారా రెండు జీవాల్ని చంపినందుకు ఏదో బాధగా వుందన్నాడు. అప్ప

డప్పుడు అంతే. చంపడం బాధపడడం. అసలు ఇంట్లో పెరిగే కోళ్ళని గుడ్లకోసం అమ్మడం తప్ప నాన్న కొయ్యనీయడు.

"పసిబిడ్డల్లా వాకిట్లో మనవెంట తిరుగుతాయి. ఇంటపుట్టి పెరిగిన కోడిని కొయ్యడం ఎలా? నావల్లకాదు" అనేవాడు.

ఆ తెల్లారి రంగరాజు బండ్లో బస్తా బియ్యం, కందిపప్పు, పెసరపప్పు, ఉలవలూ, కూరగాయలూ, చింతపండూ, మిరపకాయలూ తెచ్చి నాన్న చేతులు పట్టుకుని "కిష్టయ్యా! దేవుడిలావచ్చి నాబిడ్డని కాపాడావు. నీ మేలూ, రుణం ఈ జన్మలో తీర్చుకోలేనివి. నా తృప్తికోసం ఇవి తీసుకో. మీ వదిన కూడా తనమాటగా చెప్పమంది" అన్నాడు.

మృదువుగానే అయినా ఖచ్చితమైన గొంతుతో, "స్నేహధర్మంగా వచ్చి బిడ్డను కాపాడానుగానీ కూలికి ఆశపడికాదు. ఇదిగో దేవుడిచ్చిన కండలు. వీటితో నా భార్యా, బిడ్డల్తో నా జీవితం లక్షణంగా సాగిపోతుంది" అంటూ తిరస్కరించాడు నాన్న.

రంగరాజు చిన్నబోయిన మొహంతో వెళ్ళిపోయాడు. ప్రతిఫలాపేక్షలేని సాయాన్నే పరోపకారంగా భావించే నాన్న ఔన్నత్యాన్ని తెలియజేసే ఆ సంఘటన ఈనాటికీ తన కళ్ళకి కట్టినట్టుంది. నాన్న గురించిన ప్రస్తావన వచ్చినప్పుడు వూళ్ళోవాళ్ళూ, పక్క వూరివాళ్ళూ "అబ్బో! అతనా? గొప్ప మొగోడులే" అనేవాళ్ళు.

ఇరుగూపొరుగూ ఆమాట అన్నప్పుడు అమ్మ పొంగిపోయేది. కిష్టయ్య కూతురని పంతులుగారికి కూడా స్కూల్లో తనంటే అభిమానమే. నాన్నలాంటి నాన్నలు ప్రతి పల్లెల్లో ఎందరో ఉండొచ్చుగానీ, ఆ తండ్రుల్ని గురించి వారి సంతానం ఎంత గర్వపడతారో నాకు తెలీదుగానీ నాన్నతో తన అనుబంధం తన ప్రేమానురాగాలు అలాంటివి. ఆ చదువులేని పేద బతుకునే చాలా నిజాయితీగా బతికాడాయన. పది మందికి చేతనైన సాయం చేస్తూనే బతికాడు. ఎదుటిమనిషిని ద్వేషించడం చీదరించుకోవడం ఆయనకి తెలీదు. తనని చిన్నచూపు చూసినవారికి దూరంగా ఉండిపోయే వాడేగానీ పన్నెత్తుమాట అని ఎరగడు వాళ్ళని. ఎప్పుడూ నవ్వుతూనే వుండేవాడు.

"కిష్టయ్యా! ఆకాశంలో సూర్యుడు ఏడాదిలో కనబడని రోజులు కొన్నయినా వుంటాయిగానీ నీ మొహంలో నవ్వుమాత్రం కనబడకుండా వుండదురా" అనేవాళ్ళు స్నేహితులు.

"మనిషన్నవాడు తనకి తెలీకుండానే ఏడుస్తూ భూమ్మీదకి వస్తాడు. కానీ, పెరిగి పెద్దయ్యాక తెలుస్తుంది. ఈ భూమి, ఈ ప్రపంచం, ఈ మనిషిజన్మ చాలా గొప్పవి. మనమీద ప్రేమతోనే దేవుడు మనకి ఈ మనిషి జన్మని ఇచ్చివుంటాడు. ఆ నాల్రోజులూ ఈసురోమంటూ ఎందుకు బతకాలి? నాకైతే నవ్వుతూనే చచ్చిపోవాలని వుంది" అనేవాడు.

నాకు తెలిసి తన జీవితంలో ఒక్కసారే నాన్న కన్నీళ్ళు పెట్టుకుంది. నిజంగా నాన్న నల్లని మొహంలో కోటేరు ముక్కుకింద నిండైన పెదవుల నవ్వు ఎంతో బావుంటుంది. చిన్నప్పుడు వింటూంటే నాకు అర్థమయ్యేది కాదుగానీ కాస్త పెద్దయ్యాక అమ్మ, ఇతర స్త్రీలు ఊసులాడుకుంటూంటే కాస్త కాస్త తెలిసేది. గొప్పింటి ఆడవాళ్ళు కొందరు నాన్నమీద మనసుపడి రాయబారాలు కూడా పంపేవారట. ఆడకూలీలు నాన్న వుండే జట్టులో వుండాలని తహతహలాడేవాళ్ళంట. నాన్న కొందరి కమతాల్లో పనిచేసినప్పుడు ఆ యజమానులకి మనశ్శాంతే వుండక ఏదో సాకున నాన్నని పంపివేసేవారట.

నిజానికి నాన్న పెళ్ళికి ముందు వెనకా కూడా శ్రీరామచంద్రుడిలాటివాడేనట. అమ్మంటే ప్రాణంగదా తనకి. ఇంతెందుకూ

తన చుట్టుపక్కల తమస్థాయి ఆడవాళ్ళు కూడా తమ భర్తలతోపాటు పన్లోకివెళ్ళే వాళ్ళు. పెద్దిళ్ళల్లో పాచిపనులు చేస్తూండే వాళ్లు. వాళ్ళంతా ఎప్పుడూ ఈసురోమంటూ వుండేవాళ్ళు. కానీ అమ్మ ఏనాడూ పనికి వెళ్ళింది కాదు. కాసంత కుంకుమబొట్టు పెట్టుకుని శుభ్రంగా ఉతికి గంజిపెట్టిన వాయిల్ చీరలు కట్టుకుని జడలో ఏదో పూలు పెట్టుకుని కళకళలాడుతూ వుండేది.

"నాన్నా! అందరమ్మల్లా అమ్మ పన్లోకి పోదేం? " అంటే.

"నా ప్రాణం పోయినా నేను మీ అమ్మని పనిలోకి పంపనమ్మా! మీ అమ్మ నా ప్రాణం అని చెప్పాను గదా? నేను పేదవాడ్నని, మీ అమ్మకి కష్టం కలగకుండా చూసుకోలేనని మీ తాతావాళ్ళకి అనుమానం ఒకప్పుడు. నలుగురు మనుషుల పని నేను చెయ్యగలిగినప్పుడు నా భార్య చేత కష్టంచెయ్యనిస్తానా? తను సున్నితంగా పెరిగింది. తనెప్పుడూ నా కళ్ళముందు దేవతలా నవ్వుతూ వుండాలి. అదే నా శరీరానికీ, మనసుకీ బోలెడు శక్తినిస్తుంది" అన్నాడు నాన్న.

వూళ్ళో అతివృష్టో, అనావృష్టో దాపురించి పని దొరకని స్థితి వచ్చినా సరే పట్నం బోయి పనిచేసి రాత్రికి తిరిగివచ్చేవాడు.

"పాము నోట్లో చెయ్యిపెట్టి అయినా రోజుకి పదిరూకలు సంపాదించందే కిష్టయ్యకి నిద్రపట్టదు. వూరంతటికీ పనిదొరక్కపోయినా నీకు దొరుకుతుంది కిష్టయ్యా" అని ఎవరైనా అంటే నాన్న నవ్వి "కష్టపడేవాడికి పనిదొరక్కపోవడం ఏమిటి మామా! ఏ పనికైనా నా శరీరం ఓర్చుకుంటుంది. మీరు చెయ్యలేరు. అదీ తేడా. నేనెంతదూరమైనా నాలుగంగల్లో వెళ్ళగలను" అనేవాడు.

వాళ్ళు కొంత ఆరాధనతో కొంత ఈర్ష్యతో "రోజూ డబ్బు కళ్ళజూడందే నీకు నిద్రపట్టదు. అదీ కథ. అయినా ఈ శక్తి ఎల్లకాలం వుంటుందా? ఇప్పుడైతే వయసులో వున్నావుగానీ" అనేవాళ్ళు.

నాన్న నవ్వి వూరుకునేవాడు. అప్పుడప్పుడూ అమ్మని తెల్లవారుఝామున లేపుతాడు నాన్న. అమ్మ పనంతా చేసుకుని స్నానంచేసి చక్కగా తయారయ్యేది. తననీ తయారుచేసేది. నాన్నా సిద్ధమయ్యేవాడు. తాము బయలుదేరుతోంటే ఇరుగూ పొరుగూ అమ్మలక్కలు ముక్కూ, మూతీ తిప్పుకునేవాళ్ళు. అమ్మ మొహంలో అప్పుడు మెరుపులు మెరిసేవి. కొంతదూరం నడిచి పోయాక బస్సు కోసం ఎదురుచూసి దాన్నెక్కి టౌన్‌లో దిగేవాళ్ళు. అమ్మకీ తనకీ సినిమా చూపించేవాడు నాన్న. తరువాత చిన్న హోటల్లో భోజనం తినేవాళ్లు. ఇంకా కొన్ని చోట్ల తిప్పి చూపించేవాడు. అమ్మకి గాజులూ తనకి ఆడుకునే బొమ్మలూ బూరలూ కొని పెట్టేవాడు. సాయంత్రానికి తిరిగి ఇల్లుచేరుకునేవారు. ఆ తరువాత వారంరోజులు అమ్మ ఎంత సంతోషంగా వుండేదో. కిలకిలా నవ్వుతూండేది. ఆ నవ్వుల్ని అపురూపంగా దాచుకొంటూన్నట్టు చూస్తుండేవాడు నాన్న.

ఇప్పుడు ఆలోచిస్తుంటే అనిపిస్తుంటుంది. ఆ చిన్నజీవితాన్ని ఆ డబ్బులేని జీవితాన్ని ఒక మంచి అనుభూతిగానే మలచుకున్నారు అమ్మా, నాన్న. అన్యోన్య దాంపత్యంతో బిగిసి బతికారు. అమ్మ తోబుట్టువుల్లో మామయ్యల్ని వదిలేస్తే పెద్దమ్మ, పిన్ని ఇద్దరూ మంచి ఉద్యోగస్థుల భార్యలైనా పెద్దమ్మ భర్త తాగుబోతు. ఆవిడ ఎప్పుడూ ఏడుస్తూనే వుండేది. పిన్ని భర్తకి ఎప్పుడూ ఆవిడమీద అనుమానం.

అమ్మమ్మ వచ్చినప్పుడు అంటూండేది. "పేదవాడు. ఏం సుఖపడతావు అనుకున్నామేగానీ నీ భర్త బంగారంలాంటోడే భూదేవీ" అని.

తమ ఒకనాటి ప్రవర్తనమూలంగా కావచ్చు అమ్మమ్మ, తాతయ్యా, నాన్న దగ్గర చాలా ఒదిగి ఒదిగి వుండేవాళ్ళు. తమ

అంతస్థుని మరిచి. 'ఒక్క చూపులో ఎవర్ని ఎక్కడ పెట్టాలో అక్కడపెట్టడం నాన్నకి తెలుసుననేది' అమ్మ. పెద్దమ్మ, పిన్ని తమ ఐశ్వర్యాన్ని అమ్మదగ్గర ప్రదర్శించాలని వచ్చిన ప్రతిసారీ అమ్మ ఆనందదాయకమైన జీవితాన్ని చూసి కుళ్ళుకుని ఈర్ష్యపడి వెనక్కి వెళ్ళేవాళ్ళు. ఇక చిన్న మామయ్య. అమ్మ పెళ్ళప్పటికి చిన్నవాడేనంట. నాన్నంటే మరీ భయం.

"ఏంరా నారాయణ" అని నాన్న పలకరిస్తేనే జడుసుకునేవాడు. గొంతు బాగా తగ్గించి అమ్మతో మాట్లాడుతూండేవాడు. తమ ఇంటికి ఎక్కువగా వస్తూండేది కూడా చిన్నమామయ్యే. అమ్మన్నా తనన్నా చాలా ఇష్టం! నాన్నంటే భక్తి, గౌరవం. అసలు బంధువులంటేనే చాలా ప్రేమంట చిన్నమామయ్యకి. పెద్దమామయ్య అదోరకం. పెద్ద పెద్ద వాళ్లతో పరిచయాలంట! కాళ్లకి చక్రాలున్నట్టు ఊళ్లు తిరగడం! ఎప్పుడో ఏ ఏడాదికో లేక రెండేళ్లకో ఓసారి హఠాత్తుగా వూడిపడుతూండేవాడు.

"కార్లలో తిరుగుతున్నాను! విమానాల్లో తిరిగాను" అంటూ గొప్ప గొప్ప కబుర్లు చెబుతుంటే తనతోపాటు అమ్మ కూడా ఇంతలేసి కళ్లు చేసుకుని వినేది!

నాన్న నవ్వుకుంటూ "ఇప్పుడు మాత్రం భూమ్మీద నిలబడ్డావుగదా శీనయ్యా!" అని అడిగితే మామయ్య వడముక్కని కోడికూరలో నంజుకుంటూ, "లోకమంతా నన్ను గొప్పవాడన్నా నువ్వుమాత్రం మమ్మల్ని గుర్తించవు బావా!" అనేవాడు.

"నువ్వు గొప్పవాడివైతే నాకూ సంతోషమే గదరా!" అనేవాడు నాన్న.

"ఈ పల్లెలో ఈ చాలీచాలని బతుకెందుకు బావా! నాతో వచ్చెయ్! ఏదైనా బిజినెస్ పెట్టిస్తా!" అన్నాడు.

"ఒరే శీనయ్యా! నా బతుక్కేం? చాలా బాగా ప్రశాంతంగా వుంది. నువ్వు దిక్కుమాలిన రాజకీయాలు మానేసి స్థిరంగా ఇంటిపట్టునవుంటే నీ భార్యాబిడ్డా సంతోషిస్తారు. ఆ అమ్మాయి ఎప్పుడూ ఈసురోమంటూ బిడ్డల్తో పుట్టింట్లోపడి వుంటే నీకది ఏం గౌరవం? లోకాన్ని ఉద్ధరించింది చాల్లేరా! నిన్ను నువ్వు ఉద్ధరించుకో!" అన్నాడు నాన్న.

మామయ్య నోరు ఠక్కున మూతపడింది.

"మా అన్న నోరు మూయించడం ఎవరివల్లా కాదనుకునేదాన్ని" అంటూ నవ్వింది అమ్మ.

"నీకు వజ్రంలాంటి పిల్ల పుట్టింది. దాన్ని బాగా చదివించు బావా!" అని మాటమారుస్తూ మామయ్య సలహా ఇచ్చేవాడు.

"నా బిడ్డకి నేనున్నాగానీ నీ బిడ్డల సంగతి చూసుకోరా శీనయ్యా!" అన్నాడు నాన్న.

ఈ పెద్దమామయ్యని చేసుకుందిమొదలు అత్తకి సుఖంలేదంట. అదంతా ఎలావున్నా ఈ పెద్దమామయ్య వస్తే నాకు మాత్రం పండగే! మామయ్య భార్యాబిడ్డల్ని గాలికి వదిలివేశాడని బాధపడి మామయ్యకి హితవు చెప్పిన నాన్న ఊహకందని విషయం... తన భార్యాబిడ్డల్ని కార్లలో, విమానాల్లో, తిప్పడానికి, అమెరికాలో వుంచి చదివించడం కోసం మామయ్య తన బిడ్డ జీవితాన్నే ఫణంగా పెడతాడన్నది.

"అసలు నీకిలాంటి ఆలోచన ఎందుకు రావాలి మామయ్యా?" అనుకుంది తులసి.

★ ★ ★

"అమ్మా కాఫీ కావాలా?"

ఆమె ఆలోచనల్లోంచి బయటికి వచ్చి చూసింది.

నరసయ్యా!

బాగా చలిగా వుంది. అంతా వెళ్లినా అతడు మాత్రం వెళ్లడు! అనుక్షణం తనని

అంటిపెట్టుకుని తనకేం కావాలో గమనిం చుకుంటూ వుంటాడు. అతనంత విశ్వాసపా త్రుడు! ఆ కళ్లల్లో తనపట్ల అభిమానమో జాలో సదా కదలాడుతుంటుంది.

ఆమె తీసుకు రమ్మన్నట్టు తలూపగానే నరసయ్య వెళ్లిపోయాడు. శాలువాని సవరిం చుకుంటుంటే అప్రయత్నంగా ఆమె దృష్టి ధగధగ కళ్లు మిరుమిట్లు గొలుపుతూ మెరు స్తున్న తన చేతి వజ్రాలగాజుల మీదప డింది. ఆమె వాటివైపు అసహ్యంగా, ఏహ్యంగా చూసింది. ఇదో తప్పనిసరి అలంకరణ.

ఎప్పుడెప్పుడు పేటూరు వెళ్లిపోదామా అనిపిస్తోందామెకి.

చిన్నప్పుడు నగలంటే ఎంతమోజు తనకి.

ఇలాంటి నగలా? కాదు!

తన తండ్రి లేదా భర్త కష్టపడిన డబ్బుతో ఓ రెండు సాదా బంగారు గాజుల్ని తెచ్చి ఇచ్చివుంటే తనెంత ఆనం దంగా, గర్వంగా వాటిని ధరించి వుండేది? ఆమెకి తన ఏడో ఏట కంసాలిచేత చెవులు కుట్టించి తన తండ్రి చెవులకు చేయించిన ఎర్రరాళ్ల బుల్లి దుద్దులు గుర్తొచ్చాయి. ఆ రోజెంత పండగలా జరిగింది? ఆ దుద్దుల్ని ఈనాటికీ జాగ్రత్తగా దాచుకోవటం అప్పుడ ప్పుడూ ధరించి అద్దంలో చూసుకోవటం ఆమెని ఆనందపెట్టే అంశాల్లో ఒకటి.

ఒక్కోసారి ఆమెకి ఒక ఆలోచన వస్తుం డేది. ఇప్పుడు నాన్న బతికేవుండి ఏ అని వార్య పరిస్థితులవల్లో తనిలా అమ్మవారి అవతారం ఎత్తివుంటే ఆ పరిస్థితి ఎలా వుండేది?

అమ్మ ఈ వైభోగాలకి అలవాటుపడి గత జీవితాన్ని, నాన్నతో పంచుకున్న అనుభూ తుల్నీ మర్చిపోయినట్టే కనిపిస్తోంది.

నాన్న అయితే అలా రాజీపడి వుండే వాడా?

ఖచ్చితంగా కాదు.

నిజాయితీ పరుడైన నాన్న తన కూతురి ఈ దిగజారుడు తనాన్నీ నైతిక పతనాన్నీ దివాళాకోరుతనాన్నీ చూసి కృంగి కృశించి చచ్చిపోయి వుండేవాడు.

ఆయన గురించి తనకి కాకపోతే ఇంకెవ రికి తెలుస్తుంది?

ఆమె మనసంతా ఆవేదనతో నిండిపో యింది. ఇద్దరు పురుషుల మధ్య ఎంత తేడా?

మామయ్య, నాన్న ఇద్దరూ ఒకే జనరేష న్‌కి చెందినవాళ్లు. దాదాపు సమవయ స్కులు. ఇద్దరూ తెలివైన వాళ్లే.

కానీ తనకి బుద్ధిబలంవున్నా చాలినంత చదువులేని కారణంగా అది అంతగా ఉప యోగపడకపోవడంతో తన శారీరక బలాన్ని నమ్ముకుని తన కుటుంబానికే కాక బయటివాళ్లకి కూడా అంతోఇంతో సహాయ సహకారాలందిస్తూ ఒక మనిషికి వుండితీరా ల్సిన మానవత్వ లక్షణాలతో బతికాడు నాన్న.

నాన్నకి లేని చదువున్న మామయ్య అదే జనాన్ని మోసగించడం వైపు మళ్లించాడు తన తెలివితేటల్ని. తన బుద్ధి సంపదని దుర్వినియోగం చేసుకున్నాడు. ఆ రెండిం టినీ మంచిమార్గంవైపు మళ్లించివుంటే అతడు చరితార్థుడై వుండేవాడు.

ఆమె మనసునంటిన దిగులు విస్తరి స్తూనే వుంది.

నర్సయ్య కాఫీ తెచ్చి నిలబడ్డాడు. ఆమె కప్పు అందుకుని మళ్లీ పరధ్యాసలోకి పోయింది. తనవి ఎంత చిన్న కోరికలు? భర్తతో సంసారం చేయాలనీ, ఇద్దరు పిల్లల్ని కనాలనీ, భర్తతో, బిడ్డల్తో సినిమాకో షికారుకో వెళ్లాలనీ, సమాజంచేత ఫలానా భార్యాభర్తలు అనిపించుకోవాలనీ...

అసలా రోజుల్లో 'కిష్టయ్య కూతురు' అని పించుకోవటం ఎంత బావుండేదని. అసలా పల్లెలో ఎవరో తప్ప తనని పేరు పెట్టి పిలి చేవాళ్లుకాదు. కిష్టయ్య కూతురు అనేవాళ్లు. అలా పిలిపించుకోవడంలో ఎంత ఆనందం

వుంది! ఒకసారి ఆ వూరు వెళ్లి తన చిన్న నాటి స్నేహితుల్ని, నాన్నతో కలసి బతికిన ఆ ఇంటిని చూడగలిగితే?

అది అసంభవం!

మామయ్య ఒప్పుకోడు.

'దేవతకి అలాంటి చిన్నకోరికలు వుండ కూడదు' అంటాడు.

ఒకసారి తను పేటూరమ్మగా మారిన తొలి దినాల్లో తమ వూర్నుంచి కొందరు తనని చూడడంకోసం బండ్లు కట్టుకొచ్చారు. వాళ్లంతా భయంగా, భక్తిగా దూరంనుంచి చూస్తుంటే డెబ్బై ఏళ్ల చెంగవ్వ మాత్రం "కిష్టయ్య కూతురా! ఎంత పుణ్యాత్మురాలివై నావే తల్లీ!" అంటూ తన బుగ్గలు పుణి కింది.

కానీ మామయ్య భగ్గున మండిపో యాడు.

తన గత జీవితం ఏ రూపంగానయినా సరే బయటికి రావడాన్ని ఎందుకనో సహిం చలేడు. దాదాపు ఆ ముసలావిణ్ణి గెంటించి నంత పనిచేశాడు. ఆ తరువాత కొన్నేళ్ల పాటు తన స్థాయి బాగా పెరిగినదాకా తన గ్రామస్థులు ఆశ్రమంలో అడుగు పెట్ట కుండా జాగ్రత్తపడ్డాడు.

కానీ ఆ జీవితాన్నే, కిష్టయ్య కూతురు అన్న ఆ గుర్తింపునే ఆమె మనసు ఎంత గాఢంగా కోరుకుంటుందో అతడికేం తెలుసు?

ఇంకా నిలబడేవున్న అతనితో "నువ్వు వాళ్లతో కలిసి వెళ్లకూడదా నర్సయ్యా!" అంది.

"నాకు వెళ్లాలనిపించడం లేదమ్మా! అందరం నీ దయతో బతికేటోళ్లం. నువ్వు చూడలేనివి నాకు మాత్రం ఎందుకమ్మా?" అన్నాడు.

ఆమె నర్సయ్యని అభిమానంతో చూసింది. ఎంత విశ్వాసంగల జీవి? అత నిది తప్పు అభిప్రాయం అని తను చెప్పినా వెళ్లడు.

"నర్సయ్యా! ఓ సంగతి అడగనా నిన్ను" అంది.

"అడగండమ్మా!"

"ఈమధ్య ఓ కొత్త వ్యక్తి పేటూరు వచ్చాడు. నా గురించి తెలుసుకోవాలని చాలా ఆసక్తి చూపిస్తున్నాడు. అతడెవరో తెలుసా నీకు?" అడిగింది.

నర్సయ్య తలూపుతూ "అతణ్ణి గురించి జాగ్రత్తగా వుండమని మామయ్యగారి ఆర్డర్. అతను టీచర్. బ్రహ్మచారి! నా మేనకోడలు నాగమణిని కూడా మీ గురించి అడిగాడంట! నేను అతణ్ణి కలిసి ఇలాంటి సంగతులు పట్టించుకోవడం మంచిదికాదని చెప్పాలనుకుంటున్నాను" అన్నాడు.

"కానీ నర్సయ్యా నేనతనితో నాలుగైదు సార్లు రహస్యంగా మాట్లాడాను. నువ్వోసారి అతణ్ణి నా తరఫున కలుసుకోవాలి!" అందామె.

నిర్ఘాంతపోయినట్టు చూశాడు నర్సయ్య. దాన్నుండి కోలుకోవడానికి అతడికి నిముషం పట్టింది. అతడామెతో "మీకోసం నా ప్రాణాలు ఇవ్వడానికైనా నేను సిద్ధం. ఎంత సాహసమైనా చేస్తాను!" అన్నాడు.

ఆమె అతడివైపు ఎంతో కృతజ్ఞతగా చూసింది.



తులసి తన యూరప్ పర్యటన ముగిం

చుకుని వచ్చిన మర్నాడే నర్సయ్య తనని వెతుక్కుంటూ వచ్చినప్పుడు ఫణి ఆశ్చర్యపడ్డాడు. విషయం తెలిసి ఆనందపడ్డాడు.

నర్సయ్య క్లుప్తంగా మాట్లాడాడు. "అమ్మ ఈ ఉత్తరం మీకు ఇచ్చి దీనికి జవాబు రాయించుకు రమ్మంది"

అప్పుడు సమయం రాత్రి పన్నెండు గంటలు!

"నువ్విలా రావడం ఎవరికీ అనుమానం రాదా!" అడిగాడు ఫణి.

"అప్పుడప్పుడూ వూళ్లోకి రావడం నా అలవాటు. నా బంధువులున్నారు ఇక్కడ. నా తమ్ముడి కొడుకు ఇంటికని వచ్చి అక్కడ పడుకుని ఇప్పుడు లేచి వస్తున్నాను" చెప్పాడు నర్సయ్య. అతడు నల్లని దుప్పటి కప్పుకున్నాడు.







"నువ్వు కూర్చో నర్సయ్యా!" అని చెప్పి అతడా ఉత్తరాన్ని చదవసాగాడు.

ముత్యాలసరంలాంటి చేతిరాత ఆమెది...

ఫణి గారికి,

"నమస్తే...

"అసలు మీరెవరు?

"నా పట్ల మీకెందుకు ఇంత ఆసక్తి?

"ఎందుకు మీ ఆసక్తిమూలంగా మా మామయ్య దృష్టిలోకి కూడా వచ్చారు?

"నన్ను కలిసి నాతో మాట్లాడి ఏం చెయ్యాలని మీ ఉద్దేశ్యం?

"ఆశ్రమంలో బందీగా వున్నారా? అని నన్ను అడిగారు.

"నేను అవును అంటే మీరేం చేయాలని?

"కాదు అంటే ఏం చేయాలని?

"అసలెందుకీ సాహసం చేస్తున్నారు? నన్ను తులసిగా ఎందుకు గుర్తిస్తున్నారు?

"నా ఈ సందేహాలన్నింటికీ సమాధానం ఇస్తే నేను మీతో ఏదైనా చెప్పగలనేమో ఆలోచిస్తాను!

తులసి!"

అతడు వెంటనే కాగితం, కలం తీసుకుని రాయసాగాడు.

"తులసిగారూ,

"ఎక్కడైనా ఎవరైనా అన్యాయానికి గుర వుతున్నారు అంటే వాళ్లను ఆదుకోవడం, వారి హక్కులకోసం పోరాటం జరపడం, జరిపించడం మా నాన్న మాకు ఉగ్గుపా లతో నేర్పాడు.

"అలాంటిది నేను ఈ వూరు వస్తున్న ప్పుడు మా కుటుంబ సభ్యులతో సహా అందరూ వద్దన్నవారే!

"ఎందుకంటే నాది ప్రతి విషయాన్నీ పరి శీలనాత్మక దృష్టితో చూసే మనస్తత్వం, ప్రతిదాన్నీ ప్రశ్నించే స్వభావం కాబట్టి!

"అందరు బాబాలూ, స్వాములు, అమ్మ వార్లలాగే మీరూ మోసగించేవ్యక్తి అనుకు న్నాను నేను మొదట. కానీ ఇక్కడికి వచ్చాక మిమ్మల్ని చూస్తున్నకొద్దీ నాకు మరోలా అనిపించసాగింది.

"మీరీ జీవితాన్ని బలవంతంగా కొనసాగి స్తున్నారేమో! బహుశా అది మీ మామయ్య బలవంతం వలన కావచ్చు ఇతర కుటుంబ సభ్యుల బలవంతం వలన కావచ్చు

"మీ కళ్లల్లో నాకు అదోలాంటి అశాంతి, అలజడి కనిపించేది. నిజంగా ఆనందకర మైన జీవితాన్ని, సంతృప్తినీ మీరు అనుభ విస్తూ ఉండివుంటే మీ నవ్వులో ఇలా సహ జత్వం లోపించి వుండేదా?

"మిమ్మల్ని నేను పేరుతో పిలిస్తే సహిం చగలిగేవారా?

"కంచెదగ్గిర నాతో మాట్లాడి వుండే వారా?

"ఇప్పటికే నా కథ ముగిసి వుండేది కాదా?

"నేను ఎంత సాహసం చేస్తున్నానో నాకు తెలుసు.

"ఎందుకంటారా? అది నా నైజం.

"సాటి మనిషి సమస్యల్ని పరిష్కరించు కోవడంలో చేతనైనంత తోడ్పాటు అందిం చటం అన్నది నాకు పుట్టుకతో అబ్బిన గుణం. అందుకే మీ పట్ల నాకు ఈ ఆసక్తి.

"మిమ్మల్ని ఓ దేవతగా నేను నమ్మలేదు. ఓ స్త్రీగా కూడా ప్రత్యేకంగా ఇంతదాకా గుర్తించలేదుకూడా. కేవలం నా సాటిమని షిగా మాత్రమే గుర్తించాను.

"అందుకే మిమ్మల్ని 'తులసి' అన్న మీ సొంత పేరుతో పిలవడం. మీరేమిటో మీ ద్వారానే తెలుసుకోవాలని తపన చెందడం.

"మీరు బలవంతపు దేవతా జీవితం గడు పుతున్నారని ఇక్కడ నేను విన్న ఒకటి రెండు మాటలద్వారా తెలిసింది. బయటి ప్రపంచంలో మిమ్మల్ని నమ్మే, నమ్మని రెండు వర్గాలద్వారా నేను విన్నది రెండే విషయాలు.

"ఒకటి.. దైవాంశసంభూతురాలు!

"రెండు... మోసగత్తె... ఇంతే!

"ఈ రెండూ కూఢా నిజంకావుగదా? అందుకే నిజం ఏమిటో తెలుసుకోవాలన్న తపన.

"ఇక మీరు ఇక్కడ ఒక ఖైదీలానే బతు కుతున్నానూ అని చెబితే అప్పుడేం చేయాలో ఆలోచిస్తాను. అదే నిజం అయితే మిమ్మల్ని మామూలు స్వేచ్ఛాయుత జీవి తంలోకి తెప్పించడానికి ఏ ప్రయత్నాలు చెయ్యాలో ఆలోచించగలిగిన దమ్ము నాకుంది. మీరు 'నేను బలవంతంతోగాక నాఇష్టప్రకారమే ఈ జీవితాన్ని గడుపుతు

# ఏరిన ముత్యాలు

★ సభ్యత అంటే మానవ ప్రవర్తన యొక్క వ్యవస్థీకరణ

-లాస్కీ

★ పేదలకు సేవ చెయ్యాలంటే పేదరికంలో నివసించాలి. పేదరికాన్ని చవిచూడాలి.

-మదర్‌థెరిస్సా

★ ఏకాగ్రతతో భగవంతుని సేవించడానికి పరిశుద్ధమైన మనస్సు ఎంతో అవసరం.

-మదర్‌థెరిస్సా

★ కప్పిచెప్పేది కవిత్వం, విప్పి చెప్పేది విమర్శ.

-డా॥ సి. నారాయణరెడ్డి

★ మనం ఎవరిని హీనులుగా, నీచులుగా చేస్తామో, వాళ్ళే క్రమంగా మనల్ని హేయంగా చేసేస్తారు.

-రవీంద్రనాథ్ ఠాగూర్

★ రాగద్వేషాలకు స్వస్తి చెప్పి కోరికలను అణిచివేసే దైవచింతనానికి బానిసలం కావాలి.

-మదర్‌థెరిస్సా

★ ప్రార్థన విలువ సాటిలేనిది. వైద్యపరంగా కూడా ప్రార్థనకు ప్రాముఖ్యత ఉంది.

-అలెక్సిస్ కారెల్

★ సంతోషం అనేది నీడను సృష్టించని అతిసన్నని సూర్యకిరణంలాంటిది. కాని దుఃఖం వరదల్ని సృష్టించే జడివాన.

-చైనా సామెత

★ హృదయ సౌందర్యం లేని శరీర సౌందర్యం వ్యర్థం!

-వివేకానంద

★ దేవుడే సత్యం సత్యంకన్నా భిన్నమైన దేవుని రూపం ఏదీలేదు.

-గాంధీజీ

★ మట్టిలో మాణిక్యంలాగా మానవునిలోని జ్ఞానం, విజ్ఞానం, విషయ పరిజ్ఞానం నిలిచివున్నాయి.

-వివేకానంద

★ భగవంతుడు సర్వాంతర్యామి, అతనికి క్రమబద్ధమైన ఆకారం లేదు.

-రాజారామమోహన్‌రాయ్

★ వర్ణవ్యవస్థ జీవితప్రగతికి అడ్డుగోడ.

-వివేకానంద

సేకరణ : చింతా కృష్ణమోహన్

న్నాను' అని అన్నాసరే అది నేను నమ్మలేని సంగతి. అసలు మీరేమిటో మీ మనసేమిటో మీ జీవితం ఏమిటో తెలుసుకోవాలని నాకు చాలా తపనగా వుంది. తెలుసుకున్నాకగానీ నేనేం చెయ్యాలన్న దానిమీద ఒక నిర్ణయానికి రాలేను.

-ఫణి"

ఆ ఉత్తరం తీసుకుని నరసయ్య వెళ్లిపోయాడు.

దానికి జవాబు ఈసారి నరసయ్య ద్వారా కాక పోస్ట్‌లో లెటర్ రూపంలో వచ్చింది.

అదీ ఆ లెటర్ పక్కవూరినుంచి పోస్ట్ చేయబడింది

"' ఫణీంద్రా...

"మీ ఉత్తరం నన్ను కదిలించింది.

"ప్రపంచం అంతా ఓ దేవతలా భావించే వ్యక్తిలో మీరు మామూలు మనిషిని చూడడం, ఆ మనిషిలోని అసంతృప్తిని పసిగట్టి ఆమె ఏమిటో తెలుసుకోవాలని ప్రయత్నించడం... నిజంగా ఇది గొప్ప విషయం.

"మానవ విలువలకి పట్టంగట్టే మీలాంటి వారిపట్ల నాకెప్పుడూ గౌరవమే.

"నన్ను నన్నుగా అంటే మామూలు తులసిగా ఓ సాధారణమైన స్త్రీగా గుర్తించే మనిషికోసం పదిహేను సంవత్సరాలుగా నా మనసు తపిస్తూనే వుంది. కానీ మామయ్య ఎవర్నీ నా చుట్టుపక్కలకి రానీడు. నా గురించిన నా వ్యక్తిగత జీవితాన్ని గురించిన ఆలోచన ఎవరి మనసుల్లోకి వచ్చినా ఆయన సహించడు.

"ఆయన అతి తెలివిపరుడు. అత్యాశాపరుడు. అవసరం అయితే రాక్షసుడిలానూ మారగలడు.

"ఆయనకి డబ్బు సంపాదనకోసం భగవంతుడిచ్చిన పెట్టుబడిని నేను.

"ఒక్క ఆయనేకాదు.. ఆయన భార్యాపిల్లలూ, నన్ను కన్నతల్లీ, నా చెల్లెలూ, ఆమె భర్తా, నా తమ్ముడు, పిన్ని, పెద్దమ్మ, ఇతర బంధువర్గం... వీళ్లెవరూ నన్ను అమ్మవారుగా తప్ప మరోలా చూడడానికి ఇష్టపడరు.

"భగవంతుడు నాకు ప్రసాదించిన ఉత్తమమైన ఈ మానవజన్మ నా ప్రమేయం లేకుండానే దుర్వినియోగం చేయబడుతోంది. నా జీవితం నాకు తప్ప అందరికీ ఉపయోగపడుతోంది. భోగభాగ్యాల్నీ రంగులమయమైన జీవితాన్ని సంపాదించి పెడుతోంది.

"నాకుమాత్రం అసంతృప్తిని తప్ప ఈ జీవితం ఏమీ మిగల్చలేదు.

"అదే విషాదం...

"అవును! నేనొకబందీని. ఇదొక సాలెగూడు.

"ఇందులోంచి నన్ను మానవత్వంతో బయటికి తీసే సాహసం ఎవరు చేస్తారు?

"మీరు చెయ్యగలరా?

"మహా ప్రవాహంలో కొట్టుకుపోతున్నవాడికి గడ్డిపరక ఆధారంగా దొరికితే ఎలా అయితే దాని ఆధారంగా బయటకి రావాలని ఆశపడతాడో అలా...నా ఇష్టప్రకారం గాలిపీల్చే స్వేచ్ఛ కూడా లేని జీవితాన్ని గడుపుతూన్న నాలో తులసీ అన్న స్నేహపూర్వకమైన పలకరింపూ, నా గురించి తెలుసుకోవాలన్న మీ ఆరాటం, నాలో ఎంతో కదలికనూ, కలవరాన్నీ, ఆశనూ రేపాయి.

"కానీ మీద్వారా బయటికి రావాలనుకోవడం ఎంతో అత్యాశ? దురాశకూడా.

"తన గొంతులో ప్రాణంవుండగా నాయీ అవతార పరిసమాప్తికి మామయ్య అంగీకరించడు.

"ఆయనకి తెలీకుండా నేను బయటికి రావడం ఎలా?

"ఏదో అద్భుతం జరిగివచ్చినా బతకడం ఎలా?

"మామయ్య కబంధ హస్తాలనుండి నన్ను రక్షించే దేవుడెవరు? "

ఆ ఉత్తరం నిండా ఆవేదన. అతడి మన

సంతా తులసిపట్ల జాలితో ఏదో అభిమానంతో నిండిపోయింది.

ఉత్తరం చదవసాగాడు.

"మామయ్య స్వభావాన్నీ నామీద బిగించిన ఇనుప పిడికిలిని సడలించకపోవడాన్ని గురించి మీకు బాగా అర్థమయేందుకు రెండు సంఘటనల్ని ఇక్కడ చెప్పాలని వుంది.

"ఏ ప్రత్యేకతలూ లేని నా మనసు ఎప్పుడూ నవ్వుతూ తుళ్లుతూ నా వాళ్లతో కలసిపోయి సాదాసీదాగా వుండాలని కోరుకుంటుంది. పేటూరమ్మగా నాకు పాపులారిటీ వచ్చేకొద్దీ నా తల్లి తోడబుట్టిన వారు కూడా నాకు మానసికంగా దూరమయిపోయారు.

"నాదొకలోకం!

"వారిదొకలోకం.

"నాది ఒంటరి తనపు నిస్తేజపులోకం!

"వారిది ఆనందమయ ఉత్సాహభరితమైన అనుభవంతో కూడిన జీవితం.

"తొలిరోజుల్లో వాళ్లతో కలిసి తిరగాలనీ, ఆడాలనీ, పాడాలనీ వుండేది నాకు. కానీ దానిమూలంగా దేవతగా నా ప్రత్యేకత నిలవదనేది మామయ్య భయం. ఈ సంగతులు బయటికి తెలిసి జనాల్లో భక్తిభావం నశిస్తుందని భయం.

"నా చిన్నతనంలో నేను మా అమ్మానాన్నలతో టౌన్‌కి వెళ్లి సినిమా చూసి వచ్చేదాన్ని. చాలామంది ఆడపిల్లల్లాగే నాకు సినిమాలంటే మోజు. బయట తిరగాలంటే మోజు. టీవీలంటే మోజు. రొమాంటిక్ నవలలంటే మోజు.

"అయితే నేను తిరక్కూడదు. సినిమాలు చూడొచ్చు. పుస్తకాలు చదవనూవచ్చు. ఎలా? స్వేచ్ఛగా కాదు. నలుగురితో కలసి కాదు. నా గదిలో ఓ పెద్ద టీవీ పెట్టాడు మామయ్య.

"నేను అందరితో కలిసి కూర్చుని చూస్తాను మామయ్యా" అని అమాయకంగా అడిగితే "అలా చెయ్యకూడదు తులసీ" అన్నాడు.

"నువ్వు అమ్మవారివి! తుచ్ఛమైన సినిమాలు చూసి ఆనందిస్తావు! కేరింతలు కొడతావు అన్న సంగతి బయటికి పొక్కితే అది ఇంకా నువ్వు ఎదగాల్సిన స్థానానికి చేరుకోడానికి ఒక ఆటంకం అవుతుంది. నీగురించి అందరికీ ఉన్నతమైన భక్తిపూర్వకమైన భావనలే వుండాలి. ఇది నువ్వు గుర్తుంచుకో. నువ్వు నీకు ఇష్టమైన పుస్తకాలు చదువుకో. టి.విలో నీకు ఇష్టమైన సినిమాలుచూడు. 'అది మంచి ఇది చెడు' అనుకోకు. నీకు ఎలాంటి క్యాసెట్లు కావాలన్నా నేను తెప్పించి ఇస్తాను అంటాడు మామయ్య.

"నీ గదిలోంచి బయటికి రాకుండా మూడో కంటికి తెలీకుండా అన్నీ చూడు, ఆనందించు, సంతృప్తిపడు, అంతేగానీ నలుగురితో కలిసి చూడాలనీ, వాళ్ళతో వాటిగురించి చర్చించాలనీ అనుకోకు" అన్న ఆ మాటల్లో ఈసారి హెచ్చరిక కూడా ధ్వనింపజేశాడు.

"నాకు దుఃఖం వచ్చింది. అసహ్యం అనిపించింది. అంతే ఇక ఏనాడూ ఆ చిన్న అనుభవాల్ని ఎవరితోనూ కలిసి పంచుకోలేదు.

"ఇంకో సంఘటన...

"నాసేవకోసం నియమించబడిన నరసయ్యని మొదట్లో నేను అమాయకంగా 'తాతయ్యా' అని పిలిచేదాన్ని!

"ఈ పిలుపు మామయ్య చెవిన బడ్డనాడు ప్రళయకాలరుద్రుడు అయ్యాడు.

నన్నేమీ అనలేదు గానీ నా కళ్లముందే నర్సయ్య చెంప పగలగొట్టేడు.

"అమ్మవారిచేత తాతయ్యా అని పిలిపించుకునేంత గొప్పవాడివిరా నువ్వు" అంటూ కళ్ళతో నిప్పులు కురిపించాడు.

నర్సయ్య వణికిపోయాడు.

"ఈ వార్నింగ్ నర్సయ్యకేకాదు! నాకు కూడా"

"మళ్ళీ ఎప్పుడూ పరాయివాళ్లని ఏ వరస తోనూ పిలిచి ఎరుగను. నా వాళ్లని కూడా ఆప్యాయంగా అభిమానంగా బంధుత్వపు వరసల్తో పిలవడానికి కూడా నోచుకోని బ్రతుకయింది. మా అమ్మ నా తమ్ముడూ చెల్లెళ్ళతో ఓసారి నా గురించి మాట్లాడుతూ "పేటూరమ్మ..." అనడం విన్న నాడు నా మనసెంత దిమ్మెరపోయి వుందో ఎంత హృదయ విదారకంగా శోకించి వుంటుందో వూహించగలరా? నన్ను నన్నుగా మా వాళ్ళల్లో ఈనాటికీ గుర్తిస్తున్నది ఇద్దరు వ్యక్తులు! పెద్దమామయ్యా! చిన్నమామయ్యా!

పెద్దమామయ్యా "ప్రపంచానికంతా నువ్వు దేవతవైనా నా చేతిలో కీలుబొమ్మవే" అని నాకు గుర్తు చేస్తున్నట్టనిపిస్తుంది ఆయన నోటిపిలుపు

చిన్నమామయ్యా మాత్రం నా రెండు మూడేళ్ళ వయసునుంచి ఎలా అయితే పిలుస్తున్నాడో అలాగే అభిమానంగా ఆప్యాయంగా 'తులసీ' అనీ 'తులశమ్మా' 'పెద్ద మేనకోడలా' అనీ పిలుస్తాడు. ఈనాటికీ నన్ను చిన్న పిల్లలా చూస్తాడు. నాకాపాదించబడిన దైవత్వపుఛాయలు ఆయన్నేమీ నాకు మానసికంగా దూరం చెయ్యలేదు! ఆయన చదువుకోలేదు. అందుకో లేక స్వతహాగా ఆయన సచ్చీలుడో గానీ తన మేనకోడల్ని దేవతగా ఆయన మనసు అంగీకరించలేదు. ఈనాటికీ ఆయన వస్తూ చిన్నప్పటిలా నాకు ఇష్టమైన జంతికలూ లౌజు ఉండలూ వేరుసెనగ ఉండలూ తెస్తూనే వున్నాడు. తనకష్టం సుఖం మామూలు రీతిలో నాకు చెప్పుకుంటూనే వున్నాడు. నా యోగక్షేమాల్ని సానుభూతితో విచారిస్తూనే వున్నాడు. అందరికీ పేటూరమ్మనైనా నేను ఆయనకి మాత్రం ముద్దుల మేనకోడల్నే. ఇది నాకెంత ఆనందం కలిగించే అంశమో తెలుసా? మామయ్యా వచ్చినరోజు నాకు పండగే!



కానీ ఆయన ఎప్పుడో గానీ రాడు. ఆయన శ్రమజీవి. అయినా ఆయన రానిది తీరిక లేకకాదు! ఆయన రాక పెద్ద మామయ్యకి ఇష్టం వుండదు. అందరిలా తన తమ్ముడిచేత నన్ను 'దేవత'గా ఒప్పించడంలో ఫెయిలయ్యాడు. కనీసం చిన్నమామయ్యని ప్రలోభపెట్టడం ఆయన మనసులోకి స్వార్థాన్ని ఎక్కించడం కూడా చెయ్యలేకపోయాడు. ఆ ఓటమి ఆయన్ని బాధపెడుతూనే వుంది.

దీని మూలంగా మిగతా బంధువర్గంలా ఆయనకి కార్లూ మేడలూ ఆస్థులూ అంతస్థులూ లేవు. ఈనాటికీ పొలం దున్నుకునే బతుకున్నాడు. ఆయన భార్య భర్తకి తోడుగా పొలం వెళుతూనే వుంది. ఆయన పిల్లలు అతిసాధారణ జీవితంలోనే వున్నారు.

అమ్మా ఇతర బంధువులూ పెద్దమామయ్యకి నచ్చ చెప్పడానికి ఎంతో ప్రయత్నించి విజయం సాధించలేకపోయారు.

అయితే దీన్ని గురించి చిన్నమామయ్యకి విచారమేం లేదు.

"మనవాళ్ళందరిలా అన్నయ్య కుటిల బుద్ధితో పోగేస్తూన్న పాపపు సొత్తుమీద నేను ఆధారపడి బతకడం లేదనుకుంటే నాకెంత ఆనందంగా వుంటుందో తెలుసా తులసీ" అంటూంటాడు.

అయితే మేనకోడలి దగ్గరికి వచ్చి చూసి వెళ్ళే ఆయన హక్కుని పూర్తిగా కాలరాయడం పెద్దమామయ్యకి వీలుకాలేదు.

"వాడాపని చేస్తే నేను చాలా మొండి వాడ్ని. వీధికెక్కి కూర్చుంటాను. ఆ సంగతి వాడికీ తెలుసు" అంటాడు చిన్నమామయ్యా.

ఇప్పుడు బోధపడిందా మీకు, పెద్దమామయ్యా స్వభావం ఎలాంటిదో? నాలో పెద్ద మామయ్యపట్ల భయంకర వ్యతిరేకత, అసహనం, ద్వేషం ఇవన్నీ ఒకదానికొకటి తీసిపోని స్థాయిలో వున్నాయి. ఆయన సృష్టించి బంధించిన ఈ బంగారు పంజ

రంలోంచి బయటపడటం ఎలా అని పది హేనేళ్ళుగా గింజుకుంటూనే వున్నాను. ఇప్పుడు మీరాక, పరిచయం నాలో ఏదో ఆశని కలిగిస్తున్నాయి.

అదంత సులభం కాదనీ అసలు జరిగే పని కాదేమోనని నా మనసు నన్ను హెచ్చ రిస్తూనే వుంది!

కానీ, ఏదో ఆశ... చివరి ఆశ!

అదే నా చేత మీ పరిచయం పెంచుకు నేలా చేయిస్తోంది!

ఇప్పుడు చెప్పండి... నేను ఈ సాలెగూ ట్లోంచి బయటికి ఎలా రాగలను?

స్వేచ్ఛాయుతజీవితాన్ని ఎలా అనుభవిం చగలను?

నా ఈ ప్రశ్నలకి జవాబిచ్చేముందు మీరు నా జీవిత చరిత్రను మొత్తం తెలుసుకో వాలి. దానికోసం వీలయినంత తొందరగా నర్శయ్యచేత మీకు నా పదహారో ఏటనుంచీ వ్రాయడం మొదలుపెట్టిన డైరీలు పంపు తాను! వాటిని చదవండి! నాజీవితంలో మీరు తెలుసుకోవాల్సిన కోణాలూ నన్ను బిగించిన సంకెళ్ళూ ఏమిటో ఎలాగో మీకు పూర్తిగా అర్థమవుతుంది.

అప్పుడు... నా పై ప్రశ్నలకి జవాబి వ్వండి! అందాకా ఆశతో జీవిస్తూంటాను!

...తులసి"

ఫణిని ఆ ఉత్తరం చాలా ఆలోచింపచే సింది. ప్రతి అక్షరం ఆమె అనుభవిస్తోన్న క్షోభని తెలియజేస్తోంది. అతడామె జీవితచ రిత్రను తెలుసుకోవడంకోసం ఆతృతగా ఎదురుచూడసాగాడు. దానికి మించి అతడి మనసు తులసిని బయటికి తీసుకొచ్చే మార్గాలగురించి ఇప్పటినుంచే తీవ్రంగా అన్వేషణ ప్రారంభించింది. అది చాలా చాలా ప్రమాదకరమైన విషయం అన్న సంగతి అతనికి తెలుసు. అతడాలోచిస్తోంది ఒకటే! తన సాటి మనిషి ఆమె! ఒక భయంకరమైన ఎరకి, ఒక వ్యక్తి దురాశకి గురయి బలవుతున్న స్త్రీ ఆమె.

ఆడవాళ్ళు పురుషుడి చేత అనేక విధా లుగా మోసగించబడుతూంటారు. అందరి కథా ఓ ఎత్తు! ఆమె జీవితం ఓ ఎత్తు!

భర్తచేత వరకట్న వేధింపుకి గురయి చిత్రహింసలు అనుభవించే స్త్రీని విడాకుల రూపంలో చట్టబద్ధంగా అతనినుంచి విడి పించవచ్చు!

ఏ వ్యభిచార గృహంలోనో చిక్కుకుపోయి లైంగిక వేధింపులకి గురవుతూన్న స్త్రీని అదే చట్టం సహాయంతో కొంత రిస్క్ తీసుకుని విడిపించవచ్చు!

కానీ, తులసిని విడిపించడం అంత సుల భంకాదు!

ఆమె జనం ఆరాధించే దేవతస్థానంలో వుంది. ఈ ప్రపంచంలో అన్ని మత్తుల కంటే గొప్ప మత్తు మతం! పవిత్ర హిందూ దేశంలో దేవుడు, మతంపట్ల వున్న నమ్మకం చాలా గాఢమైనదే కాదు భయం కరమైనది కూడా!

తమ నమ్మకాలకి విఘాతం కలిగితే జనం సహించరు!

దీని ఆధారంగానే ఎన్నో రాజకీయ పార్టీలు కొత్త ఊపిరి పోసుకుని బలోపేతం అవుతున్నాయి. అధికారాలు సంపాదించు కుంటున్నాయి. అలాంటి 'దేవుడున్నాడా?' అని ప్రశ్నించడమే తప్పుగా భావించే దేశంలో మెజారిటీ భక్తులు ఆరాధించే తులసిని ఓ మామూలు మనిషిగా బయ టికి తీసుకురావడం చాలా అపాయకరమైన అంశం!

పైగా ఆమె ఇష్టప్రకారం తను సహకరి స్తూన్నాడని ఎవరూ అనుకోరు! ఆ ప్రయత్నం గురించి బయటపడినా విఫలం అయినా శ్రీనివాసరావు ఆమెచేతనే మరోలా చెప్పించగలడు! తనని నిలువునా నరికేసి అది దేవుడి శిక్షగానూ నమ్మించగలడు! ఆశ్ర మాల్లో ఎన్నో మారణహోమాలు జరిగినా, అవి జనానికి తెలిసినా కప్పెట్టబడలేదూ? అందులోనూ ఈ శ్రీనివాసరావు అత్యంత

ప్రమాదకారిగా వున్నాడు! అత్యున్నత స్థాయి నాయకుల, ప్రభుత్వాధినేతల అండదండలు అతడికి వున్నాయి! అతడి మనుషులు రాష్ట్ర మంతటా ఖచ్చితంగా వివిధ వర్గాల్లో స్థాయిల్లో వుండి వుంటారు.

ఆ సందర్భం వస్తే ఎవరి సహాయం అర్థించాలా అని అతడు పరిపరి విధాలా ఆలోచించాడు. మహిళా విమోచనా సంఘాలూ పౌరహక్కులసంఘాలూ... ఇవేవీ లాభంలేదు! వాళ్ళు పోరాటాల్ని నడ పగలరు! ఆమెనెలా బయటికి తీసుకురాగ లరు? అప్పుడామె డైరీల్లో సాక్ష్యాలుగా ఎవరూ అంగీకరించరు!

ఇలా ఎంత ఆలోచించినా అతనికి కర్తవ్యం బోధపడలేదు. అయితే ఒకటి మాత్రం అనిపించసాగింది. ఆమెని ఇటు బయటికి తీసుకురావడం అటు ఆమె గురించి అందరికీ తెలీటం ఒక్కసారిగా జరి గిపోవాలి. అప్పుడే కాస్త ప్రయోజనం వుండొచ్చు!

అయితే అది ఎలా అన్నదే అర్థం కావడం లేదు!

అతడి తల దిమ్మెక్కిపోయి తన ఆలోచ నల్ని ఆమె జీవితకథ చదివేదాకా వాయిదా వేసుకుని ప్రశాంతంగా వుండడానికి ప్రయ త్నించాడు. అంతలోనే అతడికి అనిపిం చింది.

ఎక్కడి తను? ఎక్కడి ఆమె?

ఎంతో విచిత్రంగా ఆమె పరిస్థితిపట్ల ఆసక్తి ఏర్పడటం ఇంకా విచిత్రంగా పరి చయం కావడం, దాన్ని పెంచుకోవడం, ఈనాడామెను ఆ ధన విషవలయంలో నుంచి బయటికి తెచ్చేందుకు తాపత్రయప డడం... అదీ ఆమెను గురించి పూర్తిగా తెలుసుకోకుండానే!

ఇదంతా ఎంత విచిత్రంగావుంది?

ఒక్కోసారి ఆలోచిస్తుంటే వాస్తవికతకి దూరంగా ఓ కథలా వుందేమోనన్న ఫీలింగ్ అతడికి కలుగుతోంది!

వారం తరువాత గానీ అతడికి ఆమె డైరీలు అందలేదు.

అవి అందిన అర్ధరాత్రి ఆత్రంగా చద వడం ప్రారంభించాడతడు.

ఆమె కథను చదివేకొద్దీ అతడిలో ఆమె పట్ల జాలి దయ అభిమానం కలగాపుల గంగా కలసిన భావంతో పాటు• ఒకవి షాదం కూడా ఆవరించింది.



ఒక స్త్రీ జీవితానికి కథానాయకుడనేవాడు ఆమె భర్త లేదా ప్రియుడు అయివుండొచ్చు. కానీ, తులసి జీవితకథలో అన్ని కోణా ల్నుంచి కథా నాయకుడిగా ఆమె తండ్రి కన బడతాడు. ఒక దృష్టితో చూస్తే ఆమె తండ్రి అతి సామాన్యుడు. ఆ సామాన్యుడే అనేకచోట్ల ధీరోదాత్తుడుగా కనిపిస్తాడు. మానవత్వపు పరిమళంతో గుబాళిస్తాడు. పరోపకార పరాయణత్వంతో గౌరవభావం కలిగిస్తాడు. భర్తగా తండ్రిగా ఒక మనిషిగా అతడొక ప్రత్యేకతను సంతరించుకొన్నట్లు కనిపిస్తాడు.

మళ్ళీ అతగాడెవరు? ఒక పేద యువ కుడు! కూలీవాడు!

అయినా అతడు అమృత సమానమైన

మనసు కలిగినటువంటి ఉదాత్తమైన సుగుణాలు కలిగినవాడు!

అతడి స్టోరీ చదువుతోంటే తులసి జీవిత చరిత్రలో అతడే కథానాయకుడు అనిపించడమేకాదు, అతడి గురించి తెలుసుకోవాలన్న ఆసక్తి కలిగింది ఫణికి!

★ ★ ★

"చిన్నమామయ్యా"

ఒకలాంటి సంబరంతో అంది తులసి!

"ఏరా అమ్మలూ బావున్నావా? నేను పదిరోజులక్రితమే రావాల్సింది. నువ్వు యూరప్ పర్యటనకి పోతున్నావని పేపర్లలో చదివి రావటం మానుకున్నాను" అన్నాడు.

"నిన్ను తీసుకువెళ్ళాలని నాకెంతగానో వుంది మామయ్యా! కానీ, నువ్వు రావుగా" అందామె నిరాశనిండిన కంఠంతో.

"నాకంత పెద్ద కోరికలేం లేవుకానీ ఇప్పుడు చెప్పు ఎలా వున్నావో?" అడిగాడతడు.

ఈ ప్రశ్నకి తులసి విరక్తిగా నవ్వింది!

ఆ నవ్వు ఆ మేనమామ గుండెల్లో ముల్లులా దిగుతుంది. కానీ, ఆమె బాధని చేత్తో ఇలా తీసివేయలేని నిస్సహాయుడతడు. ఓ మామూలు సన్నకారు రైతు!

తులసి మేనమామనే చూస్తోంది.

వయసు పైబడింది తప్ప అతడిలో అప్పటికీ ఇప్పటికీ మార్పేమీలేదు! ఇలా బయటికొచ్చినప్పుడు గ్లాస్కో పంచె పోలియెస్టర్ చొక్కా వేసుకుంటాడు. కనీసం చేతికి వాచీ కూడా వుండదు! ఆ చేతి సంచీవాడే విధానం ఇప్పటికీ మారలేదు.

మేనకోడలి చూపు తనసంచీ మీద పడడం గమనించి నవ్వుతూ "ఇదిగోమ్మా మీ అత్త నీకోసం ఏదో పంపింది" అని ఫలహారాల్తో పాటు పాకెట్ చేతికిచ్చాడు.

"ఏమిటి మామయ్యా ఇది?"

"ఏముందిరా? మామూలే! చీర! ప్రతియేడాదీ పంటల తరువాత ఆడపడుచులకి పసుపు కుంకుమతో చీర ఇవ్వడం మన ఇళ్ళల్లో సాంప్రదాయం! ఇప్పుడు నాతోడబుట్టిన ఆడపడుచులు ఈ పేద తమ్ముడి నుంచి సారె స్వీకరించి ఆనందించే స్థితిలో లేరు! నా తృప్తికోసం నీకిచ్చినా నువ్వు ఆనందంగా కట్టుకుంటావు గదా తులసమ్మా" అన్నాడతడు.

ఆమె ఆత్రంగా విప్పి చూసింది. ఎరుపు రంగు జరీ బోర్డరున్న పసుపు రంగు గద్వాల్ చీర! పెద్ద ఖరీదైంది కాదు! నాలుగైదువందలు మించకపోవచ్చు అయితేనేం? అత్తయ్య మామయ్య కష్టార్జితంతో అంతకుమించిన ఆప్యాయతతో తనకోసం కొన్నదిగదా!

"చాలా బాగుంది మామయ్యా!" ఆనందంతో పొంగిపోతూ అంది!

"ఓసారి కట్టుకుని చూపిస్తావా అమ్మలూ" ఆశగా అడిగాడాయన!

"నిముషంలో వస్తాను" అంటూ లేడిలా ఛంగున లోపలికి వెళ్ళి అయిదు నిముషాల్లో చీరకట్టుకుని ఎరుపు రంగు రవిక ఎరుపు పసుపు కలిసిన గాజుల్తో తిరిగి వచ్చింది.

"బంగారు తల్లిలా వున్నావురా" అన్నాడతడు సంబరంగా.

అదే సమయంలో ఆమె జీవితం, సౌందర్యం అడవిగాచిన వెన్నెల అయిపోతున్నాయన్న విషయం అతడికి గుర్తొచ్చింది! నిట్టూర్చాడు విషాదంగా!

ఆసాయంత్రం అతడు వెళ్ళిపోయాడు!

అతడా వాతావరణంలో ఇమడలేడు! మేనకోడల్ని అమ్మవారిగా చూడడం అతడి చేతగానిపని! అతడెళ్ళాక శ్రీనివాసరావు వచ్చాడు తులసి దగ్గరికి! ఆమె మొహంలోని ఆనందాన్ని ఆమె కట్టుకున్న కొత్త చీరనీ గమనించాడు. అతడ్ని చూసిన మరుక్షణం ఆమె మొహంలోని ఆనందం ఆవిరయిపోయింది.!

"చీర బాగుంది తులసీ" అది వ్యంగ్యమో నిజమో తెలీలేదు!

ఆమె ఏమీ మాట్లాడకపోవడంతో "వచ్చే వారంలో నీ పుట్టినరోజు వేడుకలు ఘనంగా జరుగుతాయి తులసీ! ఆరోజు కార్యక్రమంలో ముఖ్యమంత్రితోపాటు సినీ తారలూ గాయకులూ వివిధదేశాల ప్రముఖులూ పాల్గొంటారు! ఆరోజు నువ్వు ఇవ్వాల్సిన స్పీచ్ మూడు భాషల్లో సిద్ధమైంది. తయారుగా వుండు! ఆ వెంటనే అమెరికా ప్రయాణం వుంది" అన్నాడు.

"మామయ్యా! అమెరికా రావడం నాకిష్టం లేదు మామయ్యా!" అందామె దీనంగా

"అలా అంటే ఎలా చెప్పమ్మా? కొన్ని ఇష్టంలేకపోయినా తప్పని పర్యటనలు వుంటాయి! నీ స్థానం, స్థాయీ అలాంటివి" అన్నాడతడు మెత్తగా!

ఆయన ముఖంలోని కఠినత్వం ఆమెకి కాపోతే ఎవరికి తెలుస్తుంది?

"నారాయణ కూతురి పెళ్ళి అని చెప్పాడా తులసీ?

"ధన సహాయం ఏదైనా చేస్తాననకపోయావా? "

"అనడానికి నేనెవర్ని మామయ్యా? నాగ్గర డబ్బెక్కడిది? "

"అదేం మాట తులసీ! ఏమిటా నిష్టూరం! కోట్లాది సంపదకి అధికారిణివి! మాదంతా ఏముంది? దానికి కాపలా కాసే బంట్రోతుల్లాంటి వాళ్ళం" అన్నాడు.

"అంతమాట ఎందుకులే మామయ్యా! అయినా మన దగ్గరున్న డబ్బు విషంతో సమానం చిన్నమామయ్యకి! నేనామాట అంటే మళ్ళీ జన్మలో నామొహం చూస్తాడంటావా మామయ్యా? నిష్కల్మషమైన చిన్న మామయ్య ప్రేమని అభిమానాన్ని డబ్బు పేరెత్తి దూరం చేసుకునే ధైర్యం నాకు లేదు పెద్దమామయ్యా" అందామె నెమ్మదిగా!

శ్రీనివాసరావు మొహంలో రంగులు చాలా వేగంగా మారాయి. ఈ ఓటమినే అతడు భరించలేడు! చదువులేని పల్లెటూరి బైతు అయిన తన తమ్ముడి దగ్గర మొదటి నుంచీ అతడు మరగుజ్జుగానే వున్నాడు! ఈ మేనకోడలు మాత్రం తనని అందలాలు ఎక్కించి ఆకాశంలో కనకపు సింహాసనం ఎక్కించినా తనని ద్వేషిస్తూనే వుంది! వాడిచ్చే కొబ్బరి ఉండలూ నేత చీరలూ అపురూపంగా భావిస్తుంది!

శ్రీనివాసరావు తన భావాల్ని కంట్రోలు చేసుకుని "రెస్ట్ తీసుకోమ్మా" అంటూ వెళ్ళిపోయాడు.

ఆమె మనసుని మళ్ళీ దిగులు ఆవరించింది. పోనీ ఈ జైల్లోనయినా ప్రశాంతంగా వుండనీడు! విదేశీపర్యటనలంటాడు. ఇక్కడ తెలుగు నాటకాలూ అక్కడ ఇంగ్లీషు నాటకాలూ...

ఆమె గట్టిగా కళ్ళు మూసుకుంది.

"నాకీ అమెరికా విమానయానాలూ పూజలూ మొక్కులూ అభిషేకాలూ వద్దు! నాకు ప్రశాంతమైన జీవితం కావాలి భగవంతుడా" అనుకుందామె పదేపదే.

ఒకనాడు 'అమెరికా' అన్నపదాన్ని తొలిసారిగా విన్నగంటలోనే అడిగింది తండ్రిని "మనమూ అమెరికా పోదాం నాన్నా" అని!

యధావిధిగా అశాంతి నిండిన ఆమె మనసు తనకి ఉపశమనం కలిగించే గతం వైపు జారిపోయింది!

★ ★ ★

తన తరువాత ఆరు సంవత్సరాలకి భారతి పుట్టింది!. అటు తరువాత మూడేళ్ళకి తమ్ముడు పుట్టాడు. వాడెవరికీ తలవంచక రాజాలా బ్రతకాలని వాడికి రాజు అని పేరు పెట్టాడు!

మగపిల్లాడు పుట్టాడని బంధువులంతా చూడడానికి వచ్చారు. అప్పుడు కనకయ్య మామ కూడా వచ్చాడు. నాన్నకి బావ వరస. చాలా ఏళ్ళక్రిందట టౌన్‌కి వెళ్ళిపో

యారట. నాన్నంటే బాగా అభిమానం. భోజనాలూ అవీ అయ్యాక కనకయ్యమామ నాన్నతో "మా పిల్ల అమెరికా వెళ్ళబట్టే మేమంతా పైకి పోగలిగాంరా! లేకపోతే మేమంతా ఇక్కడే మీ అందరితో కలిసి కాయకష్టం చేసుకోవాల్సిన మాట! కాదా ఏం? " అన్నాడు.

"నిజమే బావా! మీ అదృష్టం ఆదిలక్ష్మి" అన్నాడు నాన్న!

"పోనీ నువ్వు టౌనుకి రారాదంట్రా. తెలివైనోడివి. ఊరికే రెక్కలు ముక్కలు చేసుకోవడం ఎందుకు? బిడ్డలు చదువులకి వస్తున్నారు గదా! నేనే ఏదో కొంత పెట్టుబడి పెడతాను! వ్యాపారం చేసుకుందువుగానీ" అన్నాడు.

నాన్న నవ్వి "వ్యాపారం చెయ్యాలన్న ఉద్దేశ్యం నాకుంటే నేనే సొంతంగా పెట్టుకోగలను బావా! నాకిక్కడేంలోటు! భార్యా బిడ్డల్తో సుఖంగా వున్నానుగదా" అన్నాడు.

"ఎక్కడికక్కడ సంతృప్తి పడతావురా! అందుకే నువ్వంటే నాకిష్టం" అన్నాడు.

"ఆశకి అంతెక్కడలే బావా" అన్నాడు నాన్న!

కనకయ్య మామ వెళ్ళాక అమ్మ అడిగింది, "ఆదిలక్ష్మి అమెరికా ఎందుకెళ్ళింది? "

నాన్న అప్పుడు చెప్పాడు! కనకయ్య మామవాళ్ళు అయిదుగురు అన్నదమ్ములు. పెద్దవాడు కనకయ్య మామ అయితే రెండోది ఆదిలక్ష్మి! ఆ పిల్ల చిన్నతనంనుంచి హుషారు! చదువుకుంటానని మోజుపడితే తండ్రి చదివించాడు! ఏడోతరగతి తరువాత పెళ్ళయింది ఆదిలక్ష్మికి. భర్త బి.ఏ. చదివాడు! అతడి బంధువుల సాయంతో అప్పట్లో అతడు అమెరికా వెళ్ళి ఏదో చిన్న ఉద్యోగం సంపాదించుకున్నాడు. వాళ్ళకి ఇద్దరు పిల్లలు పుట్టారు. ఆదిలక్ష్మి కూడా అక్కడ సోమరిగా వుండక పాలబూత్‌లో లెక్కలు రాస్తుందంట. కొడుకు పదిహేనేళ్ళవాడు పేపర్ వెయ్యడం, హోటల్లో పనిచెయ్యడం చేస్తూ చదువుకుంటాడట. కూతురు పదమూడేళ్ళ అమ్మాయి తోటపనికి వెళ్ళేదట. అక్కడ వాళ్ళు మొదట్నుంచీ అలా కష్టపడి సంపాదిస్తూ ఇక్కడ బంధువుల్ని ఆదుకున్నారు. కనకయ్యని తప్ప మిగతా చదువుకున్న తోడబుట్టిన వాళ్లందర్నీ ఒకరొకరుగా అమెరికాకి పిలిపించేసుకుంది ఆదిలక్ష్మి. వాళ్ళంతా కలిసి, ఇతడికి చదువులేదు కాబట్టి డబ్బు సాయంతో వ్యాపారం పెంచడం ఇతడి కూతురికి గొప్ప సంబంధం, కొడుకుల చదువుల బాధ్యత తీసుకున్నారు. ఇతడి ఇద్దరు కొడుకులు కూడా అమెరికా వెళ్ళబోతున్నారు త్వరలో.

"అదృష్టం ఎంతైనా" అంది అమ్మ ఇంత లేసి కళ్ళు చేసి!

అప్పటిదాకా అంతా విన్న తాను, "నాన్నా నాన్నా మనమూ అమెరికాపోదాం" అంది ఆశగా.

నాన్న పకపకానవ్వాడు. తనేం మాట్లాడినా ఏం చేసినా నాన్నకి సంబరమే. తనకి అక్షరాభ్యాసం చేసిన రోజూ చెవులు కుట్టించిన రోజూ పండగ నెల్లో వాకిట్లో తను తొలిముగ్గు వేసిన రోజూ తన గోరింటాకు చేతులు ఎర్రగా పండినప్పుడూ బళ్ళో మంచి మార్కులు తెచ్చుకున్నప్పుడూ తన పుట్టిన రోజూ... ఇవన్నీ ఆయనకి ముఖ్యమే. తండ్రికి ఎందరు బిడ్డలున్నా ఆ బిడ్డలందరి మీదా సమానమైన ప్రేమ వున్నా తొలిబిడ్డ స్థానం మాత్రం అతడి మనసులో ప్రత్యేకమయినది! అందులో ఆడపిల్లయితే మరీనేమో!

"నువ్వు బాగా చదువుకుని పెద్దయ్యాక అమెరికా వెళుదువులే తల్లీ" అన్నాడు.

తన చదువు నాన్నకో కల!

"అబ్బా కూతుర్లు కాస్త మమ్మల్ని కూడా తీసుకెళ్ళండి" ముసిముసిగా నవ్వుతూ అంది అమ్మ.

"అబ్బే లేదు! మేమిద్దరమే వెళతాం" అన్నాడు నాన్న ఉడికిస్తూ.

"ఎక్కడికి బావా? నన్నూ తీసుకుపోవ

చ్చుగదా" అంటూ వచ్చాడు పెద్దమామయ్య.

అప్పటికి ఏడాదైంది తను కనిపించి. తనయితే ముందు అతడ్ని గుర్తుపట్టలేదు. కాషాయవస్త్రాలతో దిగాడు.

మధ్యాహ్నం యథాప్రకారం అమ్మచేతి కోడికూర తింటూండగా "ఆమధ్య సన్యాసుల్లో కలిశావని విని పోనీ ఆ రకంగానైనా ముక్తిని సాధిస్తావనుకున్నానురా శీనయ్యా! ఇంకా ఈ జిహ్వాచాపల్యం ఏమిట్రా? పెళ్ళాం బిడ్డల్ని వాళ్ళమానాన గాలికి వదిలి నువ్వీ అడ్డమైన వేషాలన్నీ వేస్తున్నావా? " అన్నాడు నాన్న తీవ్రంగా.

"అది కాదు బావా. నాకు జీవితసత్యాలు కొన్ని తెలిశాయి! భార్యా, బిడ్డలూ భవబంధాలూ అన్నీ మిధ్య" అన్నాడు.

ఆ సంభాషణ వింటున్నతను "మరి కోడికూరో మామయ్యా" అంది అమాయకంగా.

ఈ మాటకి నాన్న పడిపడి నవ్వితే మామయ్య చిన్నబుచ్చుకున్నాడు.

తరువాత మొహమంతా ఎర్రగా చేసుకుని నాన్న మామయ్యని మందలించసాగాడు. అప్పుడు మొట్టమొదటిసారిగా నాన్నని చూస్తే తనకి ఎంత భయమనిపించిందో! నాన్న మాటల్లో ఏ ఒక్కమాటకీ సమాధానం చెప్పలేకపోయాడు పెద్దమామయ్య.

అయితే మామయ్యని రక్షించడానికా అన్నట్టు "ఓ కిష్టయ్యన్నా! గూడెం అంటుకుందంట" అంటూ గావుకేకలు పెడుతూ పరిగెత్తుకొచ్చాడు మాళీ చిన్నాన్న!

అంతే... నాన్న కంచంముందునుండి లేచి చెయ్యి అయినా కడుక్కోకుండా మూలనున్న ఇత్తడి బిందెలు రెండు అందుకుని పరుగెత్తాడు. తల్లి కేకలేస్తున్నా వినిపించుకోకుండా తనూ పరుగెత్తింది.

అప్పటికి పాతిక వంతు గూడెం అంటుకుంది. గూడెం జనం అగ్గగ్గలాడిపోతున్నారు. ఊళ్ళోని అందరూ ఇంటికొకరెండేసి బిందెలు పట్టుకుని పరిగెత్తుకొస్తున్నారు.

పల్లెలో అంతే! ఎవరికేం కష్టంవచ్చినా అంతా కలసి ఆదుకుంటారు.

అప్పుడు చూసింది తను నాన్న విశ్వరూపాన్ని.

ప్రాణాలకి తెగించి మంటలార్పడానికి ప్రయత్నించాడు. గుడిసెల్లో చిక్కుకుపోయిన ఇద్దరు ముసలివాళ్ళనీ నలుగురు పసిబిడ్డల్నీ బయటికి తెచ్చాడు. ఆ ప్రయత్నంలో నాన్న శరీరం అక్కడక్కడా కాలి గాయాలయ్యాయి. కొందరు నాన్నని 'నీ ప్రాణానికే ముప్పు' అని హెచ్చరించారు. అయినా నాన్న చెవిని బెడితేనా? అంతటా తానే అయి కనిపించాడు. తను భయపడి ఏడుస్తూ చూస్తోంది. గూడెం జనాలకి నాన్న దేవుడిలా కనిపించాడు. మూడుగంటలసేపు పోరాడి ముప్పై శాతం కాలిపోయిన గూడెం మంటల్ని పూర్తిగా ఆర్పిగానీ తన తాండవాన్ని ఆపలేదు నాన్న.

అక్కడికి ఎందరు వచ్చి మంటల్ని ఆర్పినా గూడెం జనం మాత్రం "కిష్టయ్యన్న రూపంలో దేవుడొచ్చి మా ప్రాణాల్ని కాపాడాడు" అనే అన్నారు.

ఆ తరువాత తనని ఎత్తుకుని "ఎందుకురా ఏడుస్తావు? ఇప్పుడేమయింది? " అంటూ సముదాయించాడు.

అంతటితో వూరుకున్నాడా? లేదు. ఇంటికొచ్చి తను కష్టపడి సంపాదించి కూడబెట్టుకున్న ధాన్యం మూటలు రెండింటిని అగ్నిప్రమాదంలో సర్వం కోల్పోయిన వారికి పంచిపెట్టాడు. వూళ్ళో ఇల్లిల్లూ తిరిగి చందాలు దండి గడ్డి, తాటాకు, కర్రలూ సేకరించి మళ్ళీ వాళ్ళకి కొంపా గోడూ ఏర్పాటు చేశాడు.

ఆరోజు అన్నాడు పెద్దమామయ్య అమ్మతో "భూదేవీ! దేవుడెక్కడో లేడే! నీ భర్తలాంటివారి మనసుల్లోనే వుంటాడు" అని.

అమ్మ ఉప్పొంగిపోయింది. కానీ, దేవు డైనా రాముడైనా విధి రాతను తప్పించుకో లేరేమో. ఎందుకంటే కంటికి కనిపించని విధి చాలా క్రూరమైనది. బలీయమైంది. అది అంత మంచి నాన్ననీ అతడి భార్యా బిడ్డల్నీ ఎంత చిన్నచూపు చూసింది? లేక పోతే ఇంటా బయటా అందరిచేత మంచి అనిపించుకున్న నాన్న చిన్నవయసులోనే పెళ్ళాం పిల్లల్ని అనాథల్ని చేసి మృత్యు వుతో తప్పనిసరిగా అన్నట్టు నేస్తం కట్టి వెళ్ళిపోయాడు.

ఆ రోజుల్నీ ఆ సంఘటనల్నీ తలచు కుంటే తన గుండె వణికిపోతుంది.

ఆరోజు నాన్న ఎప్పటిలానే పన్లోకి వెళ్ళాడు. లింగమూర్తింటి పనికి.

తను మధ్యాహ్నం అన్నానికి బడినుంచి ఇంటికొచ్చింది. అమ్మ తనకీ చెల్లెలికీ భోజనం వడ్డించి మూడేళ్ళ తమ్ముడికి గోరు ముద్దలు పెడుతోంది. అప్పుడు గల్లంతుగా ఏడుస్తూన్న దాదాపు పదిమంది మనుషులు ఓ మంచంమీద నాన్నని పడుకోబెట్టుకుని దాన్ని నాలుగువైపులా భుజాలమీద పెట్టు కుని మోసుకొచ్చారు. వారి వెనక ఇంకో పదిమంది.

మంచంమీదనుంచి నాన్నని దించుతోంటే అమ్మ హడలిపోయి "ఏమయింది?" అంటూ పరుగెత్తింది. అప్పటికే ఇరుగూపొ రుగూ చేరుకున్నారు.

"నిచ్చెనమీదనుండి పైన మేస్త్రీకి ఇటుకలు అందిస్తూ కాలుజారి పడిపోయాడు" చెప్ప లేక చెప్పారు వాళ్లు.

నాన్న తెలివిలో లేడు. అమ్మ బిగ్గరగా ఏడవసాగింది. పుల్లయ్య మామ నీళ్ళుతెచ్చి నాన్న మొహంమీద చల్లి "కిష్టయ్యా... కిష్టయ్యా" అని పిలుస్తూన్నాడు.

తనూ తమ్ముడూ చెల్లెలూ ఏడుస్తున్నారు "నాన్నా... నాన్నా" అంటూ.

ఎవరో పరుగెత్తుకెళ్ళి వూళ్ళో వుండే ఆయుర్వేద వైద్యుడ్ని పిలుచుకువచ్చారు. ఆయన నాన్న చెయ్యి పట్టుకుని నాడి చూశాడు. గుండెలమీద చెవి ఆనించి విన్నాడు.

"గుండె బలహీనంగా కొట్టుకుంటోంది" అంటూ ఏదో చూర్ణం తేనెలో రంగరించి నాన్న నాలిక్కి రాశాడు. అరగంటకి కళ్లు తెరిచాడు నాన్న.

ఇంతలో లింగమూర్తి వచ్చాడు. "అయ్యో కిష్టయ్యా నా ఇంటిదగ్గర ఇలా అయిందే నీకు" అంటూ బాధపడ్డాడు.

నాన్న బలహీనంగా నవ్వాడు. బలవం తంగా లేచి కూర్చున్నాడు.

"మీరంతా ఇళ్లకి వెళ్ళి తిళ్ళు తినండి" అన్నాడు మిగతావాళ్ళతో.

"తులశమ్మా, భారతీ, రాజూ ఇలా రండిరా! ఎందుకేడుస్తారు? భూదేవీ! ఏమిటి చిన్నపిల్లలా నువ్వు కూడా. నేను బాగానే వున్నానుగదా" అన్నాడు.

తాము ముగ్గురూ నాన్న దగ్గరికి పరు గున వెళితే అమ్మ ఏడుపు పదింతలయింది.

"ఎందుకయినా మంచిది కిష్టయ్యా! నాకేదో అనుమానంగా వుంది. ఎందుక యినా మంచిది! ఓసారి టౌనుకి వెళ్ళి పెద్ద డాక్టరుకి చూపించుకో" వైద్యుడు చెప్పాడు.

"నాకేం బాగానే వున్నాను" అన్నాడు.

అంతా తేలికపడిన మనసుల్తో వెళ్ళిపో యారు.

నాన్న అమ్మని ఓదార్చాడు.

ఆ పూట అమ్మ వెయ్యి దేవుళ్ళకి మొక్కు కుంటూ నాన్నకి అన్నం కలిపి తినిపిం చింది.

అది మొదలు... నాన్నకి అప్పుడప్పుడూ గుండెల్లో నొప్పి వస్తూండేది. శ్రమ జాస్తి యితే శరీరం తట్టుకోలేకపోయేది. తరచూ పని మానేసి ఇంట్లో వుండాల్సివచ్చేది.

ఇదే నాన్నని బాగా కృంగదీసింది. ఓసారి టౌన్‌కివెళ్ళి డాక్టరుకి చూపించుకొచ్చాడు. వాళ్లేవో మందులు రాసిచ్చి అవి వాడి, తగ్గ

కపోతే మళ్ళీ రమ్మన్నారట. మొదట్లో ఆ మందులు గుణం చూపించినట్టే అనిపించాయి. తరువాత మళ్ళీ మామూలే! అప్పుడప్పుడూ నాన్న నీరసంతో మంచంమీద పడుకుని వుండేవాడు. నాన్న అలా పడుకుని ఉండటం ఏమీ బాగా వుండేది కాదు. నాన్నకి ఎప్పుడైనా జలుబూ, జ్వరం వచ్చినా అసలు పడుకునేవాడు కాడు. మనిషి కాస్త నీరసించాడు. తగ్గాడు.

"కిష్టయ్యా! నిన్నిలా చూస్తోంటే చాలా బాధగానూ, భయంగానూ వుందిరా" పుల్లయ్య మామ అన్నాడోసారి!

"నాకూ అలాగే వుంది పుల్లయ్య బావా" అన్నాడు నాన్న, "నా శరీరాన్నీ, కండబలాన్నీ చూసుకునీ ఇదే నాకు దేవుడిచ్చిన ఆస్తి అని పొంగిపోయానే. ఈరోజు నా ఈ శరీరమే నన్నుమోసం చేస్తోందిరా! నెలలో సగంరోజులు పన్లోకి వెళ్ళలేకపోతున్నాను" అంటూ బాధపడ్డాడు.

"పన్లోకి వెళ్ళకపోతే పోయిందిగానీ నువ్వు క్షేమంగా వుంటే చాలు" అంది అమ్మ.

అప్పుడు నేను నాన్న పక్కనే కూర్చునివున్నాను. అమ్మని లోపలికి వెళ్లనిచ్చి "నిజంగా నాకేదో భయంగా వుంది పుల్లయ్యా! ఇదీ అని చెప్పలేని అనుమానంగా వుంది. నాకేదయినా జరగరానిది జరిగితే నా భార్య చాలా అమాయకురాల్రా. నాయీ బిడ్డలు పసికూనలు" అని నన్ను దగ్గరికి తీసుకుని "నా పెద్దకూతుర్ని చూడరా! బంగారు బొమ్మలా ఎంత అందంగా తయారవుతోందో! దీనికిప్పుడు పన్నెండేళ్లే. ఈ బిడ్డని చూస్తేనే నా కడుపు నిండిపోతుందిరా! బాగా చదివించి ఉద్యోగస్థురాల్ని చేసి సమర్థుడైన ఓ అయ్యచేతిలో పెట్టాలని ఎన్ని కలలు కన్నాను. భగవంతుడు నామీద సీతకన్నేశాడనిపిస్తోంది" అన్నాడు.

తనకి నాన్నమాటలు అర్థం అయీ కానట్టుగా చాలా బాధగా భయంగా దిగులుగా అనిపించి నాన్నని అంటుకుని కూర్చుంది.

పుల్లయ్యమామ కంటనీరు తిరగ్గా "ఛ... నీకేమవుద్దిరా! సింహంలాంటోడివి. ఓసారి వెళ్ళి డాక్టరుని కలువు మళ్ళీ" అన్నాడు.

ఆ తరువాత నాన్న ఆరోగ్యం క్షీణించడం తప్ప మెరుగుపడలేదు. మనిషి బాగా తగ్గిపోయాడు. ఆయాసం మొదలయింది. గుండెల్లో నొప్పి.

అమ్మ డాక్టరుదగ్గరికి వెళ్ళమంటే, "నేను దాచిన డబ్బు నాకోసం ఖర్చయిపోతే రేపు నీ గతి, బిడ్డలగతి ఏమవుతాయి? ఇప్పటికే మీకన్యాయం చేసిపోతానేమోనని హడలిపోతున్నాను భూదేవీ" అన్నాడు నాన్న.

అమ్మ ఈ మాటతో కుళ్ళికుళ్ళి ఏడ్చింది. వెంటనే తనచేత అమ్మమ్మవాళ్ళకి, అత్తకీ, తన అక్కచెల్లెళ్ళకీ లెటర్స్ రాయించింది. పెద్ద మామయ్య ఎక్కడ వున్నాడో ఎవరికీ తెలీదు. వారంలోగా బంధువులంతా దిగారు. తాతయ్య మరీ మెత్తబడి ముసలివాడైపోయి వున్నాడు. నాన్నని చూసి కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు. అమ్మమ్మ కూడా ఏడ్చింది.

"నీకు అన్యాయం చేశాను కిష్టయ్యా. ఆ పాపం నా పెద్దకొడుకు రూపంలో నన్ను బాధపెడుతోంది. నా ఆస్తుల్లో సగం పైగా నా పెద్దకొడుకు చేసిన అప్పులకి పోయింది. కూతుర్ల కోరికలు తీర్చడానికి కొంత పోయింది. ఇదిగో ఈ అమాయకుడికి బతకడానికి చారెడు భూమి తనఖాలో వున్న కొంపా మిగిలింది" అన్నాడు దిగులుగా.

"పోన్లే మామా! ఆస్తులు శాశ్వతమా" అన్నాడు నాన్న విరక్తిగా.

"వూరుకో నాన్నా. ఇదేనా బావకి మన బాధలు చెప్పుకునే సమయం? బావా నువ్విలా వుంటే లాభంలేదు. నేను వూరు వెళ్ళి రెండు రోజుల్లో వస్తాను. నిన్ను ఆసుపత్రికి తీసుకెళ్ళి మంచి డాక్టర్లకి చూపించిగానీ తిరిగి వచ్చేదిలేదు" అదే చిన్నమా



మయ్య నాన్నతో అంతధైర్యంగా మాట్లాడడం.

అమ్మకి ధైర్యం వచ్చింది. అమ్మమ్మ, తాతయ్యా, చిన్నమామయ్య వెళ్లిపోయారు. అత్త, పిన్ని, పెద్దమ్మ చుట్టపుచూపుగా వచ్చిపోయారు.

"నీకిట్లా అయిందా అన్నా" అని అత్త బుడిబుడి రాగాలు తీసి అమ్మచేతిలో ఓ వంద వుంచి నా దగ్గర ఇంతకంటే లేదే! బాధల్లో వున్నాం" అని చెప్పిపోయింది. మిగతవాళ్ళూ అంతే.

అమ్మ బాధపడుతోంటే "బాధపడొద్దు భూదేవీ. వాళ్ళ సంగతి మనకి తెలీందేం వుంది. మన కష్టాల్ని చూసి వాళ్ళనేం అడుగుతామో అని వాళ్ళ భయం! అయినా

ఎవరి జీవితం వాళ్ళది" అన్నాడు నాన్న వేదాంతధోరణిలో.

అన్నట్టే చిన్న మామయ్య మూడువేల డబ్బుతో మరీ వచ్చాడు నాన్నని ఆసుపత్రికి తీసుకుపోవడంకోసం.

"ఎందుకురా నారాయణా! నా డబ్బు పోస్టాఫీసులో వుందిరా" చెప్పాడు నాన్న అయిష్టంగా.

"ఫర్లేదు బావా! ఇంతకంటే ఇవ్వలేకపోయినందుకు నాన్న చాలా బాధపడుతున్నాడు" చెప్పాడు చిన్నమామయ్య.

అమ్మ, చిన్నమామయ్యా, నాన్న టౌన్‌కి వెళ్ళే నిర్ణయమైంది. పిల్లలమైన మా దగ్గర ఎవరుంటారన్న ప్రశ్న వచ్చింది. ఎవరు



న్నారు మమ్మల్ని ఆదుకునేవాళ్లు. ఇరుగూ పొరుగూ 'మేం చూసుకుంటాంలే' అన్నారు. 'పసి కూనల్ని ఒంటరిగా వదిలివెళుతు న్నాను' అంటూ నాన్న ఎంత క్షోభపడ్డాడో!

అమ్మ కొంత డబ్బు పెట్టెలో పెట్టి జాగ్ర త్తగా వాడుకోమంది. నాన్న వదల్లేక వదిలి పోతోంటే పెద్దదయిన తను దుఃఖాన్ని దిగ మింగిందేగానీ ఆరేళ్ళ చెల్లెలూ, మూడేళ్ళ తమ్ముడూ ఒకటే ఏడుపు తామూ వస్తా మంటూ.

నాన్న ఈ దృశ్యం చూడలేనట్టు బండిలో తలతిప్పుకుని కూర్చున్నాడు. బండి కనుమ రుగయ్యాక చెల్లెలూ తమ్ముడితో వెక్కివెక్కి ఏడుస్తోన్న తనని ఇరుగూ పొరుగూ ఓదా ర్చారు. అప్పటికి దాదాపు మూడు నెలలుగా ఇంట్లో దిగులు వాతావరణమే. ఇరుగు పొరుగు వంటచేసి పెడతామన్నారు. కానీ, తను అన్నం వండుతుంది. పప్పు, పచ్చడి ఓ మాదిరిగా చేస్తుంది.

అమ్మ కూడా "తులసీ! నువ్వే వండుకో! మేం ఎన్ని రోజులకి వస్తామో రోజూ వండి పెట్టాలంటే వాళ్ళకి విసుగువస్తుంది. మేం వచ్చేదాకా నువ్వు బడి మానెయ్! చెల్లెల్ని పంపు! ఇద్దరితో నువ్వు వేగలేవు! తమ్ముడు జాగ్రత్త! వంటచేసేప్పుడు లంగా కట్టుకోకు. గౌను వేసుకో. పొయ్యిదగ్గర జాగ్రత్తగా వుండు" అంటూ జాగ్రత్తలు చెప్పి వెళ్ళింది.

అమ్మ ఇలా చెప్పేప్పుడు నాన్న కళ్ళుమూ సుకునే వున్నాడు. ఆ తరువాత అమ్మ, నాన్నా తిరిగి రావడానికి దాదాపు ఇరవైరో జులు పట్టింది. ఈ ఇరవైరోజుల్లో తమ్ముడూ, చెల్లెల్నీ సంభాళించడానికి తనెన్ని తిప్పలు పడిందో తనకే తెలుసు. రాత్రిళ్ళు నాన్న గుర్తొచ్చి ఒకటే ఏడుపొచ్చేది. అయితే నాన్న నుంచి ఉత్తరాలు వస్తూండేవి. తమకి ధైర్యం చెబుతూ తనకి బాగా వుందని ఆసు పత్రిలో పరీక్షలు చేస్తున్నారనీ రాసేవాడు.

తను కూడా "నాన్నా మేము చాలా బాగున్నాం. తమ్ముడూ చెల్లెలూ అల్లరిచేయ డంలేదు. నాకు ఇంట్లోపని కష్టంగా ఏంలేదు. నువ్వు బాగా డాక్టరుకి చూపించు కుని గుండెనొప్పి తగ్గాక నవ్వుతూ ఇంటికి రావాలి" అని బదులు రాసేది.

ఇరుగూపొరుగూ తమమీద ఓ కన్నేసి వుండేవాళ్ళు. నాన్నావాళ్ళు వెళ్ళాక వారం తరువాత చిన్నమామయ్య వచ్చి పోస్టాఫీ సులో డబ్బు తీసుకెళ్ళాడు. నాన్నని మెడ్రాస్ తీసుకెళ్ళి చూపించమన్నారట టౌన్‌లో డాక్టర్లు.

ఈ మాటవిని ఇరుగూ పొరుగూ "అమ్మో! ఏదో పెద్ద జబ్బే కిష్టయ్యకి" అను కోవడం విని తనకి ఎంత భయంవేసిందో!

"తులసీ మీ దగ్గర ఖర్చులకి డబ్బుందా?" చిన్న మామయ్య అడిగాడు!

చాలాకొంచెమే వున్నా తమకోసం ఉంచితే నాన్న వైద్యానికి చాలదన్న భయంతో 'ఓ... బోలెడుంది మామయ్యా" అంది తను.

మామయ్య వెళ్ళిపోయాడు. ఆ తరువాత మెడ్రాస్‌నుంచి నాన్న మళ్ళీ ఉత్తరం వ్రాసాడు.

"తులసీ! మేం బావున్నాం! ఎందుకైనా మంచిదని డాక్టర్లు ఓసారి నన్ను మెడ్రాస్‌లో చూపించుకోమన్నారు. అంతే. నువ్వు భయ పడవద్దు. తమ్ముడ్నీ చెల్లెల్నీ బాగా చూసుకో. మేం వీలయినంత తొందరగా వచ్చేస్తాం. అమ్మకి మీమీదే దిగులుగా వుంది. రాత్రిళ్ళు ఎవర్నయినా తోడు పడు కోబెట్టుకుంటున్నారా? కడుపునిండా తింటు న్నారా? అమ్మ మీకు కొంచెం డబ్బు ఇచ్చా నంటోంది! బియ్యం కూడా తక్కువ వున్నా యంటోంది. మామయ్యతో డబ్బుంది అన్నావంట! అయితే నువ్వు మొహమాటప డకుండా పుల్లయ్య మామని అడుగు. లేదంటే షావుకారు దగ్గరికి వెళ్ళి కావలసిన సరుకులూ బియ్యం కొంత డబ్బు అడిగి తెచ్చుకో! నాన్న వచ్చి ఇస్తాడని చెప్పు. మీరు జాగ్రత్తగా వుండాలి తల్లీ! నేనిక్కడ వున్నా నా ప్రాణం అంతా మీచుట్టూనే వుంది"

అంటూ వ్రాశాడు.

అది చదివి దాదాపు గంటసేపు ఏడుస్తూ కూర్చుంది తను! నాన్న ఏనాడూ ఎవరి దగ్గ రికీ అప్పుకి వెళ్ళింది లేదు. ఇప్పుడు తమను వెళ్ళమంటున్నాడు. ఎలా వెళ్ళడం? ఎలా అడగడం? లేచి వెళ్ళి బియ్యం చూసింది! దాదాపుగా అయిపోయాయి. తను వెళ్ళి ఎవర్నీ అడగలేదు. ఇంట్లో కొంచెం బియ్యంలో నూకలున్నాయి. అమ్మ దోశ ల్లోకి వాడుతుంది వాటిని. ఎప్పుడైనా చేపలూ మాంసం వండినప్పుడు సంగటి చేస్తుంది. నాన్నకి చాలా ఇష్టం నూకల సంగటి. తనూ రెండురోజులు చేతనైన విధంగా నూకల్తో సంగటి చేసి పెట్టింది.

చిన్నపిల్లలు తినలేకపోయేవారు. ముఖ్యంగా మూడేళ్ళతమ్ముడు. రాత్రిళ్ళు లేచి ఆకలికి ఏడుస్తూంటే పాలు తాగించేది. రోజూ పుల్లయ్య మామయ్య భార్య పాలు పిండి ఇస్తూండేది. మూడో రోజు బియ్యం అయిపోయాయన్న సంగతి పసిగట్టి తనతో చెప్పనందుకు నాలుగు తిట్లు తిట్టింది ఆమె. ఇంట్లో ఏమున్నాయో ఏంలేవో చూసింది. ఆసాయంత్రం పుల్లయ్య మామ ఏం తిప్పలు పడ్డాడోగానీ అరకట్ట బియ్యం కావా ల్సిన సరుకులూ తెచ్చి పడేశాడు. చేతి ఖర్చు లకని యాభై రూపాయలిచ్చాడు. తమ్ముడ్నీ చెల్లెల్నీ తీసుకెళ్ళి తినడానికి కొనిపెట్టాడు. ఎంత మంచోడో పుల్లయ్య మామ!

"తులసమ్మా! మీనాన్న మాకందరికీ చెయ్యి అందించినోడేగానీ ఒకడి దగ్గర సాయం పొందినోడే కాదు. వాడికీరోజు కష్టం వస్తే మేమంతా లేవా" అంటూ కళ్ళ నీళ్ళు పెట్టుకున్నాడు.

అంతటితో ఊరుకోక "నీకూతురు నిన్ను మించింది! ఇలా చేసింది" అంటూ నాచేతనే నాన్నకి ఉత్తరం వ్రాయించాడు.

మరో వారం తరువాత, ఇంటినుంచి బయలుదేరి వెళ్ళిన ఇరవై ఒకటో రోజు అమ్మానాన్నా చిన్నమామయ్య తిరిగి వచ్చారు. వాకిట్లో బండి ఆగగానే "ఒసేయ్ తులసీ! మీనాన్నొచ్చాడే" అంటూ కేక పెట్టింది రాజమ్మ.

ఛంగున బయటికి పరుగెత్తింది తను!

నాన్నని మామయ్య అమ్మ కలిసి సాయంపట్టి దించుతున్నారు. తను నవ్వుతూ చూసింది నాన్నవంక.

నాన్న... 'అసలు తన నాన్నేనా? ఎలా వుండేవాడెలా అయిపోయాడు?'

చాలా సన్నబడిపోయి వంగిపోయి ఇద్దరి సాయంతో నడుస్తున్నాడు. లోతుకుపోయిన కళ్ళూ పెరిగిన గడ్డం!

తనని చూశాడు. నవ్వబోయాడు. నవ్వు రాలేదు!

అమ్మా మామయ్యల మొహాల్లో కళాకాం తులు లేవు. అమ్మకూడాచాలా మారిపో యింది.

నాన్నని లోపలికి తీసుకొచ్చి మంచంమీద కూర్చోబెట్టారు. ఇరుగూ పొరుగూ పరుగె త్తుకొచ్చారు.

"డాక్టర్లు ఏం చెప్పారు? అదేంటి కిష్టయ్యా అలా అయిపోయాడు? బండి అంత మనిషి! అట్టా నీరసించి పోయాడేం?" అడిగారు బాధగా.

అమ్మ చిన్నమామయ్య బదులు చెప్ప లేదు.

నాన్న తననీ తమ్ముడూ చెల్లెలినీ దగ్గరికి తీసుకుంటూండగా "చెప్పవేంరా కిష్టయ్యా?" పుల్లయ్య మామ అసహనంగా అన్నాడు. "చెప్పడానికేం వుందిరా? నీకిచ్చిన సెలవు అయిపోయింది. ఇంక వెళ్లిపో అన్నారు"!

"ఆ..." అన్నాడు పుల్లయ్య మామ హాహా కారం చేస్తూన్నట్టు!

నాన్న నాకు తెలిసి అప్పుడు మొట్టమొద టిసారిగా "పుల్లయ్యా! ఇకనేనెంతో కాలం బతకనురా! చావు నావెంట తరుముతోంది. గుండెకి పెద్ద దెబ్బే తగిలింది. పెద్ద ఆపరే షను చెయ్యాలంట! చేసినా బ్రతికే నమ్మకం మాత్రం లేదంట. యాభైవేలు కావాల్రా

నమ్మకంలేని ఆ ఆపరేషన్‌కోసం! నేను పది పన్నెండేళ్ళు చెమటోడ్చి దాచినడబ్బు మంచినీళ్ళలా ఖర్చయిపోయిందిరా! అమాయకులైన నా భార్యాబిడ్డల్ని అనాధల్ని చేసి పోతున్నాన్రా! భగవంతుడు నన్ను క్షమిస్తాడంటావా? " అంటూ బిగ్గరగా ఏడ్చాడు.

అమ్మ కుమిలి కుమిలి ఏడుస్తోంది. చిన్న మామయ్య అక్కడ వుండలేక బయటికి వెళ్ళిపోయాడు!

నాన్న చచ్చిపోతాడని తనకి అర్థమైంది.

"చూడ్రా... అమాయకమైన నాబిడ్డల మొహాలు చూడు! ఈ నెత్తురు కూనల్ని చూడరా! ఇరవై రోజులు నేను లేకపోయేసరికి ఎలా అయిపోయారో చూడు! ఈ మంచాన్ని చూడ్రా. నవ్వారు ఊడిపోయింది నేను వెళ్లడానికి ముందు! ఎవరినైనా అడిగి దాన్ని బిగించుకోవడం కూడా చేతగాని వాళ్ళురా నా బిడ్డలు! ఎలా బ్రతుకుతార్రా నేను లేకపోతే? మా వాళ్ళంతా స్వార్థపరులు! నా భార్యాబిడ్డలికి దిక్కెవరు? దీన్ని చూడరా నా పెద్దకూతురు! పన్నెండేళ్ళొచ్చినా లోకం తెలీనిది! ఇంట్లో బియ్యం అయిపోతే సంగటి చేసి తమ్ముడికీ చెల్లెలికీ పెట్టిందిగానీ శేరుబియ్యం ఎవర్ని అడగాలో దీనికి తెలీలేదు! వీళ్ళెలా బతుకుతార్రా? " అంటూ కుమిలి కుమిలి ఏడ్చాడు.

"వూరుకో బావా! మేమంతా లేమా" అంటూ తనూ ఏడ్చాడు పుల్లయ్యమామ.

నాన్నని చూడడానికి వూరువూరంతా కదిలివచ్చింది. ఆయన స్థితినిచూసి కంటనీళ్ళు పెట్టని కఠినాత్ములు లేరంటే అతిశయోక్తి కాదు. ఆ తరువాత భారంగా అతి భారంగా వారంరోజులు గడిచాయి. చిన్నమామయ్య వూరువెళ్ళి బండిలో బియ్యం, సరుకులూ డబ్బూ తెచ్చాడు.

"నీకు చాలా రుణపడ్డాను నారాయణా" అన్నాడు నాన్న.

"అవేం మాటలు బావా" అంటూ బాధపడ్డాడు మామయ్య.

నాన్న పరిస్థితి రోజురోజుకీ విషమిస్తోంది. తను మరణించబోతున్నాడూ అన్న బాధకంటే తన భార్యాపిల్లల్ని దిక్కుమాలిన వాళ్ళని చేసి అర్థాంతరంగా వెళ్ళిపోతున్నానన్న అపరాధభావమే ఆయన్ని కృంగదీసింది. ఏదీ చేతగాని అమ్మ మమ్మల్ని ఎలా పోషిస్తోందో ఆయనకి తెలిసేది కాదు! చాలావరకూ తప్పుచేసిన వాడిలా మౌనంగా వుండేవాడు.

నన్ను దగ్గర కూర్చోబెట్టుకుని "నేను పోయాక అమ్మని దేనికీ బాధపెట్టవద్దు. మీకిక భగవంతుడే రక్ష. తులసీ నువ్వు బాగా చదువుకో. పెళ్లయి నీకొక బిడ్డ పుడితే నాపేరు పెట్టుకోమ్మా" అనేవాడు.

అమ్మతో "నీకేం జాగ్రత్తలు చెప్పాలో నాకు తెలీటంలేదు భూదేవీ" అనేవాడు.

అంతకంటే నాన్న ఏమీ మాట్లాడేవాడు కాదు. కళ్ళు మూసుకుని వుండేవాడు. గుండెల్లో నొప్పి వస్తే మూలిగేవాడు. ఓ అర్థరాత్రి భరించరాని నొప్పితో బాధతో విలవిల్లాడుతూ నన్ను దగ్గరికి తీసుకుని తమ్ముడ్నీ చెల్లెల్నీ చూపిస్తూ అమ్మతో ఏదో చెప్పడానికి ప్రయత్నించాడు. చెప్పలేకపోయాడు. కళ్ళలోంచే నాన్న ప్రాణం పోయింది.

మానాన్న మాబంగారునాన్న ఇంటాబయటా ఒక విలువతో బ్రతికిన సింహం లాంటి నాన్న మృత్యువుకి తలవంచి వెళ్ళిపోయాడు.

అప్పుడుకూడా నాన్న చెయ్యి తనని చుట్టుకునేవుంది.

★ ★ ★

తులసి కుళ్ళి కుళ్ళి ఏడుస్తోంది.

పదిహేనేళ్ళనాడు జరిగిన ఆ సంఘటన ఇప్పుడు జరిగినట్టు అనిపిస్తూ ఆమె గుండెల్లో పచ్చిగానే వుంది.

ఆరోజులానే చిన్నపిల్లలా పన్నెండేళ్ళ తులసిలా " నాన్నా నువ్వు చచ్చిపోవద్దు నాన్నా! నువ్వు చచ్చిపోవద్దు" అంటోంది.

"తులశమ్మా! ఏమయింది? "

తులసి స్పృహలోకి వచ్చినట్టు చూసింది.

తల్లి!

ఎప్పుడొచ్చిందో! "అమ్మా" అంది!

చాలారోజుల తరువాత గుండెల్లోనుండి ఆర్తితో వచ్చిన పిలుపు అది.

"నాన్న చివరి రోజులు గుర్తొచ్చాయి. అమ్మా... నాకు ఆ బాల్యం కావాలనుంది. నాన్నతో గడిపిన ఆరోజులు తిరిగి రావాలని వుందమ్మా! పోనీ, అది కుదరకపోతే కనీసం ఆ తరువాత మనం బాధలుపడుతూ గడిపిన రోజులైనా కావాలనివుంది. వాటిలోనే మనశ్శాంతి వుందమ్మా! బతకడం కోసం పోరాటం చేసిన జీవితం అది. చింతచిగురు అమ్ముకున్నా ఆరోజులే బావున్నాయమ్మా నాకు" ఏడుస్తోంది తులసి పసిపాపలా!

తల్లి మొహం పాలిపోయింది. ఏదో అనబోయింది. దగ్గరికి రాబోయింది.

అంతలోనే ఆగిపోయి తప్పుచేసినదానిలా ఆగదిలోంచి వెళ్ళిపోయింది.

"ఎంత కఠినాత్మురాలివి అయిపోయావమ్మా" అంటూ తులసి మళ్ళీ దిండులో మొహం దాచుకుంది.

ఆ తరువాత గడిచిన సంవత్సర కాలం మహాభయంకరమైంది. అమ్మని తనతో వచ్చేయమన్నాడు చిన్నమామయ్య. అమ్మ ఇష్టపడలేదు.

మామయ్య తనకు చేతనైనంత సాయం చేసేవాడు. నాన్న ఖర్మ క్రతువులకి పోను మిగిలిన డబ్బుతో మామయ్య, ఇరుగూ పొరుగూల సాయంతో ఆరునెలలు అతి కష్టంమీద గడిచాయి.

ఆ తరువాత కాలమే బహు దుర్భరమైంది.

అక్కడ చిన్న మామయ్యా కూడా చితికిపోయాడు.

అదే సమయంలో రెండునెలల తేడాతో అమ్మమ్మ తాతయ్యా పోయారు.

పెద్దమామయ్యా ఆచూకీ తెలీలేదు. అతడు చేసిన అప్పులు మూలంగా చిన్నమామయ్య వుంటూన్న ఇల్లు వేలంకి వచ్చింది. దీంతో చిన్నమామయ్య రెండుమూడు నెలలపాటు ఇటువేపు రాలేకపోయాడు. అతడి భార్యాబిడ్డలు కూడా పుట్టింటిని ఆశ్రయించారుట. ఇక్కడికి వచ్చినా తనేం చేయగలడు ఈ పరిస్థితులలో.

ఇరుగూ పొరుగూ అమ్మని సూటిపోటి మాటలనసాగారు.

"కిష్టయ్య ఉన్నప్పుడు జరిగినట్టు జరుగుద్దా? ఇంకా ఇంట్లోంచి బయటికి రాకపోతే ఎట్టా? కూలిపని చేతగాకపోతే నాలుగిళ్ళల్లో పాచిపనయినా చేసుకోవాలి! పిల్ల కూడా పెద్దదవుతోంది. మనబోటోళ్ళకి ఏం చదువులు? బడిమానిపించి దాన్ని రెండిళ్ళల్లో పనికి దింపితే సరి! కష్టాలు తీరిపోతాయి. మొగుడు పోయి ఆర్నెల్లు దాటినా ఇల్లు కదలదు. ఇదేం ఆపదమ్మా? బిడ్డల్ని పస్తులు పెడుతోంది. రోజులు బాగున్నప్పుడు ఏదో కలలు కంటాం! అవన్నీ సాగుతాయా? " ఇలా అనేవారు.

తొలిసారిగా ఇల్లు కదిలి పనిలోకి వెళుతున్నప్పుడు అమ్మ ఎంత ఏడ్చిందో తనకి తెలుసు.

మిగతా ఆరునెలలూ చాలా దుర్భరంగా గడిచాయి. పాచిపనులకోసం వెళ్ళే ఇళ్ళల్లో అమ్మకి పనిచేతకాక కొంత, అమ్మ అందం ఆమెకి శత్రువయి కొంత, ఎంతో కాలం ఆ పనులు చేయలేకపోయింది. పస్తులు తప్పనిసరి అయ్యాయి. రాత్రిళ్ళు తప్ప నాన్న గుర్తురానంతగా బతుకు పోరాటం.

ఇదిగో అలాంటి పరిస్థితుల్లో వచ్చింది తనకి ఆ ఆలోచన! నాన్న దొంగని కొట్టిన అడవికి వెళ్ళి కొందరు ఆడవాళ్ళు చింతచిగురు, రేగుపళ్ళు, కలేపళ్ళు తెచ్చి వూళ్ళోనూ పక్క వూళ్ళోకి తీసుకెళ్ళి అమ్మేవాళ్ళు.

"అమ్మా నేను బడి మానేస్తాను. నువ్వూ నేనూ కొండకి వెళ్ళి చింతచిగురు, పండ్లూ

తెచ్చి పక్కవూరికి వెళ్ళి అమ్ముకొద్దామా?" ఆశగా అడిగింది తను.

అమ్మ ఆమాటతో ఏడ్చింది గానీ కన్నీళ్ళు రాలేదు. అవి ఎప్పుడో ఇంకిపోయాయి.

తన చదువు సాగే పరిస్థితి లేదని అమ్మకీ తెలుసు. అన్ని బాధల్లో వుండీ ఏడో తరగతి ఫస్ట్ క్లాసులో పాసయి ఎనిమిదో తరగతి పక్కవూళ్ళో చేరినా పట్టుమని నెల రోజులు వెళ్ళింది లేదు బడికి. అక్కడితో తన చదువు అటకెక్కింది.

అమ్మా తనూ వెళ్ళి చింతచిగురు కరివేపాకు, రేగి, ఉసిరిక, కలేపళ్ళు లాంటివి కోసుకొచ్చేవాళ్ళు!

ఇతరుల్తో పోటీపడి కొయ్యడంలో తన కాళ్ళు చేతులూ చీరుకుపోయేవి. ఒక్కోసారి ఏడుపొచ్చేదికూడా. కాని బయటికి పొక్కేది కాదు. తరువాత అమ్మ తనని తమ్ముడూ చెల్లెలు దగ్గరవుంచి ఇంకా తెల్లారకముందే ఆమసక చీకట్లో పండ్లగంప తీసుకుని తలకి ముసుగేసుకుని పక్కవూర్లోకి వెళ్ళిపోయేది అమ్మ. తిరిగి ఏ పన్నెండుకో వచ్చేది. అప్పటికి ఆకలితో నకనకలాడుతున్న తామే అమ్మ పొయ్యి ముట్టించి వండి పెడితే ఆవురావురుమంటూ తినేవాళ్ళు! అయితే అమ్మ సంపాదన ఒకపూట మాత్రమే కడుపు నింపేది. రెండోపూట అమ్మతోపాటు పెద్ద పిల్ల అయిన భాగ్యానికి తనూ కడుపు మాడ్చుకుని చిన్న పిల్లలిద్దరి కడుపులు నింపాల్సి వచ్చేది!

అలా మూడునెలలు మహాదయనీయంగా గడిచాయి. చిన్నమామయ్య 'తను రాలేని పరిస్థితుల్లో వున్నానని పిల్లల్ని తీసుకుని అమ్మని అక్కడికి వచ్చేయమని అంతా ఒకచోట కలో గంజో తాగి వుందామని' అమ్మకి లెటర్ వ్రాశాడు. కానీ అమ్మ అందుకు ఇష్టపడలేదు.

"మేం బాగానే వున్నాం! కాలమే మాకు బ్రతకడం నేర్పింది. ముందే నువ్వు కష్టాల్లో వుంటే నలుగురం వచ్చి నీ నెత్తిన పడాల్నా? వద్దు" అని వ్రాసింది.

ఇలా అతిభారంగా రోజులు గడుస్తూండగా ఓ శుభముహూర్తాన పెద్దమామయ్య దిగబడ్డాడు.

ఈసారి కాషాయవస్త్రాలు కాదు... మల్లెపూవులాంటి తెల్లని బట్టల్లో వున్నాడు!

వూళ్ళో ఏదోపనిమీద దిగితే నాన్న పోయాడని ఎవరో చెప్పారంట! ఆయనొచ్చేసరికి అమ్మ ఇంట్లోలేదు. చింతచిగురు అమ్మడానికి పోయింది. ఇదివరకులా మామయ్యని చూడగానే ఆనందంతోపాటు తనకి భోరున ఏడుపు కూడా వచ్చింది. ఇంతలో అమ్మ తిరిగి వచ్చింది. తన అన్నకి మొహం చూపించలేక చాటుకి వెళ్ళి కుమిలిపోయింది.

"జరిగిందేదో జరిగిపోయింది. ఇక బాధపడేం ప్రయోజనం? నేను చాలా పెద్దపని మీదే దేశం తిరుగుతున్నాను. అయినా భూదేవీ, నీ భర్తకి చిలక్కి చెప్పినట్టు చెప్పాను. నాతో పట్టణానికి వచ్చేయ్ వ్యాపారం పెట్టిస్తాను అని! విన్నాడా?" నిష్ఠూరంగా అని "పోనీ, ముగిసిన కథని గురించి ఇప్పుడెందుకులే! జరగాల్సిన దాన్ని గురించి ఆలోచించాలి" అని చాలా సేపు ఆలోచనలో పడిపోయాడు.

మళ్ళీ "చూడూ నీ బిడ్డలు ముత్యాల్లాంటి వాళ్ళు. ఎలా పాడయిపోయారో! నీ కూతురు చూడు ఎంత అందంగా వుందో! రేపో మాపో ఈడవుతుంది. ఈ బంగారు బొమ్మకి పెళ్ళెలా చేస్తావు?" అంటూ బాధ పడ్డాడు. మామయ్య నాన్న లేకపోవడం మూలానేమో చాలా పెద్దగా మాట్లాడుతున్నాడు.

"మామయ్యా! నేను చదువు మానేశాను" దిగులుగా చెప్పాను.

"పోనీ వెధవ చదువు! అదేం ఉద్ధరిస్తుందా?" అన్నాడు.

మామయ్య మాటిమాటికీ నన్ను గమనించడం చూస్తున్నాను నేను. తరువాత మామయ్య నన్ను వెంటబెట్టుకు వెళ్ళి

అంగట్లో దండిగా సరుకులూ బియ్యం కొన్నాడు. నాకెంత ఆనందమో! ఎన్నిరోజులయిందో అన్ని సరుకులు కొనుక్కుని. ఆ మధ్యాహ్నం భోంచేస్తుండగా పెద్దమామయ్య అమ్మతో అన్నాడు.

"ఏదో ఒకటి చేయాలి భూదేవీ! నిన్ను బావ ఎంత అపురూపంగా చూసుకున్నాడు? అక్కకీ చెల్లెలికీ కూడా నీకు నీ భర్త జరిపినట్టు జరిగిందా? ఈనాటికి ఇలా నువ్వు చింతచిగురు అమ్ముకోవాల్సి రావడం నాగుండెల్ని పిండేస్తోంది. ఏం చేద్దామన్నా నా పరిస్థితీ బాగాలేదు. నా భార్యాబిడ్డలు పరాయి పంచన వున్నారు. ఏదో అందలం ఎక్కాలని చూశాను. జారిపడుతూనే వున్నాను. నా తెలివి తేటలమీద నాకు నమ్మకం వున్నా మీకెవరికీ లేదు. నేను వాటిని నిరూపించుకుంటాను. ఏదో చేస్తాను. మనకష్టాలు తీరేలా చేస్తాను. నువ్వు నిశ్చింతగా వుండు. నామీద భారం వెయ్యి. నీ అన్నదమ్ముడిగా నిన్ను ఆదుకునే బాధ్యత నామీద వుంది. నీబిడ్డలు నా బిడ్డలనుకో. నువ్వు ధైర్యం తెచ్చుకో" అన్నాడు.

నిజంగా అమ్మ చాలా ధైర్యంగా చూసింది. ఇంకొకప్పుడైతే ఆమాటల్ని అమ్మ నమ్మేదికాదు. 'డంబాలు' అనుకునేది. కానీ తన పరిస్థితిని బట్టి ఏ ఆధారం దొరుకుతుందా అని ఎదురు చూస్తోంది గాబట్టి నమ్మింది. కొండంత బలంవచ్చినట్టయింది ఆమెకు. చిన్నదాన్నయిన నాసంగతి చెప్పనే అక్కరలేదు.

ఆసాయంత్రం పెద్దమామయ్య తనని వెంబడి తీసుకుని టౌన్‌కి వెళ్ళి తనకీ అమ్మకీ తమ్ముడూ చెల్లెలికి బట్టలు కొన్నాడు. తనకయితే పట్టుపావడా చెప్పులూ కొన్నాడు. వాటిని టైలర్ దగ్గర ఇచ్చి నాకు సినిమా చూపించి ఆరాత్రి తెలిసిన వాళ్ళింట్లో పడుకుని తెల్లారి కొత్తబట్టలు తీసుకుని ఇంటికి తిరిగి వచ్చాం. ఎన్నో రోజుల తరువాత ఇంట్లో నవ్వులు వెల్లివిరిశాయి.

'నాన్న వుంటే ఎంత బావుణ్ణు' అనిపిస్తూనే వుంది నా మనసుకి.

మూడురోజులపాటు మామయ్య చాలా గాఢంగా ఆలోచిస్తూనే వున్నాడు. అప్పుడప్పుడూ అమ్మతో "నీ కూతురి మొహంలో ఒక అద్భుత కళవుంది. అదే నీకు అదృష్టాన్ని తెచ్చిపెడుతుంది" అనేవాడు.

తరువాత నాలుగోరోజు అక్కడికి దగ్గర్లో ఏదో కొండమీదున్న గ్రామదేవతకి తిరునాళ్ళు జరుగుతున్నాయని విని అమ్మతో చెప్పి తన్ను తీసుకుని బయలుదేరాడు. నా సంబరం సంబరం కాదు. స్నానం చేసి అమ్మచేత చక్కగా జడవేయించుకుని పూలు పెట్టుకుని పట్టుపావడా కట్టుకుని చెప్పులేసుకుని మామయ్యతో బయలుదేరిపోయాను.

దార్లో "కొండ ఎక్కగలవా? " అడిగాడు పెద్దమ్మామయ్య?

"ఓ! చింతచిగురు కోసం కొండకి పోయే వాళ్ళంగా మామయ్యా" అన్నాను.

"ఆ కష్టాలు నారాకతో తీరాయిలే" అన్నాడు.

ఆ వూరు దాటి కొండ ఎక్కడం ప్రారంభించాం. ఇసుకవేస్తే రాలనంతమంది "అమ్మతల్లీ! ఆదుకో చేదుకో" అంటూ కొండ ఎక్కుతున్నారు.

ఛెంగుఛెంగున ఎక్కుతోంది తను. దార్లో జనాలు, చిన్న జనాలు చిన్నచిన్న అంగళ్ళలో కావలసిన వస్తువులు, తినుబండారాలూ పిల్లలకి కొనిపెడుతోంటే పెద్దమామయ్య తనకీ బోలెడు కొనిపెట్టాడు.

అక్కడక్కడ ఓ పసుపుపూసిన రాతికి జనాలు ఆగి కొబ్బరికాయలూ, నైవేద్యాలూ సమర్పించి పోతూన్నారు. అక్కడ చిల్లరడబ్బులు వేసి పోతున్నారు.

తనూ ఆగి భక్తిగా దణ్ణం పెట్టేది.

సగం కొండ ఎక్కాక పెద్దమామయ్య తనతో "తులసీ! ఓ పని చెబ్తాను.

చేస్తావా?" నెమ్మదిగా ఆగిఆగి అన్నాడు.
"ఓ... చెప్పు మామయ్యా" అంది.
"ఇలా రా" అని పక్కకి తీసుకువెళ్ళి సంచి లోంచి అంతక్రితం కొన్న పసుపు, కుంకుమ తీసి పసుపునీళ్లల్లో కలిపి తన మొహానికి పూసి పెద్దబొట్టు పెట్టి చేతుల్నిండుగా కొత్త గాజులు వేసి "ఇలారా" అని తీసుకొచ్చి జనం వెళ్ళే బాటపక్కన బట్టపరిచి కూర్చోబెట్టాడు.
అలా మామయ్య తనతో వ్యాపారానికి నాందీ పలికాడు.
ఓ కొబ్బరికాయ తీసి తనకి కొట్టి కర్పూరం వెలిగించి నైవేద్యం ఇస్తుంటే "ఇదేంటి మామయ్యా" అనబోయింది తను.
"హుష్! వూరుకో! నువ్వు మాట్లాడకూడదు! కళ్ళు పెద్దవిచేసి చిరునవ్వు నవ్వుతుండాలి" చిన్నగా చెప్పి "అమ్మా... తల్లీ... కరుణించవా మాతా" అంటూ బిగ్గరగా ఏదేదో మాట్లాడసాగాడు.
దారివెంబడి వెళుతోన్న జనం ఆగి "ఏమిటేమిటి" అని అడగసాగారు.
"ఏముంది... ఈ పాప నా మేనకోడలు! నాతో అమ్మవారి దర్శనానికి తీసుకొస్తుండగా దార్లో అమ్మవారు ఒంటిమీదికొచ్చింది. ఇదంతా నా అదృష్టం, మా అమ్మాయి అదృష్టం" చెప్పసాగాడు వాళ్ళతో.
మామయ్య వాళ్ళతో అలా అబద్ధం ఎందుకు చెబుతున్నాడో నాకు అర్థంకాలేదు గానీ ఆ తరువాత దాన్ని గురించి ఆలోచించే అవకాశమే తనకి లేకుండాపోయింది.
"అమ్మ తల్లీ" అంటూ జనం సాగిలపడి మొక్కులు మొక్కసాగారు తనకి.
తను తత్తరపడుతోంటే పెద్దమామయ్య 'ఖంగారుపడకు' అన్నట్టు సంజ్ఞచేశాడు. జనం కొబ్బరికాయలూ, పసుపుకుంకుమ, డబ్బూ సమర్పించసాగారు. కొండమీది జనాలు కూడా ఈ సంగతి తెలిసి దిగిరాసాగారు పరుగెత్తుకుంటూ. ఆ సాయంత్రం దాకా మామయ్య తనని అక్కడే కూర్చోబెట్టి ఒక్కోసారి ఒక్కోకథని జనాల్తో చెప్పసాగాడు. ఆకలితో నకనకలాడిపోతోంది తను. అది మామయ్య పట్టించుకోలేదు. దాదాపు ఏడుగంటలప్పుడు అదంతా ముగించి తనని లేపాడు. కొండమీదనుంచి కిందకి తీసుకొస్తుంటే నీరసంతో, ఆకలితో తను సరిగా నడవలేకపోతోంటే మామయ్య కాస్సేపు ఎత్తుకున్నాడు కూడా.
కింద హోటల్లో తనకి కడుపునిండా భోజనం పెట్టించాడు. తరువాత డబ్బంతా లెక్కకట్టాడు. అయిదువేలు వచ్చింది.
"చూశావా తులసీ! మీ నాన్న ఎన్నో ఏళ్ళు కూడబెడితేగానీ ఇంత డబ్బు సంపాదించగలిగేవాడు కాడు. నువ్వు ఒక్క ఏడెనిమిది గంటల్లో అయిదువేలు సంపాదించావు. ఇక మరో అయిదారు నెలలపాటు మీరు చింతచిగురు అమ్మాల్సిన పనిలేదు" అన్నాడు.
"నిజమా మామయ్యా" ఆనందంగా అడిగింది.
"అవును... కానీ, తులసీ ఇది చాలా చిన్నమొత్తం. మనం తలచుకుంటే ఇంకా చాలా డబ్బు సంపాదించవచ్చు. నీ మొహాన దేవుడు అదృష్టగీత గీశాడు" అన్నాడు.
"కానీ, మామయ్యా! అబద్ధం చెప్పావు గదా! అబద్ధం చెప్పడం పాపం గదా? నాన్న చెప్పేవాడు" అంది తను భయంగా.
"ఆc..." అంటూ చప్పరించేశాడు. కానీ, "అమ్మలూ బాధల్లో వున్నప్పుడు చిన్న అబద్ధం చెప్పినా పాపం రాదు! అసలు దేముడు నీమీద దయతలచకపోతే ఇంత డబ్బొస్తుందా చెప్పు" అన్నాడు.
నిజమే అనిపించింది.
ఇంటికొచ్చాక అమ్మ ఈ సంగతి విని "అయ్యో! అదేం పని అన్నయ్యా? నలుగురూ ఏం అనుకుంటారు? పసిదాన్ని అలా దార్లో కూర్చోబెట్టావా?" అంటూ నొచ్చుకుంది.

"నీ మొహం! అదో ట్రయల్! అంతే. రోడ్లో కాదు. ఈసారి ఆశ్రమంలో కూర్చోబె డతాను చూడు" అని "చూడు భూదేవీ ఈ దరిద్రం వదలాలంటే ఇదేమార్గం! తులసి మొహంలో దైవాంశ కనబడుతోంది. ఈ రోజుల్లో ఇదంతా మామూలే. ఓ అయిదేళ్ళు ప్రయత్నిస్తే బోలెడు డబ్బు వెనకవేసుకో వచ్చు దీనిమీద నాకో పెద్ద ఆలోచనే వుంది. మనం ఆ తరువాత సుఖంగా బత కొచ్చు" అన్నాడు.

"కానీ, అన్నయ్యా, ఆయన వుండి వుంటే దీనికి అసలు ఒప్పుకుని వుండేవాడు కాదు" అంది.

"ఆ సెంటిమెంట్లే వద్దు" విసుగ్గా అన్నాడు పెద్దమామయ్య.

"బావకి తెలివి వుండివుంటే మీరెప్పుడో బాగుపడి వుండేవాళ్ళు! నా మాట విను. బిడ్డల్ని పస్తుల్తో చంపకు"

"తులసి పెళ్ళీడుకి రాబోతూన్నపిల్ల. దాన్ని దేవతని చేస్తే దానికి పెళ్ళవు తుందా? " అంది భయంతో.

"నిక్షేపంగా అవుతుంది. పైసాలో పర మాత్మ వున్నాడే భూదేవీ! అదంతా చూసు కునేవాడ్ని నేనున్నానుగా. నువ్వు భారం నామీద వుంచి నీ బిడ్డల్ని చూసుకో" అంటూ ఆ రాత్రంతా అమ్మకి నచ్చజెపు తూనే వున్నాడు.

కష్టాల్లో నలిగిపోయి ఉన్న అమ్మ ఆయన దారికి సులభంగానే వచ్చేసింది. ఆ తరు వాత మామయ్య వారంరోజుల్లో వస్తా నంటూ వెళ్ళిపోయాడు.

ఈలోగా అమ్మ అందరితో "మేం మా అన్నయ్యతో వూరెళ్ళిపోతున్నాం" అని చెప్పింది. పుల్లయ్య మామలాంటోళ్ళు "వెళ్ళు భూదేవమ్మా! మీ కష్టాలు ఇప్పటికైనా కడ తేరాయిలే" అన్నారు.

మామయ్య వెళ్ళిన అయిదోరోజు వూళ్ళో వాళ్ళు ఓమాట విన్నారు.

దగ్గర్లోని పేటూరు అన్న వూర్లో అడవికి దగ్గర్లో ఓ అమ్మవారు వెలుస్తోందనీ దేవుడి ఆదేశంతో ఓ పేద ఇంట్లో పుట్టిన ఆమె త్వరలో పూర్తిగా దైవాజ్ఞకి లోబడి అమ్మవా రిగా అవతారం ఎత్తబోతోందని పేపర్లో వచ్చిందనీ, అంతా చెప్పుకుంటూంటే మేమూ విన్నాం.

తరువాత ఎవరో కరపత్రాలు పంచిపో యారు. వాటిలో కూడా ఆ పేటూరమ్మ దేవతగురించే.

వారం తరువాత మామయ్య తిరిగి వచ్చాడు.

"తెల్లారే మన ప్రయాణం" అన్నాడు.

"ఎక్కడికి? " అంది అమ్మ.

"పేటూరుకు" చెప్పాడు.

"దేవత దగ్గరకా? "

"కాదు. ఆ దేవతే మన తులసి"

అమ్మ ఆశ్చర్యపోయింది. అప్పుడు చెప్పాడు మామయ్య... అక్కడ కొంత పోరంబోకు స్థలాన్ని ఆక్రమించుకుని ఇంకొంత స్థలాన్ని చాలా తక్కువ ధరలో కొని తాటాకు గడ్డితో కుటీరాల్లాంటివి వేయించి వచ్చాడట. ఆ అయిదువేలకి ఇంకో అయిదువేలు అప్పుచేశాడట. రేప ట్నుండి నేను దేవతనంట.

నాకు ఏదో ఉత్సాహంగా వున్నా, "మామయ్యా నన్ను చదివించవా? నాన్న చదువుకోమన్నాడు గదా? " ఆశగా అడి గాను.

"చదివిస్తాన్లేమ్మా" అన్నాడు.

ఇరుగూపొరుగూ దగ్గర్నుండి వీడ్కోలు తీసుకొన్న తను ఆ సాయంత్రమే పేటూ రమ్మ అవతారం ఎత్తింది. ఆరోజునుంచి ఒకరొకరుగా రాసాగిన జనం వారం తిరిగే సరికి భక్తులుగా తండోపతండాలుగా రావడం ప్రారంభించారు.

మామయ్య హుండీలు ఏర్పాటు చేశాడు.

డబ్బూ, చీరలూ, పండ్లూ, చిన్నచిన్న బంగారు వెండి కానుకలూ, మామయ్య మనుసులో ఉద్భవించిన ఈ ఆలోచన

ఎంత అద్భుతమైనదో. దాన్ని ఆయన అమల్లో పెట్టిన ముహూర్తం ఎంత బలమైనదోగానీ అది మహాద్భుతమైన ఫలితాన్ని చూపించింది.

'పేటూరమ్మ పదమూడేళ్ళలోపు బంగారు బొమ్మలాంటి అమ్మాయి' అన్న వార్త జనాన్ని అంతలా రప్పించింది.

జనాలు ఎప్పుడూ ఏదో సమస్యతో బాధ పడుతూంటారు.

అనేక సమస్యలకి పరిష్కారాలు దొరకవు.

కొందరు పరిష్కారంకోసం అసలు ప్రయత్నించరు. కాలమే వాటిని పరిష్కరిస్తుంది.

అయితే అందాకా ఆగే ఓపిక వాళ్ళకి వుండదు. అప్పుడు ఆ సమర్థత లోపించిన వాళ్ళకి ఒక అండ కావాలి.

"నీ కష్టాలు తీరిపోతాయి' అని అభయం ఇచ్చే నమ్మకం కావాలి.

ఆ నమ్మకమే దేవుడు!

శివుడుకావచ్చు, రాముడు కావచ్చు, వెంకటేశ్వరుడు కావచ్చు, ఏ కామాక్షమ్మో, పోలేరమ్మో కావచ్చు! బాబాలూ, అమ్మవార్లూ, స్వాములవార్లూ కావచ్చు.

ఇలాంటి నమ్మకంకోసమే అనేకమంది నామీద ఆధారపడ్డారు. మామయ్య ఇస్తూన్న పబ్లిసిటీ సామాన్యమైనది కాదు.

కొందరు మనుషుల్ని అదే పనిగా పెట్టి వాళ్ళచేత నా మహిమల్ని గురించి కథలు కథలుగా భక్తులకి వినిపిస్తూంటాడు.

నా జీవిత చరిత్ర అంటూ ఓ పుస్తకం అచ్చువేయించాడు.

అందులో అన్నీ అభూతకల్పనలే.

నేను భూమ్మీద పడగానే నాగేంద్రుడొచ్చి పడగపట్టాడంట.

చిన్నప్పుడు నా చెయ్యి తగిల్తే తోటి పిల్లల జబ్బులూ, గాయాలూ నయమయ్యేవంట.

నా నిరుపేద కుటుంబంలో నేను పుట్టాక ఒక్కనాడూ తిండికి ఇబ్బంది పడలేదంట.

"ఇవేం అబద్ధాలూ" అని అడిగితే, "ఇదంతా మనచేత దేవుడే చేయిస్తున్నాడు. లేకపోతే ఇంత జనాభా వచ్చేవాళ్ళా? " అంటాడు.

నెల తిరిగేసరికి కళ్ళు తిరిగేంత డబ్బు పోగయింది. అమ్మ, మామయ్యల సంబరం సంబరంకాదు.

ఇప్పుడు అమ్మ భక్తులు తెచ్చిన చీరలు రోజుకొకటి కడుతోంది. మామయ్య అమ్మచేత బొట్టుకూడా పెట్టించాడు. మామయ్య తెలివితేటలూ సమర్థతమీద అమ్మకి అపారమైన నమ్మకం ఏర్పడింది.

ఈ నెల కాలంలో మామధ్య నాన్నని గురించిన ప్రస్తావన చాలా తక్కువసార్లు వచ్చింది. అదీ అమ్మనుంచి కాదు. అసలామెకి తీరికే లేదు. కానీ, నాన్న ఇదివరకటి కంటే నా మనసుని బలంగా ఆక్రమించాడు. ఎందుకంటే కూర్చోవడం కంటే నాకు వేరే పని ఏదీ లేదుకాబట్టి. పైగా ఇంట్లో అమ్మకి సాయం చెయ్యడంకోసం మామయ్య ఓ మనిషిని పెట్టాడు. నాకు మాత్రం ఈ నెల రోజులకే రోజుకో పట్టుపావడా ధరించి బొమ్మలా కూర్చోవడంతో విసుగొస్తోంది.

'మామయ్యా! నాకు చాలా బోర్‌గా వుంది. చదువుకుంటా మామయ్యా" అనడిగింది తను.

"కొంత ఓపికపట్టమ్మా! ఇంకో నెల ఆగు! రోజులో ఓ పూటమాత్రమే నీ దర్శనం ఏర్పాటుచేద్దాం" అన్నాడు.

మరో నెల గడిచింది. ఓ పూట దర్శనం పద్ధతి అమల్లోకి వచ్చింది. రోజుకి రెండు మూడొందలమంది భక్తులకి తక్కువ రావడంలేదు. మామయ్య అడవిని ఆనుకుని వున్న ఇంకొంత స్థలాన్ని అణా కాణీ లెక్కతో కొనేశాడు. భవిష్యత్తులో పెద్దపెద్ద బిల్డింగులు కట్టాలంట.

"ఏం తెలివన్నయ్యా నీది? " అంది అమ్మ మెచ్చుకోలుగా.

మామయ్య భార్యా పిల్లలూ మెల్లిగా అక్క డికి చేరుకున్నారు.

తను పేటూరమ్మ అవతారం ఎత్తిన మూడు నెలలకిగానీ చిన్న మామయ్యకి ఈ వార్త తెలీలేదు. మమ్మల్ని ఒప్పించి వాళ్ళ వూరు తీసుకెళ్ళాలన్న ఉద్దేశ్యంతో బండి కట్టించుకుని మరీ మా వూరొచ్చాడట. అక్కడ సంగతి తెలిసిందంట. పరిగెత్తుకు వచ్చాడు.

వచ్చీరాగానే "ఇదేం ఘోరం? పసిదాన్ని ఇలా తయారుచెయ్యడానికి నీకెలా మనసొప్పింది? " అంటూ పెద్ద మామయ్యతో గొడవపడ్డాడు.

"బతకడం చేతగానివాడివి! నువ్వు చూస్తూండు తులసిని ఏ స్థాయిలో నిలబెడతానో" అన్నాడు పెద్దమామయ్య గర్వంగా.

"నిలబెట్టడం కాదు, దిగజార్చడం. నీ ధన వ్యామోహానికి పసిదాన్ని బలిపెడుతున్నావు" అని తన్ను దగ్గరికి తీసుకుని "ఇదేంట్రా తల్లీ. నిశ్చింతగా బడికిపోయి చదువుకోవాల్సినదానివి" అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు.

ఆయన అంతగా ఎందుకు బాధపడుతున్నాడో అప్పట్లో తనకి అర్థంకాలేదు గానీ "పెద్దమామయ్య నన్ను చదివిస్తానన్నాడు మామయ్యా! మాకు చాలా డబ్బు వస్తోంది" సంతోషంగా చెప్పింది.

"పిచ్చి తల్లీ! ఇది పాపపు డబ్బు. చిన్నదానివి. నీకిప్పుడు అర్థంకాదు. ఎలా వాడిచేతుల్లోంచి నిన్ను విడిపించడం? " అంటూ వాపోయాడు.

"అది నీచేత కాదుగానీ వూరెళ్ళి పొలందున్నుకో" వ్యంగ్యంగా అన్నాడు పెద్దమామయ్య.

"అక్కా! నీకయినా బుద్ధిలేదా. బావ ఎంత నిజాయితీగా బతికాడో అప్పుడే మర్చిపోతావా? నీ ఈ పనికి ఆయన ఆత్మ క్షోభించదా? " అని అడిగాడు.

అమ్మ నిస్సహాయంగా "ఏం చెయ్యన్రా నారాయణా బిడ్డల్ని పస్తులుంచేదా? " అంది.

"సరే... అయిందేదో అయింది. నాతో రండి! నా రెక్కల కష్టంతో మిమ్మల్ని పోషించలేనా? " అన్నాడు.

ఈ మాటని అమ్మ వినీవిననట్టుండిపోవడంతో పెద్దమామయ్య హేళనగా నవ్వాడు.

చిన్న మామయ్య హతాశుడై తిరుగు ముఖం పట్టాడు. అప్పులు తీర్చుకోమంటూ పెద్ద మామయ్య చిన్నమామయ్యకి కొంత మొత్తం డబ్బు ఇవ్వబోగా "పాపిష్టి సొత్తు నాకొద్దు" అని తిరస్కరించాడు.

అప్పుడు తగిలింది పెద్దమామయ్య అహంకారానికి తొలిదెబ్బ!

"నిన్నాభగవంతుడే రక్షించాలి తులసమ్మా" అంటూ చిన్నమామయ్య వెళ్ళిపోయాడు.

ఆ తరువాత కొన్నేళ్ళకిగానీ తనకా మాటలకి అర్థంతెలీలేదు.

రోజులు గిర్రున తిరిగిపోతూన్నాయి. పేటూరమ్మగా తన ప్రశస్తి శాఖోపశాఖలుగా వర్ధిల్లింది. బంధువులమంటూ ఎందరెందరో వచ్చి అమ్మ ప్రాపకం కోసం పాకులాడడం ప్రారంభించారు. వాళ్ళల్లో అత్త... నాన్న చెల్లెలు కూడా వుంది. గతాన్ని మర్చి అమ్మ ఆవిడ్ని అక్కున చేర్చుకున్నా తను మాత్రం క్షమించలేకపోయింది.

అయితే ఈలోగా మామయ్యమీద తనకి వున్న అభిమానం, నమ్మకం దెబ్బతిని ఆయనపట్ల అపనమ్మకం, భయం, ఏహ్యత కలిగే సంఘటనలు రెండు జరిగాయి.

మొదటిది తొలి మూడునెలల్లోనే. పేటూరుకి అరవై కిలోమీటర్లలోనే ఓ పెద్ద నగరం వుంది. అందుకే పెద్దమామయ్య ఆశ్రమం కోసం ఆ స్థలాన్ని ఎంచుకుంది. ఆ వూళ్ళో సర్కస్ ఆడుతోందని తెలిసి అత్తయ్య, అమ్మ, తమ్ముడూ, చెల్లెలూ ప్రయాణం అవుతోంటే తనూ ఉబలాటపడింది. చిన్నతనం

నుండి తనకి సర్కస్ అంటే ప్రాణం! రకరకాల జంతువులుంటాయి! చిన్నప్పుడెప్పుడో ఓసారి నాన్న చూపించాడట! అది సరిగా గుర్తులేదు.

"నేనూ వస్తానమ్మా" అంటే అమ్మ "మామయ్యనడుగు" అంటూ తప్పించుకుంది! అంతక్రితం సినిమాలకి కూడా మామయ్య తనని పంపలేదు. టి.వి. తెచ్చి పెట్టాడు ఇంట్లో! అయినా కోరికని అణచుకోలేక మామయ్యని అడిగింది.

"నువ్వు సర్కస్‌లకీ, సినిమాలకీ వెళ్ళకూడదు తులసీ! నువ్విప్పుడు మామూలు మనిషిని కావు! జనం దేవతగా చూస్తున్నారు నిన్ను. అందరు అలగావాళ్ళతో నువ్వూ బస్సెక్కి సర్కస్‌కి పోవడం చాలా అసహ్యంగా వుంటుంది" చెప్పాడు.

"నాకు సర్కస్ అన్నా బస్సెక్కిపోవడం అన్నా చాలా ఇష్టం పెద్దమామయ్యా" దీనంగా అంది.

"సర్కస్ నీకు చూపిస్తాను. ఇప్పుడు కాదు! కాస్త ఓపికపట్టు. కొద్దిరోజుల తరువాత మనం కారుకొంటాం. అందులో దూరంగా ఎక్కడికో ఎవరూ నిన్నూ గుర్తుపట్టనిచోట చూపిస్తాను! ఇప్పుడు నువ్వు వెళ్ళకూడదు" ఖచ్చితంగా చెప్పాడు.

తను హతాశురాలైంది. తనతో ఎప్పుడూ లాలనగా బుజ్జగిస్తూ ప్రేమగా మాట్లాడే పెద్దమామయ్యేనా ఇట్లా మాట్లాడింది.

తను బాధపడుతోందని అమ్మ తను వెళ్ళడం మానుకోబోతే "నువ్వెళ్ళాలి భూదేవీ. అది ఇలాంటి వాటికి అలవాటుపడాలి. తను అందరిలాంటి సాదాసీదా మనిషి కాదన్న సంగతి దానికి అర్థంకావాలి. నువ్వు పిల్లల్ని తీసుకుని వెళ్ళు" అంటూ అమ్మని, పిల్లల్ని, అత్తావాళ్ళతో పంపాడు.

తనకి భరించరానంత దుఃఖం వచ్చింది. నాన్న గుర్తొచ్చాడు. ఆ తరువాత అమ్మ మొహమాటంగా తనకి కాస్త దూరంగా తప్పించుకుంటున్నట్టు తిరిగింది. మామయ్య పట్ల కోపం, వ్యతిరేకత మొదటిసారి తలెత్తాయి.

ఆ తరువాత మరో మూడు నెలలకి జరిగిందో సంఘటన.

రోజులు గడుస్తున్నా మామయ్య తన చదువు సంగతి ఎత్తకపోవడంతో తను రోజూ గుర్తుచేస్తూనే వుండేది.

చివరికోరోజు గట్టిగా "మామయ్యా! నా చదువు గురించి నువ్వు పట్టించుకోవడం లేదు. నేనిక చదువుకుంటాను" అంది.

అప్పుడాయన తనకి ఎదురుగా కూర్చుని "చూడు తులసీ! ఇన్నిరోజులు నువ్వు బాధపడతావని చెప్పలేదు. నువ్వు అమ్మవారివి! ఈ చదువులూ వీటన్నింటికీ అతీతురాలివి. దేవతలకి చదువు అవసరం ఏమిటి? " అన్నాడు.

తను తెల్లబోయి "నేను దేవతను కాదుగదా మామయ్యా" అంది.

"అది జనాలకి తెలీదుగదా! నువ్వు చదవడం బయటికెళ్ళి పరీక్షలు రాయడం ఇదంతా జనానికి నీపట్ల అపనమ్మకం, అనుమానం కలిగేలా చేస్తాయి. కాబట్టి నువ్వు చదువు సంగతి మర్చిపో! కావాలంటే పుస్తకాలు తెచ్చిస్తాను. కథలూ, నవలలూ చదువుకో. ఇక ఎప్పుడూ చదువు సంగతి ఎత్తకు" చెప్పాడు.

నిర్ఘాంతపోయింది. మామయ్య మాటంటే మాటే! తనకి ఇక చదువు ఆశ లేదు. తనని ఇంతకాలం మభ్యపెట్టాడు. రెండు రాత్రుళ్ళు రెండు పగళ్ళూ ఏడ్చింది. మామయ్య కరగలేదు. అమ్మ కూడా తనని ఓదార్చలేదు. ఆమెని మామయ్య తనదగ్గరికి రానీలేదు. అమ్మ, చెల్లాయీ తమ్ముడూ దూరం అయిపోతూన్న ఫీలింగ్ తనలో!

ఆ తరువాత ఇలాంటి సంఘటనలు కోకొల్లలు.

తను ఆశ్రమంలో ఒక బందీ. ఆశ్రమం తనకో ఖైదు. ఇది అర్థమైంది క్రమేపీ.

అయితే తనకి ఇంగ్లీషు, హిందీ, తమిళం, కన్నడం, మళయాళం, ఉర్దూ ఈ ఆరు భాషల్ని నేర్పడానికి మామయ్య ట్యూటర్లని పెట్టాడు. మూడేళ్ళు తిరిగేసరికి తను అన ర్గళంగా ఈ ఆరుభాషలూ మాట్లాడడం, చదవడం, రాయడం నేర్చుకుంది.

ఈ మూడేళ్ళలో ఎన్నో మార్పులూ అభి వృద్ధీ. తన భక్తుల్లో అన్ని భాషల, ప్రాంతాల, మతాలవారూ, విదేశీయులూ చేరారు. ఆశ్రమానికి అరడజను వాహ నాలూ, ఆరు బిల్డింగులూ, సమకూరాయి.

పేటూరులో మూడొంతులు మామయ్య ఆక్రమించుకున్నాడు. ఆశ్రమంలో ఎందరో ఉద్యోగులూ, నౌఖర్లూ చేరారు.

తన సేవకోసం ప్రత్యేకం నర్సయ్య అనే వృద్ధుడు.

మామకి పి. య్యేలూ, సెక్రటరీలూ వచ్చారు.

రాజకీయ నాయకులూ, డాక్టర్లూ, యాక్టర్లూ, సైంటిస్ట్‌లూ తన భక్తవర్గంలో చేరారు.



మీదికి వస్తున్న వయసు తనని అద్భు తంగా తయారుచేసింది. మామయ్య తమ్ముడు రాజుని తన భార్యా పిల్లల్తో అమె రికా పంపాడు చదువుకోసం.

ఈ మూడేళ్లలో తల్లితో, తోబుట్టువుల్తో తనకి మానసికమైన దూరం బాగా పెరు గుతూ వచ్చింది. వాళ్లు క్రమక్రమంగా తన దగ్గరికి రావడం, 'అక్కా' అని పిలవడం తగ్గి పోయింది.

అమ్మ కూడా ఇదివరకులా ప్రేమగా, చనువుగా తులసీ అనలేకపోతోంది. తన పట్ల ఆమెకు తల్లి ప్రేమకు బదులు ఏదో సంకోచం ఇంకేదో ప్రత్యేకమైన భావం కన బడుతూ వచ్చాయి. 'తులసమ్మా' అంటుంది ఎప్పుడైనా! అమ్మలో ఒక అపరాధ భావం కూడా కనపడీ, కనపడకుండా వుంది!

అయితే నాన్న గురించిన ప్రస్తావన అమ్మ నుంచి రావడం మానేయడమేగాక తను ప్రస్తావిస్తే ఏదో పనివున్నట్టుగా తప్పు కుపోతోంది. నాన్నతో చేసిన పదిహేడు సంవత్సరాల కాపురాన్నీ, అన్యోన్య దాంప త్యాన్ని, ఆయన ప్రేమని అమ్మ అంత తొందరగా మర్చిపోగలిగిందా? కానీ ఈ ఒంటరితనపు అలమటింపులో నాన్న తన కొక అండ, తోడూ అయ్యాడు. ఆయన భౌతికంగా మరణించినా తన మనసులోనే వుండి ఓదార్పునిస్తున్నాడు. తన పేరు ప్రతి ష్ఠలూ, ఆదాయం, ఐశ్వర్యం కుప్పలుతిప్ప లుగా పెరిగిపోయేకొద్దీ తను మరీ ఒంటరి దైపోతూ వచ్చింది. తననితనుగా గుర్తించేది చిన్నమామయ్య ఒక్కడే! ఆయన పుట్టిం చిందే తనలో మరోలాంటి ఆలోచన...

ఒకసారి చిన్న మామయ్య తనతో అన్నాడు...

"నిన్ను చదువుకీ మామూలు జీవితానికీ దూరం చేశాడు. నిన్నొక దేవతని చేసి పంజరంలో పెట్టాడు. నీకిప్పుడు పదిహేడే ళ్లొచ్చాయి తులసీ! ఈ నాలుగేళ్ల పిచ్చి సంపాదనతో వాడికి తృప్తితీరలేదా? బోలెడు గడించాడు ఇప్పటికే. ఇకనైనా నిన్ను ఒక ఇంటిదాన్ని చేసే ఆలోచన వుందోలేదో వాడిని అడుగుతాను" అని వెళ్లాడు.

ఆయనకి పెద్ద మామయ్య ఏం చెప్పాడో గానీ చిన్నమామయ్య మళ్లీ కనబడకుండ వెళ్లిపోయాడు. ఏడాదిపాటు కనిపించలేదు. మామయ్య రేకెత్తించిన ఆశ తనలో చివుళ్లు వేసి మొగ్గలు తొడగసాగింది. పోనీ చదువు లేకపోతేపోయింది. కనీసం పెళ్లిచేసుకుని అందరాడవాళ్లలా భర్తతో, పిల్లల్తో సుఖంగా స్వేచ్ఛగా బతకగలిగితే చాలు. ఇదే ఆలో చన మనసులో మధురంగా మోగుతుండేది! ఇదెలా పైకి చెప్పాలో ఎవరికి చెప్పాలో తెలి సేదికాదు. ఏడాది తిరిగేసరికి అది ఇంతిం తయి వటుడింతయి అన్నట్టు మనసుని నిలువెల్లా ఆక్రమించింది. అమ్మతో చెబితే? లాభంలేదు! ఆమె చెయ్యగలిగిందేంలేదు. పెద్ద మామయ్యనే అడగాలి. తన దగ్గరికి వచ్చే భక్తుల్లో జంటల్ని తదేకంగా గమని స్తుండేది. ఆదరంగా చూసేది వాళ్లపట్ల.

ఇంతలో చిన్నమామయ్య వచ్చాడు. ఆయన ఆ మాటే ఎత్తలేదు. తను ఉండబ ట్టలేక "మామయ్యా! పెద్దమామయ్యని నా పెళ్లి గురించి అడిగావా? ఏమన్నాడు? " అని అడిగేసింది.

చిన్నమామయ్య తనవైపు చూశాడు. ఆ చూపులో జాలి. బలవంతపు నవ్వు నవ్వాడు.

"వాడిని నేను అడిగితే ఏం బావుంటుం దమ్మా? " అన్నాడు.

తరువాత అక్కడినుండి వెళ్లిపోయాడు. దాన్ని పొడిగించలేదు. మరో వారంపాటు మనసులో తర్జన భర్జనపడి పెద్దమామ య్యనే అడిగేసింది.

"పెద్దమామయ్యా! నాకు పెళ్లిచేసుకోవా లని వుంది. భర్తా బిడ్డల్తో సుఖంగా బతకా లని వుంది. ఈ జీవితం చాలా బోర్‌గా అనిపిస్తోంది మామయ్యా!" అని అడిగింది చాలాచాలా ఆశగా.

తన మాట విని పెద్దమామయ్య నవ్వాడు. ఆ నవ్వులో మృదుత్వం ఎంతో వుంది. తనవైపు ఆప్యాయంగా చూశాడు.

"నేను కాదంటానా అమ్మా నీ కోరికను. ప్రతి ఆడపిల్ల మనసు కోరుకునేదేగా ఇది. నాకూ ఆ ఉద్దేశ్యం వుందమ్మా! నేనే నీతో ప్రస్తావించాలనుకుంటూనే వున్నాను" చెప్పాడు.

తన కళ్లల్లో కోటి దీపాలు వెలిగాయి.

"నిజంగానా మామయ్యా!" ఆనందంపట్ట లేక ఆరేళ్లపాపలా అడిగింది.

"నిజం కానిదేం వుంది తులసీ. నీకు వయసొస్తోందిగదా? అయితే నువ్వింకా చిన్నపిల్లవే. నీకింకా మైనారిటీ తీరలేదు. మరో రెండేళ్లుపోనీ. తప్పక నీ పెళ్లి జరిపి స్తాను" చెప్పాడు.

"సంతోషంగా ఆ రోజుకోసం ఎదురుచూ స్తాను మామయ్యా" సంబరంగా అందామె.

"నీకోసం నేను వరుణ్ణి కూడా చూసి సిద్ధంచేసి వుంచానని నువ్వు వూహించగ లవా తులసీ!" అడిగాడు మామయ్య.

"నాకోసం వరుణ్ణి చూశావా? ఎవరు మామయ్యా అతను? " ఆత్రంగా అడిగింది.

"అనంత్" చెప్పాడు.

"అనంతా? "

"అవునమ్మా! మన అనంత్" చెప్పాడు.

"నీ సెక్రటరీ అనంత్" నమ్మలేనట్టు అడి గింది.

మామయ్య నవ్వి "నా సెక్రటరీ ఏమి టమ్మా? అతడసలు నీ సెక్రటరీ. అయితే చిన్నపిల్లవి నీకు వ్యవహార జ్ఞానం ఏముం టుంది? ఇన్ని బాధ్యతలు ఎలా నిభాయిం చుకు రాగలవు? అందుకోసం అతడు నాకు సహకరిస్తూ వస్తున్నాడు కాబట్టి అంతా నా సెక్రటరీగా వ్యవహరిస్తున్నారు. ఏమ్మా.. అనంత్ నీకు తగిన వాడు కాదంటావా? " అడిగాడు.

అంత హఠాత్తుగా అడిగేసరికి ఏం చెప్పాలో అర్థంకాక "నాకేం తెలుసు మామయ్యా" అందామె.

"నిజంగా చాలా మంచివాడమ్మా! తెలివై

నవాడు, బుద్ధిమంతుడు, నమ్మకస్థుడు. ఎం.బి.ఏ చదివాడు. చదువుకున్న భర్తవస్తే నీకు చదువులేదన్న లోటు కూడా నీకు తెలీదు. అతడన్ని విధాలా నీకు తగిన వాడు. ఎంత సమర్థుడు కాకపోతే నేను అతడికి పదివేల రూపాయల జీతం ఇస్తున్నాను? " అన్నాడు.

తులసి అతడి మాటలు వింటోంది.

"రేపు మీ పెళ్లయ్యాక ఈ వ్యవహారాలన్నీ అతడికి అప్పగించేసి నేను కృష్ణారామా అనుకుంటాను" చెప్పాడు శ్రీనివాసరావు.

"మామయ్యా... అతడితో ఈ విషయం..." సందేహంగా అంది.

"ఇంకా అనలేదమ్మా! ఎందుకంటే మొదట నీతో చెప్పి నీకు ఇష్టమోకాదో తెలుసుకోవాలిగదా! ముందుగా అతడితో చెప్పాక నీకు నచ్చకపోతే అతడి మనసు నొచ్చుకుంటుందిగదా? ఏమంటావు? "

"నిజమే మామయ్యా!"

"ఏమ్మా అనంత్ నీకు నచ్చినట్టేనా? మనిషి కూడా బావుంటాడు" పొడిగించాడా సంభాషణని.

జీవితంలో తొలిసారి సిగ్గులాంటి అనుభూతికి లోనయింది తులసి. నిజంగా అనంత్ బావుంటాడు. ఎర్రగ పొడవుగా ఎత్తుకి తగిన బరువుతో మనిషిలో ఓ





హుందాతనం వుంటుంది. చాలా చురుకైన వాడు. ఆమె మొహంలో ఆనందాన్ని గమనించి సంతృప్తిపడి "వస్తానమ్మా! అనంత్‌తో కూడా ఓ మాట అంటాను" అంటూ వెళ్లిపోయాడు.

ఆమె మనసు గాలిలో తేలిపోతోంది. అక్కడ అనంత్ అనేకాదు అనంత్‌స్థానంలో ఎవరున్నా ఆమెకి అభ్యంతరంలేదు. ఎందుకంటే ఆమె తన మామయ్యకి అసలు తనకి పెళ్లి చేసే ఉద్దేశ్యమే మనసులో వుందో లేదోనని భయపడుతుండేది. దాంతో అతడు ఒప్పుకోవడమే గొప్ప సంగతయింది. అనంత్‌కీ ఏలోటూ లేదు. రెండోరోజు అనంత్ తనని చూసి చిన్నగా నవ్వడంతో సిగ్గుపడింది. అది మొదలు భర్తా ఇల్లూ పిల్లలూ గురించి కలలు కనడం. ఆమె వూహల్లో అనంత్‌కంటే భర్త అనే వ్యక్తికి విలువ అధికంగా వుండేది.

ఆమె ఆ ఆనందంలో తన తల్లితో "అమ్మా! మామయ్య నా పెళ్లి అనంత్‌తో జరిపిస్తానన్నాడు" చెప్పింది.

"సంతోషం తులసమ్మా" అంటూ తల్లి తప్పుకుపోయింది.

ఆమె అలా ఎందుకు వెళ్లిపోయిందీ అని తులసి ఆలోచించలేదు. ఈ సంగతి ఆమె తన చిన్నమామయ్యకి తెలియజేసింది ఉత్తరంద్వారా. ఆయన్నుండి తిరిగి జవాబు రాకపోయినా పట్టించుకోలేదు. అలా ఒకటిన్నర సంవత్సరంపాటు ఆమె కలల్లో తేలిపోయింది తప్ప నిజంగా మామయ్య తన మాట నిలబెట్టుకుంటాడా? అన్న సందేహం కూడా ఆమెకి రాలేదు. అయితే అనంత్‌తో తన వివాహం నిశ్చయం అయింది అన్న వూహ ఆమె మనసులో ప్రవేశించాక ఎటువంటి పరిస్థితుల్లోనూ అనంత్ ఆమెతో ఒంటరిగా కలిసే, కనీసం మాట్లాడే అవకాశం కూడా దొరక్కుండా శ్రీనివాసరావు జాగ్రత్తపడ్డాడు.

తులసి ఆలోచన, కోరిక కేవలం పెళ్లే తప్ప ప్రేమాయణంకాదు కాబట్టి అసలీ సంగతి గ్రహించనేలేదు. ఈ ఒకటిన్నర సంవత్సరంలో ఆమె ప్రాభవం మరింత పెరిగి ఆశ్రమ సంస్థలు బయటికి విస్తరించడం, భారతదేశపు అమ్మవార్లూ, బాబాల్లో ఆమెకో ప్రత్యేకస్థానం ఏర్పడడం జరిగిపోయింది. ఈ లోపులో ఆమె మామయ్య ఆమెకంటే ఓ ఏడాది మాత్రమే పెద్దదైన తన కూతురి పెళ్లి అమెరికాలో వున్న ఓ మిలియనీర్ అయిన బిజినెస్ మాన్‌తో జరిపించాడు. ఆ పెళ్లి అమెరికాలోనే హిందూ సాంప్రదాయపద్ధతిలో వైభవోపేతంగా జరిగింది. ఆ పెళ్లికి తులసి కూడా హాజరైంది. బంధువులా కాదు. పేటూరమ్మగా అక్కడ ఆమెను పాపులర్ చేసే ఉద్దేశంతోనే శ్రీనివాసరావు తన కూతురి పెళ్లిని అక్కడ ఏర్పాటు చేశాడు. ఆ సందర్భంలో అనేకమంది అమెరికన్ ధనికులూ, తెలుగువాళ్లూ, భారతీయులూ, ఆమె భక్తకోటిలో చేరి తరించారు. శ్రీనివాసరావు, అనంత్ కష్టపడి సంచుల్ని పోగుచేశారు. ఆ పెళ్లి తరువాత ఆమె తన పెళ్లి గురించి కలలు కనడం జాస్తయింది.

మరో ఆరు నెలలు గడిచాయి. ఆమె తన మేనమామని తన పెళ్లి గురించి కదిలించాలనుకుంది. ఆమెకి ఇరవై ఏళ్లొచ్చాయి అప్పటికి.

శ్రీనివాసరావు ఆసుపత్రి నిర్మాణంలో తలమునకలై వున్నాడు. ఇంకా ఆశ్రమం ఆవరణలోనేగాక బయట పేటూరులో మెడికల్, ఇంజనీరింగ్ కాలేజీల, షాపింగ్ కాంప్లెక్స్‌ల నిర్మాణం జరుగుతోంది.

ఆమె మెల్లగా అతడిని తన పెళ్లి గురించి కదిలించింది.

"నేనూ అదే ఆలోచనలో వున్నాను. ఈ నిర్మాణాలు పూర్తికానీ" అన్నాడు.

ఆమె ఓపిక పట్టింది. మరో ఆర్నెల్లు గడిచాయి. నిర్మాణాలు దాదాపుగా పూర్తి కావచ్చాయి. ఇలాంటి సమయంలో అనంత్

హఠాత్తుగా పదీ పదిహేను రోజులు కని పించకుండా పోయాడు అతడిని గురించి మేనమామని అడిగింది.

"తన చెల్లెలి పెళ్లి సంబంధాలకోసం తిరుగుతున్నాడమ్మా" అన్నాడతడు.

ఆమె నమ్మింది. అతడి చెల్లెలి పెళ్లి జరిగితే ఇక మిగిలింది తమ పెళ్లేనని మురిసింది. ఓ రోజు తన తల్లీ చెల్లెలూతోసహా తమ ప్రత్యేక భవంతిలోకి ఉద్యోగులూ నౌఖర్లూ చాకర్లూ అంతా ఎక్కడికో బయలుదేరి వెళ్లడం భవనం నిశ్శబ్దంగా వుండడం కూడా గమనించింది.

ఆ సాయంత్రం నరసయ్యని అడిగింది "అంతా ఎక్కడికి వెళ్లారు నరసయ్యా" అని.

"నేను మా తమ్ముడింటికి పోయానమ్మా! మిగతా వాళ్ల సంగతి నాకు తెలీదు" అంటూ ఏదో పని వున్నట్టు అక్కడినుండి వెళ్లిపోయాడు ఆ వృద్ధుడు.

అతడి మొహంలో కదిలిన బాధాకరమైన భావాన్ని ఆ అమాయకురాలు పసిగట్టలేదు. మరో పదిరోజుల తరువాత అనంత్ వచ్చాడు. అతడిని చూసి ఆమె చిరునవ్వు నవ్వింది. అతడూ నవ్వాడు.

ఆ మర్నాడు ఆమె నర్సయ్యతో ఏదో మాట్లాడుతోంది. ఆమె అక్కడ కొంతయినా మనసు విప్పి మాట్లాడేదీ మంచిచెడ్డలు విచారించేదీ ఒక్క నర్సయ్యతోనే. అతడి తమ్ముడు కొడుకు అనారోగ్యం గురించి చెబుతున్నాడు బాధగా.

"అంత జబ్బుచేసిందా? ఎప్పుడూ? నాకు చెప్పలేదే" అందామె.

"అనంత్‌బాబు పెళ్లి జరిగిన ముందురోజే నమ్మా" అన్నాడతడు.

ఈ మాటతో ఆమె నెత్తిమీద పిడుగు పడినట్టే అయింది.

"అ.. అనంత్... పె... పెళ్లా?" అంది నత్తినత్తిగా.

మాటతూలిన నర్సయ్య దాదాపు ఆమె కాళ్లు పట్టుకున్నంత పని చేశాడు "అమ్మా! నోరుజారింది. ఎటువంటి పరిస్థితుల్లోనూ ఈ సంగతి మీకు తెలీనీకూడదని మామయ్యగారి ఆర్డరు. ఇప్పుడీ సంగతి తెలిస్తే నన్ను నిలువునా నరికేస్తారు" అంటూ ఆ ముసలివాడు పిల్లిపిల్లలా గజగజ వణికాడు.

శిలావిగ్రహంలా బిగుసుకుపోయిన ఆమె నెమ్మదిగా తేరుకుంది.

"నేను చెప్పను. నువ్వు భయపడకులే తాతా" అంది.

"బతుకుజీవుడా" అనుకుంటూ వెళ్లిపోయాడు నర్సయ్య.

అనంత్ పెళ్లయిపోయింది. దాదాపు నెల క్రితం.

అది జరిగాక కూడా అతడితో పెళ్లి గురించి మేనమామ తనతో ప్రస్తావించాడు.

తనను మభ్యపెట్టడం తప్ప తనకసలు పెళ్లి చేసే ఉద్దేశ్యం అతడికి లేదు. బహుశా ఎప్పటికీ వుండదు. అసలెంత పిచ్చిది తను? గొర్రె కసాయివాడ్ని నమ్మినట్టు అతడ్ని నమ్మింది. బంగారు గుడ్లు పెట్టే బాతులాంటి తనని అతడు వదిలిపెడతాడా?

ఆమెకి ఎందుకనో దుఃఖం రాలేదు. మనసు మొద్దుబారిపోయినట్టు అయింది. నెల జరిగిపోయింది. ఈ నెలలో మానసికంగా ఆమె ఎంత కృంగిపోయిందో ఎవరికీ తెలీదు.

కనీసం తన కన్నతల్లీ చెల్లెలూ తనతో మాట మాత్రంగా అనకపోవడం ఆమెను విపరీతంగా బాధించింది. హాస్పిటల్ ప్రారంభోత్సవం గురించి ఆమెతో మాట్లాడడానికి వచ్చాడు శ్రీనివాసరావు ఆరోజు

ఆ మాటలయ్యాక "పెళ్లి ఇంకో రెండేళ్ళు వాయిదా వేద్దాం అంటున్నాడమ్మా అనంత్! ఇంకా కొన్ని విరాళాలు పోగవుతున్నాయి గదా" అన్నాడామెతో.

ఆమె నవ్వి "మరో రెండేళ్ళ తరువాత అయితే నన్ను రెండో భార్యగా స్వీకరించడా

నికైనా అనంత్‌కి అభ్యంతరం లేదని నన్ను నమ్మమంటావా మామయ్యా? "అడిగింది.

శ్రీనివాసరావు షాక్ తిన్నాడు ఈమాటలకు.

"ఎందుకు మామయ్యా! నన్ను ఇంకా మభ్యపెడతావు? " అంటూ అప్పుడేడ్చిందామె!

నెలరోజులుగా కరుడుగట్టిన దుఃఖం, వ్యధ, బాధా బయటికి వచ్చాయి. ఆమె దుఃఖంలో తనకి పెళ్ళి కాలేదన్న బాధకంటే తను వంచింపబడ్డానన్న బాధే ఎక్కువగా వుంది!

"నీకెవరు చెప్పారమ్మా ఇదంతా? "

"రెండు నెలలక్రితం పెళ్ళికిముందే అతడి పెళ్ళి పత్రిక చూశాను మామయ్యా నీగదిలో" అంత బాధలోనూ ఓ అబద్ధం ఆడింది.

"నేనేం చేసేది తల్లీ? నిజం నీకెలా చెప్పాలో నాకు అర్థంకాలేదు. అనంత్ ముందు మనల్ని నమ్మించి తరువాత కాదన్నాడు. అమ్మవార్ని చేసుకునే ధైర్యం సాహసం, తనకి లేవన్నాడు. అతడికి నచ్చజెప్పడానికి ప్రయత్నించి ఓడిపోయాను. అతడ్ని మనం శాసించలేం గదా? నీకీ విషయం చెప్పడానికి నాకు ధైర్యం చాల్లేదు తులసీ".

అతడు తేనెపూసిన కత్తిలా మాట్లాడుతున్నాడు. " అసలతడిని ఉద్యోగంలోంచి తీసేయాలనుకుంటున్నాను"

ఆమె మాట్లాడలేదు. వేటగాడి బాణం తగిలీ మృత్యువునుండి వెంట్రుకవాసిలో బయటపడిన నెమలిలా సోలి పోయి కుళ్ళి కుళ్ళి ఏడుస్తోంది.

"ఇప్పుడేం మునిగిపోయిందిలేమ్మా! నీకో బంగారంలాంటి సంబంధం చూసి చేసే బాధ్యత నాది"

"వచ్చే జన్మలోనా మామయ్యా? "

"ఛ...ఛ... అదేం మాటమ్మా? నన్ను నమ్మవా? " నిష్ఠూరంగా అన్నాడు.

"నాకు మనుషులమీదే నమ్మకం పోతోంది మామయ్యా" అందామె.

"పిచ్చితల్లీ! నన్ను నమ్ము" అంటూ లేచాడతడు.

"మామయ్యా" అందామె.

వెళుతున్న వాడు ఆగి ఏమిటన్నట్టు చూశాడు.

"నాకు ఒకవేళ నువ్వు పెళ్ళి చేయకపోయినా ఫరవాలేదుగానీ ఆ అనంత్‌ని మాత్రం పంపేయ్" అంది.

అతడాగి "నా ఉద్దేశ్యం అదేనమ్మా! ఒక్క మాట... అతడికి నీమీద ప్రేమ ఉందమ్మా! పెళ్ళికి భయపడ్డాడుగానీ నీతో మాట్లాడాలని... "

"మామయ్యా" ఆమె శివంగిలా లేస్తూ అరిచింది. "నువ్వెంత నీచంగా మాట్లాడుతున్నావు? నీలో మనిషివికాని దుర్గుణాలతో నీచత్వంతో ఇంకోమనిషి వున్నాడని నాకు చాలా ఆలస్యంగా అర్థమైంది. నాలో అమ్మవార్ని చూసేమనిషి పెళ్ళి చేసుకునే సాహసం లేనివాడు నన్ను ప్రేమిస్తున్నాడా? అంటే... నన్ను... అతడి ఉంపుడు గత్తెగా వుండమంటావా? "

"శివ శివ! ఎంతమాటన్నావు? నేనంత నీచుడ్నా? " రెండు చెవులూ మూసుకున్నాడు శ్రీనివాసరావు.

"దయచేసి వెంటనే ఇక్కడినుంచి వెళ్ళిపో మామయ్యా" ఎప్పుడూ అంతలేసి మాటలు మాట్లాడి ఎరగని మేనకోడలి మానసిక పరిస్థితినీ, దానికి మూలమైన తన తొందరపాటు కాస్త చింతకి గురిచేయగా ఆమెని అక్కడ ఒంటరిగా వదిలి తను వెళ్ళిపోవడం మంచిదనిపించి కదలబోయాడు.

"ఆగు మామయ్యా" అంది తులసి.

అతడాగాడు.

"నాపెళ్ళి గురించి నువ్వు మర్చిపోయినా నాకు బాధలేదు గానీ భవిష్యత్తులో ఎప్పుడైనా 'నీకోరిక తీర్చడానికి రహస్యంగా నేనే

నీమెడలో తాళి కడతాను' అని మాత్రం నువ్వెప్పుడూ అనకు మామయ్యా! ఎందు కంటే నా పెళ్ళి కోరిక ఎంత గాఢమైనదైనా నేను నిన్ను నా తండ్రితో సమానంగా భావి స్తున్నాను" అంది.

దిమ్మెరపోయిన శ్రీనివాసరావు "తులసీ" అన్నాడు పాలిపోయిన మొహంతో.

"నువ్వెంతకన్నా సమర్థుడివన్న భయమూ అంత సులభంగా నన్ను వదు లుకోవు అన్న నిస్పృహ కలిసి నాకీ అను మానాన్ని తెప్పించాయి. ముందు జాగ్ర త్తగా చెప్పాను. ఇక నువ్వు వెళ్ళు మామయ్యా" అంది.

శ్రీనివాసరావు వెళ్ళిపోయాడు. అక్కడి నుండి ఆమె తనవాళ్ళతో కూడా మాటలు బాగా తగ్గించేసి పూర్తిగా దూరం పెంచు కుంది. మేనమామ తనపెళ్ళి చేస్తాడు అన్న నమ్మకం ఏకోశానా లేకపోయినా, పెళ్ళి, భర్త, పిల్లలు అన్న కోరిక మాత్రం ఆమెలో నశించనే లేదు. ఆ ఆశ మిణుకు మిణుకు మంటూ కలల్లో కదలాడుతూనేవుంది. శ్రీనివాసరావు అనంత్‌ని ఓ ఆర్నెల్లపాటు దూరంగా పంపి మళ్ళీ "సమర్థుడైన వాడ్ని వదులుకోవడం మూలంగా వ్యవహారాలు కుంటుబడుతున్నాయి" అన్న సాకుతో తిరిగి పిలిపించాడు.

అనంత్ భార్య కూడా ఇక్కడికి వస్తుం టుంది. ఆమె తన తల్లికీ చెల్లెలికీ మంచి స్నేహితురాలు. ఆప్తురాలు. తన గురించి భార్యతో అనంత్ ఎంత హాస్యాస్పదంగా మాట్లాడివుంటాడోనన్న ఆలోచన వస్తేనే మనసు చచ్చిపోతున్నట్టవుతుంది.

ఆ తరువాత రెండేళ్ళకి ఆమెకంటే ఆరేళ్ళు చిన్నదైన ఆమె చెల్లెలి పెళ్లి ఐ.ఏ.ఎస్.కి సెలక్టయిన రవికుమార్‌తో జరిగింది.

ఆరోజు తులసి ఏడ్చింది. తన చెల్లెలిపట్ల ఈర్ష్యతో కాదు. 'తనకి పెళ్ళి అవుతుంది' అన్న ఆశ పూర్తిగా సమాధి అయిన రోజది.

ఆమె పేటూరమ్మ అవతారం ఎత్తి సరిగ్గా పదిహేనేళ్ళు అయింది. ఆమె ఆశ్రమ సంప దలు అపారమయ్యాయి. ఆమె చాలా చాలా పాపులర్ అమ్మవారు అయింది. రోజురోజుకీ ఆమె ఆదాయం పెరిగిపోతూనే వుంది. అయినా ఆమె ఒంటరి. చాలా చాలా ఒంటరి. ఆ ఒంటరితనంతో ఆమెను సేదదీర్చే ఆప్తులు, ఈ జ్ఞాపకాలు! గతకా లపు మధురస్మృతులు! తన పదిహేడోఏట నుంచీ ఆమెని ఓదారుస్తున్న మరో అంశం డైరీ రాయడం!

ఈనాడు ఫణి ఆగమనం, పరిచయం ఆమె ఆశకి ఊపిరిలు పోశాయి. పెళ్ళి ఆశ కాదు. ఈ మామయ్య పంజరంలోంచి బయటపడాలన్న ఆశ! అందుకే ఆమె ఆ కొద్ది పరిచయంతోనే అతణ్ణి నమ్మింది. తన జీవిత చరిత్రని అతడి చేతిలో పెట్టింది. ఆమె భవిష్యత్తేం కానుందో నిర్ణయించే కాలం ఎంతో దూరంలో లేదు.



తులసి పుట్టినరోజు వైభవోపేతంగా జరి గింది? నాయకులూ, ఉన్నతాధికారులూ, గొప్ప వ్యక్తులూ, సినీతారలూ విదేశీయులూ, ఉన్నతవర్గాల వారంతా పాల్గొన్నారు. సామాన్య ప్రజల సంగతి చెప్పనే అక్కర లేదు. పుష్కర ప్రజల్లా తరలివస్తూనే వున్నారు. నిరుపేదలకి అన్నవస్త్రదానాలు

చేశారు.

ఆరోజు తులసి ఆధ్యాత్మిక ప్రసంగాన్ని వినడంకోసం ఆశ్రమానికి రాలేనివాళ్ళతో సహా ఆమెను విమర్శించేవారు కూడా టి.వి. ఛానెళ్ళముందు కూర్చున్నారు.

అయితే ఆ లక్షలాది జనంలో కూడా ఆమె ఫణికోసం వెదుక్కుంది. అతడు కన బడలేదు.

అతడికి తన డైరీలు పంపి వారం అవు తోంది. ఏం ఆలోచించాడో? ఆమెకి చాలా ఆతృతగా వుంది. ఆరోజు అనేక ఆధ్యాత్మిక సేవా కార్యక్రమాల్లో పాల్గొని అలసిసొలసిన ఆమెకి రాత్రికిగానీ విశ్రాంతి దొరకలేదు. అప్పుడు తెచ్చిచ్చాడు నర్సయ్య ఆమెకా ఉత్త రాన్ని!

ఆమె తలుపులు మూసుకుని తన అలస టనంతా మర్చిపోయి ఆత్రంగా చదివింది దాన్ని.

"ప్రియమైన తులసీ,

నీ కథ చదివాను. నా మానసికస్థితిని ఏమని వర్ణించను?

నీ పట్ల ఇటీవల నాలో ఏర్పడిన అనేక భావాలు రెట్టింపు అయినాయి.

దీర్ఘకాలంగా నిన్ను వంచిస్తూ వస్తూన్న వారిపట్ల అసహనం, ఎంతో అమాయక త్వంతో బతుకుతున్నావూ అన్న కోపం నీమీద కూడా

ఇవన్నీ కలిసి నన్ను కుదిపేశాయి.

నీ జీవిత కథ నాచేత ఎన్నోసార్లు కంట తడి పెట్టించింది.

నీ తండ్రి గురించి తెలుసుకుంటూన్న ప్పుడు నా మనసు ఆర్ద్రమైంది.

తులసీ! అదెంత అసాధ్యమైనా సరే నిన్ను నేను అక్కడినుంచి బయటికి తీసుకు వస్తాను.

అదెలా అన్నదాన్ని గురించి నేను ఈవా రంగా ఆలోచిస్తూనే వున్నాను. దానికోసం నేను నా వాళ్ళతోసహా ఎవర్నీ నమ్మడం లేదు.

ఇందులో నీకు సాయపడే దమ్ము వున్న వ్యక్తి ఒకేఒక్కరు కనిపిస్తున్నాడు. అతను... 'శంఖారావం' పత్రిక తెలుసుగా? దాని అధి పతి.

ఆయనకి ఈ బాబాలూ, అమ్మవార్లూ తాంత్రిక స్వాములపట్ల ఎంత వ్యతిరేకత వుందో నీకు తెలీనిదేం కాదు. తన పత్రిక ద్వారా వాళ్ళ అసలు రంగులు బయటపెట్టి సంచలనం సృష్టించడమూ నీకు తెలిసే ఉంటుంది. మీ ఆశ్రమం గురించి అప్పుడ ప్పుడూ కొన్ని విమర్శనాత్మక వ్యాసాలు ప్రచురించాడు కూడా.

ఇప్పుడు నా ముందున్న మార్గం అదే! నీ జీవితచరిత్రను ఆ పత్రిక ద్వారా బయటికి తెప్పించడం!

అది వచ్చే సమయానికి నువ్వు ఆశ్ర మంలో వుండకూడదు. బయటికి రాగల గాలి.

అప్పుడు ఇతర పౌరహక్కుల, ప్రజామ హిళా సమాజాల మద్దతు తీసుకుందాం. ఓ సామాన్య పౌరురాలివైన నీ ప్రాణరక్షణ కోసం ప్రభుత్వం కూడా నీకు రక్షణ కల్పి స్తుంది.

ఇదీ నా ఆలోచన!

నేనీ పనికి పూనుకోవాలంటే నీ మేన మామ ఊళ్ళో ఉండకూడదు. నీ అమెరికా ప్రయాణాన్ని కాన్సిల్ చేసుకో! నువ్వు బయ టికి రావడానికి సిద్ధంగా వుండు. అదెలా అన్నది నేను నర్సయ్యకి చెప్పి వుంచుతాను. నువ్వు ప్రశాంతంగా వుండు.

ఫణీంద్ర"

ఈ ఉత్తరం ఆమెని ఆకాశపుటంచులకి చేర్చింది.

ఆ మర్నాడు తను అమెరికా పర్యటనకి రాబోవడంలేదని తన మేనమామతో స్పష్టంగా చెప్పింది.

"నువ్వు రాకపోతే ఎలా తులసీ? మనం అనేక సేవా కార్యక్రమాల కోసం విరాళాలు

సేకరించడం కోసం వెళుతున్నాం! నువ్వు వచ్చితీరాలిగదా" అన్నాడు శ్రీనివాసరావు.

ఆమె తన సహనాన్ని కోల్పోయింది. "మామయ్యా! నన్ను పెట్టుబడిగా పెట్టి నువ్వు కోట్లాది రూపాయలు సంపాదిస్తున్నావు. నేను కాదనడంలేదు. అయినాసరే నీ ఆశకు అంతులేకుండా పోతోంది. మన బాంధవ్యాన్ని నువ్వు మర్చిపోయినా కనీసం నన్నొక మనిషిగా అయినా గుర్తించి నాకూ ఇష్టమూ అయిష్టమూ అనేది వుంటుందని గ్రహించు! నువ్వెంత ఒత్తిడి చేసినా నేను ఈసారి అమెరికా వచ్చేది లేదు. నన్ను బలవంతంగా తీసుకెళతావా? ఇక నీకు మిగిలిన మార్గం అదేగా..." అంది.

ఆమె ఎందుకోగానీ చాలా సహనం కోల్పోయి రెచ్చిపోయి వుందని శ్రీనివాసరావు గ్రహించాడు. ఎప్పుడోగానీ ఆమె అలా తిరుగుబాటుగా మాట్లాడదు. ఇలాంటప్పుడేం చేయాలో అతనికి తెలుసు. అతడు లౌక్యుడు.

"సర్లేమ్మా" అన్నాడు "నేనూ అనంత్ వెళతాంలే! నువ్వేదో నలతగా వున్నట్టున్నావు" అన్నాడు.

"మంచిది" అందామె.

అతడెళ్ళిపోయాడు. తరువాత అతడు తీసుకోవాల్సిన జాగ్రత్తలన్నీ తీసుకుని ఆశ్రమంలోని ఏ గ్రేడ్ ఆఫీసర్స్‌కీ, ప్రముఖులకీ ఆశ్రమ బాధ్యతలు అప్పగించి ఆ మూడో రోజు అనంత్‌తో కలిసి అమెరికా బయలుదేరివెళ్ళాడు. ఆరోజు తులసి ఆనందం చెప్పనలవికాదు.

వెంటనే ఫణీంద్ర శంఖారావం అధినేతతో అప్పాయింట్‌మెంట్ కోసం ప్రయత్నించాడు. ఆయన సాధారణమైన వ్యక్తి కాకపోవడం ఫణి అతిసాధారణమైన వ్యక్తి కావడంతో అది అంత వెంటనే జరగలేదు. మూడురోజుల తరువాత ఫలితంచిందతడి ప్రయత్నం. అరగంట మాత్రమే అప్పాయింట్‌మెంట్ సంపాదించగలిగిన అతడు మూడుగంటలపాటు అతడితో మాట్లాడి చర్చించి ఆయనకి తులసి డైరీలు ఇచ్చి సెలవు తీసుకున్నాడు.

మర్నాడు ఆయన వాటిని చదివాక మళ్ళీ ఆయన్ని కలిశాడు.

ఆమె సమస్యకి పరిష్కారం చూపించడమేగాక జనాల్ని జాగృతుల్ని చెయ్యడం కూడా అతడితోపాటు తనవంతు బాధ్యతగా ఆయన భావించడంతో ఫణి ఆనందంతో తిరిగి పేటూరు బయలుదేరడం జరిగింది.

అయితే ఫణి అక్కడ లేని నాలుగయిదు రోజుల్లో ఆశ్రమంలో సంభవించిన పరిణామాలు అతడు ఊహించలేనివి.

★ ★ ★

మరో నాలుగు రోజులు తరవాత తిరిగి రావాల్సిన తన మేనమామ అప్పుడే అమెరికానుండి తిరిగి రావడం తులసిలో ఎంతో ఆందోళనని కలిగించింది. శ్రీనివాసరావు తిరిగివచ్చినరోజు సరిగ్గా ఫణి తను వెళ్ళిన పని ముగించుకుని తిరిగి పేటూరు వస్తున్నరోజే.

ఆమె ఆతృతని అణచుకోలేక "అప్పుడే వచ్చేవేం మామయ్యా" అడిగింది. "అక్కడ నాకు నువ్వే గుర్తొచ్చావు తులసీ! వుండలేక తిరిగివచ్చాను" అన్నాడు.

ఈ జవాబుకి ఆమె తెల్లబోగా "అపార్థం చేసుకోకమ్మా! అక్కడ అమెరికాలో నా కూతుర్నీ, దాని సంసారాన్నీ, పిల్లల్నీ చూశాక నీ జీవితం ఎంతగా అడవిగాచిన వెన్నెల అవుతోందో నాకు తొలిసారిగా తెలిసివచ్చినట్టయింది. నా భార్య కూడా నాతో 'తులసిని ఇకనైనా ఆ జంజాటంనుంచి తప్పించు' అంది"

తులసి అతణ్ణే చూస్తోంది.

"నాకూ అది నిజమేననిపించిందమ్మా. మనం లెక్కలేనంత సంపాదించాం. స్విస్ బ్యాంకు ఖాతాల్లో కోట్లాది రూపాయల నోట్లకట్టలు మూలుగుతున్నాయి. అయినా ఆశ చావక నిన్ను ఉసురుపెడుతున్నానేమో



అన్న భావన కలిగింది నాకు. తులసీ నిన్ను అమ్మవారిగా వీళ్ళెవరూ గుర్తుపట్టనంత దూరంగా పంపి నీకు కొత్త జీవితాన్ని ఇవ్వాలన్న నిర్ణయానికి వచ్చాను" చెప్పాడు ఆర్ద్రత నిండిన గొంతుతో

తులసి తన చెవుల్ని తను నమ్మలేకపోయింది.

"నా మాట నమ్ముతావా తల్లీ? " అన్నాడు శ్రీనివాసరావు చిన్నప్పటి మేనమామలా.

"అంటే... అంటే... నాకు పెళ్ళిచేస్తావా మామయ్యా" ఆనందంతో అడిగిందామె.

"వెంటనే చేస్తానమ్మా! అక్కడొకవరుణ్ణి కూడా చూసుకుని వచ్చాను. అయితే నీ భక్తకోటి నువ్వు దూరం కావడాన్ని సహించరు. భరించలేరు. వారికి నచ్చచెప్పడం కోసం నువ్వోపని... చాలా చిన్న అబద్ధం చెప్పాలమ్మా" అన్నాడు.

"ఏమిటి మామయ్యా అది? " ఆమె భరించలేని ఆనందంతో అడిగింది.

"ఈరోజు ఆదివారంగదమ్మా! ఈరోజు



ఇంకా సేపట్లో ఆరుగంటలకి స్పెషల్ దర్శనం వుందిగదా! అప్పుడు నువ్వు భక్తులతో త్వరలోనే ఈ అవతార పరిసమాప్తి చెయ్యనున్నానని ప్రకటించు! భగవంతుడి ఆజ్ఞ అని చెప్పు. నీ ముఖతః ఈ మాట వింటే వాళ్ళు కొంతవరకూ నిన్ను వదులుకోవడానికి మానసికంగా సంసిద్ధులవుతారు. ఇంతకాలం సాగింది మోసం అని వాళ్లతో చెప్పలేంగదా? ఏం? " అడిగాడు.

"అలాగే చెబుతాను మామయ్యా" అందామె.

ఆమె ఆలోచిస్తోంది. ఫణికి ఈ విషయం తెలిస్తే ఎంత సంతోషిస్తాడు? తన కోసం అతడేవో అవస్థలు పడుతున్నాడు.

అయితే ఈ సంభాషణ జరుగుతూన్న సమయంలో ఆమె తల్లి అక్కడే వుంది. నరసయ్య కాఫీ తెచ్చాడు అక్కడికి!

"పాపం వీడు అనేక సంవత్సరాలుగా చిత్తశుద్ధితో నీ సేవ చేస్తున్నాడు తులసీ! తన రుణం వుంచుకోనులే. పెద్ద బహుమతే ఇస్తాను" అన్నాడు శ్రీనివాసరావు.

"నేనూ అదే అనుకుంటూన్నాను మామయ్యా" అందామె.

మరో రెండు గంటల తరువాత భక్తుల మధ్య ఆమె తన అవతార పరిసమాప్తి గురించి ప్రకటించినప్పుడు వారంతా హాహాకారాలు చేశారు. చాలామంది ఆ వూహనే భరించలేక పొర్లిపొర్లి ఏడ్చారు. అక్కడంతా ఒక విషాద వాతావరణం అలుముకుంది. శ్రీనివాసరావు చేత రప్పించబడ్డ పత్రికావిలేకర్లు వార్తని వ్రాసుకున్నారు.

"రేపిది ఎంత సంచలనాత్మక వార్త అవుతుందో!" అని వాళ్ళలోవాళ్ళు మాట్లాడుకున్నారు.

★ ★ ★

ఆ రాత్రి తొమ్మిదిగంటలప్పుడు నరసయ్యకి బదులుగా తన తల్లి పాలగ్లాసుతో గదిలోకి రావడంతో తులసి ఆశ్చర్యపోయింది. ఎన్నిరోజులయింది తల్లి అలా వచ్చి?

ఆరోజు ఆమెకి లోకమంతా చాలా అద్భుతంగా ఆనందమయంగా కనిపిస్తూండడంతో "రామ్మా" అంటూ తల్లిని ఆహ్వానించి "చూశావామ్మా? మామయ్యకి ఈరోజుకి ఎంత మంచి బుద్ధి పుట్టిందో" అంది.

ఆమె తల్లి తలుపు మూసి వచ్చింది. ఆనందంలో వున్న తులసి ఇవేమీ పట్టించుకోలేదు.

"మామయ్య మాటలు నమ్మావా తులసీ? " అడిగిందామె.

ఎన్నిరోజులయిందో తల్లి అలా నోరారా 'తులసీ' అని పిలిచి. రోజులు కాదు ఏళ్లు!

తులసి పులకించిపోతూ "అవునమ్మా! సాయంత్రం నాచేత భక్తులకి ఏం చెప్పించాడో తెలుసుగా! అదే నా చిట్టచివరి అబద్ధం! ఇప్పటికైనా మామయ్యకి మంచి బుద్ధి పుట్టింది. ఇప్పుడు మామయ్యని నేను క్షమించేశానమ్మా" అంది.

"పిచ్చిదానా" అంది తల్లి. "శీనయ్యని నేనే ఫోన్ చేసి రప్పించాను తెలుసా? " అంది.

కొత్తగా విన్న ఆ మాట అత్యంత ఆశ్చర్యం కలిగించగా "ఎందుకలా? మామయ్య ఆ మాట చెప్పలేదే? " అంది.

"వాడెందుకు చెబుతాడు. వాడో విషపురుగు. నువ్వు ఫణీంద్రతో పరిచయం పెంచుకోవడం, అతడి ద్వారా ఆశ్రమంలో నుంచి బయటపడాలనుకోవడం, అందుకోసం ఏవో ప్రయత్నాలు చెయ్యడం ఇవన్నీ నరసయ్య మేనకోడలు నాగమణి ద్వారా నాకు తెలిశాయి. నేను భయపడి శీనయ్యకి ఫోన్ చేశాను. హుటాహుటీన వచ్చి ఈ నాటకం ప్రారంభించాడు. నిజంగా వాడికి నీకు పెళ్ళి చేసే ఉద్దేశం వుండివుంటే ఈ సంగతులేవీ నేను నీకిప్పుడు చెప్పి వుండేదాన్ని కాదు..."

తులసి మొహం తెల్లగా పాలిపోయింది. అంటే... అంటే... అంతా తెలిసీ

మామయ్య మరో కొత్త నాటకం ప్రారంభిం చాడన్నమాట!

"ఎంత అతితెలివిపరుడివి మామయ్యా! పచ్చి కసాయివాడివయిన నిన్ను అమాయ కపు గొర్రెపిల్లలా నేను నమ్ముతూనే వున్నాను" భయంతో, ఆశాభంగంతో, దుఃఖంతో కదిలిపోయిందామె.

'నరసయ్యకి పెద్ద బహుమతే ఇస్తాను' అన్న అతడి మాట గుర్తొచ్చి వణికిపో యింది. "ఆ ఫణి ఏం చెయ్యాలనుకున్నాడో మాకు తెలీదు. అతడి కథ ముగించినదాకా ఈ సంగతి నాకూ తనకీ అనంత్‌కీ మధ్యనే వుంచమని నాతో అన్నాడు శీనయ్య. దాని కోసమే ఇంకా నర్సయ్య జోలికి వెళ్ళలేదు"

"ఎంతపని చేశావమ్మా? అతడు నర్స య్యని హత్య చేసినా చేస్తాడే? " విలపి స్తోంది తులసి. "పెద్ద మామయ్య చాలా చెడ్డవాడమ్మా"

"వాణ్ణింకా మామయ్యా అంటున్నావా తులసీ! నీ మంచితనం, మెతకతనం, అమా యకత్వం నీకు శత్రువులయ్యాయమ్మా! అవును... నువ్వు కిష్టయ్యకూతురివికదా? "

తులసి తలెత్తి తల్లివైపు చూసింది.

"నీచేత అవతార పరిసమాప్తి నాటకం ఎందుకు ఆడించాడో తెలుసా? నిజంగా నీ జీవితాన్ని పరిసమాప్తి చెయ్యడానికి"

తులసి తుళ్ళిపడి చూసింది.

"వాడంతటి రాక్షసుడని నాకూ అరగంట క్రితమే తెలిసింది. అనంత్ వాడూ మాట్లా డుకుంటూన్న మాటలు నేను విన్నాను. అది నా అదృష్టం! నేను తల్లిని తులసీ! నాలో ఇంకా మాతృత్వపు మమకారం చావ లేదు. ఎన్నోసార్లు నువ్వు అడిగేదానివి... 'నాన్నతో గడిపిన మన ఆ జీవితం నీకు గుర్తు రావడంలేదామ్మా? ' అని. తులసీ... ఒక అపరాధభావంతో నేనా జీవితాన్ని మర్చిపోవడానికి ప్రయత్నించేదాన్ని. మర్చి పోయినట్టు నటించేదాన్ని. కానీ ఆ జ్ఞాప కాలు ఎప్పుడూ నన్ను వెంటబడి వేధిస్తూనే వుండేవి. అందులోనుండి మీ నాన్న 'నా బిడ్డ జీవితాన్ని నాశనం చేశావా? ' అని నన్ను నిలదీసి అసహ్యించుకుంటున్నట్టు అనిపించేది. అందుకే నేను నీకు దూరమై పోయాను. నిన్ను తప్పుకు తిరిగాను. మన మంతా ఒక ఊబిలోకి దిగిపోయాం. ఇక అందులోంచి బయటికి రాగలిగే మార్గం లేదు. అందులోనే దొరుకుతూన్న సుఖాన్ని అనుభవిస్తూండిపోవడమే మంచిది అనుకు న్నాను. ఆ సుఖాలకి అలవాటు పడిపో యాను ఎంతగానో! కానీ, తులసీ నాన్న కట్టెలు కొట్టి, పిండిదంచి సంపాదించిన నాడు మనకి దొరికిన మానసిక ప్రశాంతత నాకు ఇక్కడ ఈ జీవితంలో ఏనాడూ దొర కలేదు. ఈరోజు నా మనసులోని ఆవేదనని నీతో చెప్పుకుంటున్నాను. తల్లిగా నీపట్ల నేను చాలా అమానుషంగా ప్రవర్తించాను. నీకు చాలా ద్రోహం చేశాను..." ఆమె కరిగి కన్నీరయి ప్రవహిస్తోంది.

తులసి చిత్తరువై తల్లిని చూస్తూండిపో యింది.

"తులసీ! వాడెంతటి పాపాత్ముడంటే ఈ పాలల్లో విషం కలిపి తల్లినైన నాచేత నీకు పంపాడు. ఈ విషం పాలసంగతి నాకు తెలుసునని వాడికి తెలీదు. ఇంతటితో ఈ కథ ముగించదలచుకోలేదువాడు. ఏ అనా థశరణాలయంనుంచో ఓ పసికూనని పట్టు కొచ్చాడు. రేపు భక్తుల్లో ఆ అమ్మాయిని నీ అంశగా ప్రకటించి నిరాటంకంగా తన వ్యాపారాన్ని కొనసాగిస్తాడు. ఆ అమ్మాయి ఎలా వుందో తెలుసా? దాదాపు పదిహేను సంవత్సరాల క్రితంనాటి నీలా అందంగా అమాయకంగా పాలుగారే మొహంతో..."

"అమ్మా" ఆర్తనాదం చేసినట్టుంది తులసి. "మళ్ళీ మరో బలిపశువా? "

"అవును తులసీ! వాడు సామాన్యుడు కాడు! కోట్లాది ఆదాయాన్ని వదులుకోడు"

"ఇప్పుడీ పాలు నాకిస్తావా అమ్మా? " అడి గింది తులసి జాలిగా!

"పిచ్చిదానా! నేను తల్లినే! వీటినేం చెయ్యాలో నాకు తెలుసు! నువ్వు ఆశ్రమం లోంచి బయటికి వెళ్ళడానికి సిద్ధంగా వుండు. నరసయ్య నిన్ను తీసుకుని వెళ తాడు" అంటూ తన చీరచాటునుండి ఓ బురఖా తీసిందామె.

"ఇది ఆశ్రమంలోని భక్తురాలు ఫాతి మాది. దీన్ని ధరించి పారిపోవడానికి సిద్ధ పడు. ఎక్కడికైనా వెళ్ళు కూలి చేసుకునైనా స్వేచ్ఛగా, ఆనందంగా బతుకు. అయితే ఈ తల్లి తప్పుల్ని మన్నించు. నన్ను క్షమించ మని మీ నాన్ననీ, భగవంతుణ్ణి ప్రార్థించు"

"అమ్మా" తల్లిని చుట్టుకుని భోరున ఏడ్చింది తులసి.

"వద్దు, నువ్వు బేలవి కావద్దు. నిబ్బరంగా వుండు. లేకపోతే నువ్విక్కడనుండి బయట పడలేవు!"

"కానీ, అమ్మా సెక్యూరిటీ" అందామె భయంగా.

"ఐడెంటిటీ కార్డ్ చేతిలో ఉంటే సులభంగా బయటపడవచ్చు! బురఖా ఉంటుంది గనుక నిన్ను చూడలేరు. నిన్ను విజయవం తంగా తొలగించుకో గలుగుతున్నందుకు ఎంతో ఆనందంతో వాళ్ళిద్దరూ మత్తులో జోగుతూన్నారు! నేను వెళ్ళి 'తులసి తలుపే సుకొని మత్తుగా పడుకుందని' చెబుతాను, సిద్ధంగా వుండు" అంటూ వెళ్ళిపోయింది తల్లి పాలగ్లాసు అక్కడ వుంచి.

ఐడెంటిటీకార్డ్... అందులోనూ మళ్ళీ గ్రీన్ కార్డ్ ఒకటి! అదొక ప్రత్యేకమైన గుర్తింపు కార్డ్ పర్మిషన్ కార్డ్ కూడా. అర్ధరాత్రి ఎవ రైనా ఆశ్రమంలోంచి బయటికి వెళ్ళదలచు కున్నా లోపలికి రాదలచుకున్నా సరే, ఆశ్రమం ఆవరణనుంచి పేటూరికి ఇరవై అయిదు కిలోమీటర్ల పరిధిలో వున్న ఏ సెక్యూరిటీ పోస్ట్‌వాళ్ళూ అనుమానించక నిర భ్యంతరంగా పంపుతారు. ఎందుకంటే ఆశ్ర మంలో అన్నీ కలిపి ఇరవై అయిదు కార్డుల కంటే ఎక్కువ కార్డులు వాడుకలోలేవు! అది చూపించారంటే వాళ్ళెవరైనా సరే చాలా ముఖ్యమైన లేక అత్యవసరమైన పనిమీద వెళుతున్నారని అర్థం. ఆ కార్డ్‌మీద వుండేది శ్రీనివాసరావు ఫొటో.

మరో అరగంట తరువాత తల్లి ఎందుకైనా మంచిదని మరోకార్డ్ అదనంగా చేర్చి మూడు కార్డులు తెచ్చి ఇచ్చింది.

ఫణి వచ్చాడో లేదోనన్న ఆందోళనతో సత మతమైపోతోంది తులసి.

పదిన్నరప్పుడు బురఖా ధరించి తనని ఇంతకాలం ఖైదీని చేసిన ఆ బంగారు పంజ రంలోంచి స్వేచ్ఛా ప్రపంచంలోకి పయనమై తల్లిని విడవలేక కళ్ళనీళ్ళతో ఆశ్రమంలోంచి బయటికి అడుగుపెట్టిందామె.

ఆ మరుక్షణం తన తల్లి విషం కలిసిన పాలని తాగేసిందన్న సంగతి ఆమెకి తెలీదు.

ఆ ఒక్క త్యాగం తల్లిగా ఆమె జీవితంలోని తప్పుల్ని ప్రక్షాళనం చేసింది.

ఆ అర్ధరాత్రి పేటూరులోని తన అద్దె ఇంటికి చేరుకున్న ఫణి అక్కడ తులసినీ, నరసయ్యనీ చూసి చెప్పలేనంత ఆశ్చర్యపో యాడు. ఆనందపడ్డాడు. అసలు కథ తెలు సుకున్నాడు.

"సరే... దీన్ని మనం కలిసివచ్చిన అవ కాశం. అదృష్టంగా భావించాలి! వెంటనే మనం ఈ వూరిని వదిలేయాలి తులసీ! పదండి" అన్నాడు.

ఆ రాత్రి ఆశ్రమం తాలూకు ఓ వాహనం లోనే వాళ్ళు భక్తుల్లో కలిసిపోయి అక్కడి నుండి బయటపడగలిగారు.

ఆ మర్నాడు ఉదయం పదకొండు గంటల వేళ అప్పటికి అందరికీ తులసి కథ తెలిసి పోయింది.

అదే సమయంలో అవతారపరిసమాప్తి వార్త కూడా పత్రికల్లో వచ్చింది.

సంచలనం... మహాసంచలనం. అంతటా సంచలనం. జనంలో ఇదే చర్చ

"ఇంతమోసమా? " అనేవాళ్ళూ,

"ఇందులో ఏదో లొసుగుంది. పేటూరమ్మ దేవత కాకపోవడం ఏమిటి? " అని ఇంకా నమ్మలేని అమాయకులూ.

పత్రిక వెళ్ళిన చోటల్లా అట్టుడుకుతూండగా, పటిష్టమైన భద్రతా ఏర్పాట్ల మధ్య "శంఖారావం" ప్రధాన సంపాదకుడూ, ఫణి, తులసి పత్రికా విలేఖరుల సమావేశంలో మాట్లాడారు.

చివరిగా తులసి మాట్లాడుతూ, "ఇప్పుడు నా గురించి నేను కొత్తగా చెప్పాల్సిందేమీ మిగల్లేదు. మీరంతా తెలుసుకున్నారు. చివరిగా నేను చెప్పదలచుకుంది ఒక్కటే! ఈ కథలో నేను దగాపడిన దాన్ని, వంచింపబడ్డదాన్ని తప్ప మోసగత్తెను కాను, దేవతనీ కాను. నిన్నటిదాకా నేను స్వార్థపరుడైన ఓ 'మనిషి చేతి దేవత'ను మాత్రమే. ఆ జీవితం నుండి బయటపడాలన్న నా పదిహేనేళ్ళ నాటి తపన ఇన్నాళ్ళకి ఫణీంద్రగారి ద్వారా ఫలించింది. ఈ క్షణాన్నుండి శ్రీనివాసరావూ అతడి మనుషులూ నన్ను వెంటాడి వేధించి కడతేర్చడానికి ప్రయత్నించవచ్చు లేదా ఇక నావల్ల కొత్తగా జరిగే అపకారం ఏమీ లేదని వదిలివేయనూ వచ్చు. ఏది ఎలా జరిగినా నేను పీలుస్తూన్న ఈ స్వేచ్ఛా వాయువులు పదిహేనేళ్ళక్రితం నాటివి. నా గుండె ఆగిపోతుందేమో నన్నంత ఆనందం నన్ను నిలువెల్లా కుదిపేస్తోంది. నేను ప్రజలకి ఓమాట చెప్పదలచుకున్నాను. అమ్మవార్లనీ బాబాల్నీ స్వాముల్నీ నమ్మేవారితో పాటు నమ్మని వారూ విమర్శకులూ వుంటారు. వాళ్ళకి ఒక విన్నపం. నాలాంటి అభాగ్యురాళ్ళూ, అభాగ్యులు అయిన దగా చరితలు వారిలో వున్నారేమోనని తెలుసుకోవడానికి ప్రయత్నించి వారిమీద జాలిచూపించడానికి ప్రయత్నించండి. ఎందుకంటే వారు తెర మీద బొమ్మలు మాత్రమే" ఆమె ఆగింది.

అంతా రాసుకుంటూన్నారు.

చివరిగా ఆమె అంది, "నా స్థానంలో నిలబెట్టడానికి శ్రీనివాసరావు ఇంకో పసికూనని పట్టుకొచ్చాడు. మళ్ళీ అతడు తన పూర్వపు వైభవాన్నీ విజయాన్నీ ఎంతవరకు సాధించగలడు అనేది **ఈ జనం, భక్తగణం** మీద ఆధారపడి వుంటుంది. నా దయనీయమైన కథని విన్నవాళ్ళు 'ఆ పసిపాపదేవతకాదు, బంగారు పంజరంలో బందీ, అని గ్రహించగలిగితే అది వారి అదృష్టం అవుతుంది. లేదా ఆమెకి సాష్టాంగ పడి మొక్కితే మళ్ళీ వాళ్ల గ్రహచారం ప్రారంభమవుతుంది. మీ అందరికీ కృతజ్ఞతలు" అంటూ ముగించింది.

ఎవరో అడగనే అడిగారు, "పేటూరమ్మగారూ... సారీ... తులసి గారూ! మీ చిరకాలవాంఛ. అదే పెళ్ళి ఎవరితో? ఎప్పుడూ? "

ఆమె నవ్వింది స్వేచ్ఛా విహంగంలా.

"నిజంగా ఈ క్షణాల్లో దాన్ని గురించిన ఆలోచనే నాకు లేదు. రేపేమిటి? జీవనాధారం ఏమిటి? ఈ భయాలు కూడా నాకు లేవు? ఈ క్షణంలో నేను రెక్కలు విప్పుకోగలిగిన స్వేచ్ఛాజీవినన్న సంగతి మాత్రమే నా మనసుని ఆక్రమించుకుని నన్ను ఉక్కిరిబిక్కిరి చేస్తోంది. దీన్ని అనుభవించాలి ముందు" అందామె.

అప్పుడు నోరు విప్పాడు ఫణి, "ఆమెకి ఏ క్షణంలో పెళ్ళిమీదకి మనసు వెళితే ఆ క్షణంలో నేనామెను నా జీవితంలోకి ఆహ్వానించి ఆమెతో జీవితం పంచుకోవడానికి సిద్ధంగా వున్నాను"

ఆ మరుక్షణం అక్కడ చప్పట్లు మారుమ్రోగాయి.

తులసి సంభ్రమంతోనూ, ఆనందంతోనూ, గుండెలు నిండుకున్న కృతజ్ఞతతోనూ అతడ్ని చూసింది.

★

# చతుర కతలు

## పూజారి

మర్నాడు డి.ఎస్.పి. దొరగారు ఇన్‌స్పెక్ష న్‌కి వస్తున్నారని జిల్లాలోని ఓ మారుమూల గ్రామానికి చెందిన సర్కిల్ ఇన్‌స్పెక్టర్‌కి కబురందింది.

ఆంధ్రప్రదేశ్‌లో పోలీసుల ప్రాథమిక బాధ్యత పై అధికారుల మెప్పుపొందడమే కాబట్టి ఆ సి.ఐ పోలీసు అధికారులు కోరు కునే హండ్రెడ్ పైపర్స్ విస్కీ బాటిల్, నాటు కోడిమాంసంతో రెండు రకాల కూరలు, చేపల పులుసు, త్రిబుల్ ఫైవ్ సిగ రెట్ పాకెట్స్ మొదలయినవన్నీ ఏర్పాట్లు చేసి, దొరలు బసచేసే ఆర్ అండ్ బి గెస్ట్‌హౌస్‌కి తరలించాడు.

ఎఫ్.ఐ.ఆర్ ఫైల్ చేయకుండా వుంచిన కేసులన్నిటికి ఆ ఫైల్స్ తెరిచాడు.

అరెస్ట్ చేసిన ఇరవై నాలుగు గంటల్లో మేజిస్ట్రేట్ ముందు హాజరు పరచకుండా లాకప్‌లో వున్న నిందితుల్ని తక్షణం కోర్టులో హాజరు పరిచి రిమాండ్ ఆర్డర్స్ తీసుకున్నాడు.

స్టేషన్ డైరీ మొత్తం అప్‌టుడేట్‌గా రాశారు.

ఈ ఆఫీసర్ ఇటు రావటం ఇదే మొదటి సారైనా పరమ స్ట్రిక్ట్ అని వినివుండటంతో తన బాధ్యతలన్నిటిని పకడ్బందీగా నిర్వర్తిం చాడు. అనుకున్న టైంకు జీపు దిగాడు డి.ఎ స్.పి. దొరగారు.

గంజిపెట్టి బాగా ఇస్త్రీ చేసిన యూనిఫా రాల్లో వున్నవారంతా ఆయనకి సెల్యూట్స్ చేశారు.

నుదుట అడ్డబొట్టుతోవున్న ఆయన స్టేష న్‌లోని పరిశుభ్రతని (ఆర్నెల్ల తర్వాత ఫినా యిల్‌తో కడిగించాడు సి.ఐ) పరిశీలించాక గెస్ట్ హౌస్‌కు కదిలారు తీరికగా. అదీ చూశాక "అవునూ! గెస్ట్‌హౌస్‌లో ఇంకెవర యినా పెద్దాయన బస చేస్తున్నాడా? " అన డిగారాయన.

"లేదుసార్! మీరొక్కరే వున్నారు"

"మరి ఆ స్కాచ్ విస్కీ, సిగరెట్లు గట్రా ఎవరికోసం? "

"తమరి కోసమేనండి!" వినయంగా వంగి చెప్పాడు సి.ఐ.

"ఫూల్! నేనెంత సాత్వికుడినో తెలవదను కుంటా నీకు. తక్షణం వాటిని అక్కడనుంచి తీయించెయ్" ఆజ్ఞాపించాడు.

"ఎస్ సార్" కశవిశపడుతూ చెప్పాడు సి.ఐ.

"మేం శైవులం. ఇక్కడ ఓ శివాలయం వుందనీ, అది రెండు వందల ఏళ్లక్రితందని విన్నాను. నిజమేనా? "

"ఎస్ సార్"

"సాయంత్రం శివార్చనకి ఏర్పాట్లు చేయించు"

"చిత్తం సార్"

"అసలు ఈ మారుమూల ప్రాంతానికి నేను కేంప్‌కి రావడానికి ప్రధాన కారణం అదే... తెలుసా? "

"ఎస్ సార్... పూజకి అన్ని ఏర్పాట్లూ చేయిస్తాను సార్" విశ్రాంతికి సిద్ధమవు తున్న డి.ఎస్.పితో చెప్పాడు సి.ఐ.

"ఆ విస్కీ సీసా గట్రా విషయంలో సారీ

సార్. మీకూ అందరిలాగే ఈ అలవాట్లున్నాయనుకున్నాను సార్. మీరు మహాత్ముల టైప్ సార్!"

డి.ఎస్.పి. విశ్రమించగానే ఆ గుడిలో అర్చనకి ఏర్పాట్లు చేయమని ఒకరికీ, గెస్ట్‌హౌస్‌లోవి అన్నీ తన ఇంటికి చేర్చమని ఇంకొకరికీ పురమాయించాడు సి.ఐ.

శివార్చన పని మీద వెళ్లిన కానిస్టేబుల్ గంటన్నర తర్వాత వచ్చి సెల్యూట్ చేసి చెప్పాడు, "ఆ గుడి పూజారి ఊరెళ్లాడంట సార్. అర్చన చేయించేవారు మన గ్రామంలో ఇంకెవరూ లేరు సార్!"



"అరెరె! కొంప మునిగింది. ఎలా ఇప్పుడు?" ఆదుర్దాగా చూశాడు.

"మన శ్రీనాట్ శ్రీకి శ్లోకాలు గట్రా బాగా వచ్చు సార్" భయపడుతూనే అందించాడు పి.సి. ఆలోచించి సన్నగా తెల్లగా వున్న ఆ కానిస్టేబుల్‌ని పిలిచి చెప్పాడు...

"నీవు వెంటనే గుండు కొట్టించుకుని పిలక వుంచుకో! సాయంత్రం గుళ్లో పూజారిలా నటించి డి.ఎస్.పి. దొరగారిచేత అర్చన చేయించు"

"... కానీ నాకు మంత్రాలు రావు సార్"

"ఈ రోజుల్లో సంస్కృతం ఎవరికీ రాదు. శుక్లాంబరదరం విష్ణుం...' మంత్రం అర్థమయ్యేలా బయటికి చదివి, మిగిలింది గొణిగినట్లుగా నెమ్మదిగా చదువు. ఏమిటీ?" గద్దించాడు సి.ఐ.

"యస్ సార్"

"పోలీసుగా ఇంత అనుభవం వుండి మారువేషం వేయలేవా?" గద్దించాడు సి.ఐ. మళ్లీ.

సాయంత్రం డి.ఎస్.పి. ఫ్యామిలీని స్వయంగా తోడ్కొని గుడికి చేరుకున్నాడు సి.ఐ. బయట సిద్ధంగావున్న పోలీసులు ఆయన జీప్ దిగగానే అటెన్షన్‌లో నిలబడి సెల్యూట్ చేశారు.

"గర్భగుడిలోకి వెళ్లి మీరు విగ్రహాన్ని తాకే ఏర్పాటు కూడా చేశాను సార్. పూజారి వప్పుకున్నాడు" అంటూ.

సి.ఐ. డి.ఎస్.పి దొరవార్నీ, ఆయన సతీమణిని, పెద్ద కూతుర్ని, చిన్న కొడుకుని దర్పంగా గుడిలోకి తీసుకు వెళ్లారు.

పూజారి వేషంలో వున్న కానిస్టేబుల్

సి.ఐ.ని, ముఖ్యంగా డి.ఎస్.పి దొరవార్ని చూడగానే వణికిపోతూ అలవాటుగా అటెన్షన్‌లో నిలబడి కాలు నేలకేసికొట్టి ఇద్దరికీ సెల్యూట్ చేశాడు... నిగనిగ లాడే గుండుతో, వేలాడే దట్టమయిన పిలకతో.

జరిగిన సంగతి క్షణంలో అర్థమైపోయింది దొరవారికి.

ఆ తర్వాత డి.ఎస్.పి దొరవారు ఆ గర్భ గుడిలో సి.ఐ.ని దీవించిన తీరు అక్షరాల్లో ప్రచురించడం నేరం.

—యం.కావ్య

---

# ఆశ

ఉదయం నుంచీ హాస్పిటల్‌లో కూర్చొని కూర్చొని చిరాగ్గా బయటకొచ్చాడు భాస్కరం, "ఒంటరిగా, ఖాళీగా కూర్చోవాలంటే ఎంత భయంకరమో" అనుకుంటూ.



కాపౌండర్, నర్సు ఉన్నా వాళ్ళకి తనతో మాట్లాడే అవసరమూ, అవకాశమూ రెండూవుండవు. తమలో తాము గుసగుసలు, ముసిముసినవ్వులతోనే సరిపోతుంది వాళ్ళకి. టైముగురించే పట్టించుకోరు వాళ్ళు. ఇంక తన గురించేంపట్టించుకుంటారు. "ఛ. జీవితం ఇంతబోరుగా ఉంటుందనుకోలేదు ఏనాడూ తను. చదువుకునే రోజుల్లో ఎన్ని కలలు కనేవాడు. తన వృత్తిలో ఒక్క నిముషంకూడా వృధాకానివ్వకూడదనుకోనేవాడు. ఒక్క నిముషమైనా పనుంటుందో, ఉండదో కూడా అర్థంకావడం లేదు ఇప్పుడు" ఆలోచనలలో మునిగి తేలుతూ అలా నడుచుకుంటూ పోతున్నాడు భాస్కరం.

అంతలో ఏదో కలకలం చెవిన పడటంతో ఆలోచనల్లోంచి తేరుకుని చుట్టూ చూశాడు. ఆ ప్రక్కమలుపు దగ్గర జనంగుంపుగా గుమికూడి ఉన్నారు. పెద్దగా అరుపులు వినిపిస్తున్నాయి. ఎవరో, ఎవర్నో ఏదో అంటున్నారు. కొంచెందూరంగా ఉండడంతో మాటలు సరిగ్గా వినబడడంలేదు. ఏమిటో చూద్దామనే ఉత్సుకతతో అటు నడిచాడు భాస్కరం. గుంపుమధ్యలో రెండు సైకిళ్ళు పడున్నాయి. వాటి తాలూకు యజమానులు కాబోలు ఒకరిపై ఒకరు అరుచుకుంటున్నారు. నీది తప్పంటే నీది తప్పనుకుంటున్నారు. "పళ్ళు రాలిపో

తాయి" అన్నాడు వాళ్ళలో ఒకడు. "ఆమాత్రం మాకూ చేతనవును. పళ్ళు రాల గొట్టడం" అన్నాడు రెండోవాడు. "ఏదీ రాల గొట్టు" అన్నాడు మొదటివాడు. "తమరే గదా పళ్ళు రాలగొడతానన్నది ముందు. నువ్వు రాలగొట్టు చూద్దాం" అన్నాడు రెండో వాడు. "ముందు నువ్వు రాలగొట్టంటే ముందు నువ్వు రాలగొట్టు" అనుకుంటూ కంఠాలు పెంచుతూ రెచ్చిపోతున్నారు ఆ యిద్దరూ.

ఎంతసేపటికీ మాటలేకాని, చేతలకి రాక పోవడంతో విసుగనిపించింది భాస్కరానికి. ప్రక్కన నిల్చుని ఆసక్తిగా చూస్తున్న అత నితో "ఏంటండీ ఎంతసేపూ పళ్ళు రాలగొడ తాను, పళ్ళురాలగొడతాను అంటారే తప్ప నిజంగా ఎవడూ రాలగొట్టరేం..." అన్నాడు భాస్కరం.

వింతగా చూసాడు భాస్కరం వంక అతను.

"ఏంటయ్యా బాబూ. ఏదో కోపంలో వాళ్ళు అరుచుకుంటుంటే, నిజంగా పళ్ళు రాలకొట్టుకోమంటావా. బలేవాడివయ్యా బాబూ..." అన్నాడు అతను.

"అది కాదండీ. నేను పళ్ళడాక్టర్ని. కొత్తగా క్లినిక్ తెరిచి వారం రోజులయింది. పేషెంట్లు లేక ఛస్తున్నాను. ఆ పక్కనే నా హాస్పిటల్ ఉందిగదా! వీళ్ళయినా పేషెం ట్లుగా వస్తారేమోనని..." ఆశగా అన్నాడు పళ్ళడాక్టర్ భాస్కరం.

**– సువర్చలా జ్యోతి**

---

# అదీ సంగతి!

ఎప్పటిలానే జైభజగోవిందా చిట్స్ అండ్ ఫైనాన్స్ కంపెనీ పది గంటలకు ఆఫీసు తలుపులు తెరుచుకున్నాయి. ఆఫీసు స్టాఫంతా ఎవరి పనిలో వాళ్ళు తలమున కలై ఉన్నారు. మేనేజర్ వీరానందం కూడా టంచనుగా పది గంటలకే ఆఫీసుకు వచ్చే శాడు. పొట్టిగా, బొద్దుగా, బట్టతలతో ఉన్న వీరానందం అంటే ఆఫీసుస్టాఫ్‌కు ఎంతో భయం- భక్తి! విధులు పాటించడంలో వీరానందం కృషి, పట్టుదల, కార్యదీక్ష, క్రమ శిక్షణ అంటే కంపెనీ యాజమాన్యం వార్కి ధృఢమైన నమ్మకం.

ఎప్పుడూ ఆఫీసుకు లేటుగా వచ్చే సుబ్బా రావు క్రమం తప్పకుండా ఆరోజు కూడా లేటుగా వచ్చాడు.



"ఏవండీ! సుబ్బారావుగారు, మేనేజర్‌గారు రమ్మంటున్నారు" అని అటెండర్ పిలవడంతో మేనేజర్ రూమ్ తలుపు మెల్లగా తీసి లోపలకి ప్రవేశించాడు.

వీరానందం ముఖం నిప్పులు కక్కుతున్నంత కోపంగా ఉంది. సుబ్బారావు నెలరోజులుగా రోజూ ఓ అరగంటో పావుగంటో లేటు గ్యారెంటీగా అమలు చేస్తున్నాడు.

మేనేజర్‌కి ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చొని తన తలను టేబుల్‌పై పెట్టి కన్నీరు, మున్నీరుగా విలపించసాగాడు సుబ్బారావు.

"ఎందుకు ఆ వెధవ ఏడుపు? " అంటూ అరిచాడు మేనేజర్.

సుబ్బారావు దుఃఖ వేగం మరింత పెరిగింది.

మేనేజర్‌కి చిర్రెత్తుకొచ్చింది. ఏం మొగుడుచచ్చిన ఆడదానిలా తలదించుకొని ఆ ఏడుపేంటి? ఈవేళ కూడా లేటుగా వచ్చినందుకు భారీ సెంటిమెంట్‌తో కూడిన కథ చెప్పాలనుకుంటున్నావా? క్రమశిక్షణలేని నీకు నేను విధించే శిక్షేంటో తెల్సా? నిన్ను డిస్మిస్ చేస్తున్నాను" అంటూ పెద్దగా కేకలు పెట్టాడు. అవి వినిపించి హాలులో వర్క్‌చేస్తున్న స్టాఫంతా వణికిపోయారు.

"ఫర్వాలేదు సార్! నన్ను డిస్మిస్ చేసినా ఫర్వాలేదు. కాని ఈ కన్నీళ్ళు, ఈ నా బాధ అంతా మీ గురించే. కష్టాలు మనుషులకు కాకపోతే మానులకొస్తాయా! ఇటువంటి సమయంలోనే మీరు గుండెను రాయి చేసుకోవాలి. ఇప్పటికైనా మించిపోయిందిలేదు. కరెంట్ ఉండగానే ఇల్లుచక్క పెట్టుకోండి" అంటూ ఏడుస్తూ తలుపు తీసుకుని బయటకెళ్ళి పోయాడు. మేనేజర్ వీరానందానికి అంతా అయోమయంగా తోచింది. సుబ్బారావు ఎందుకు అలా మాట్లాడాడో బొత్తిగా అర్థంకాలేదు. కానీ మొత్తంమీద సుబ్బారావు వీరానందం గుండెల్లో భయాన్ని నాటేసి వెళ్ళిపోయాడు.

"సుబ్బారావు... సుబ్బారావు... ప్లీజ్... అసలు ఏం జరిగిందో చెప్పు" అంటూ సుబ్బారావు వెనుకే పరిగెత్తాడు మేనేజర్.

సుబ్బారావు ఏడుస్తూ బయటికి వెళ్ళడం, అతని వెనుక మేనేజర్ పరుగెత్తడం చూసిన ఆఫీసు స్టాఫంతటికీ అయోమయంగా తోచి మేనేజర్ వెనుక వాళ్ళూ పరుగెత్తడం ప్రారంభించారు.

ఒకరివెనుక మరొకరు ఇలా రోడ్‌మీద పరుగులు పెట్టడంతో ఎవరో జైభజగోవిందా చిట్స్ అండ్ ఫైనాన్స్ కంపెనీ దివాళ తీసినట్లుంది సుమా అనేశారు. ఇది విన్న కొందరు ఖాతాదారులు వాళ్ళవెనుక పరిగెత్తసాగారు.

ఇంతలో తెలుగు సినిమాలోలా పోలీసులు ప్రత్యక్షమయ్యారు. "అసలు విషయం ఏంటో పూర్తిగా చెప్పు ప్లీజ్" అంటూ సుబ్బారావును నిలదీశాడు మేనేజర్!

"ఇంత జరిగాక చెప్పకపోతే, నేను మిమ్మల్ని బ్లాక్‌మెయిల్ చేసిన విలన్ అయిపోతాను, అందుకే చెబుతాను. "నిన్న నేను, మా ఆవిడ మార్నింగ్‌షో సిన్మా కెళ్ళాం. సిన్మా హాలులో మాముందు వరసలో మీఆవిడ... మీఆవిడ..."

"ఫర్వాలేదు! ప్లీజ్! చెప్పు సుబ్బారావు, మా ఆవిడ? "

"మీ ఆవిడ పక్కన మరోతను కూర్చున్నాడు. టీషర్ట్, జీన్‌ప్యాంట్ వేసుకుని, రేబాన్ గ్లాసెస్ పెట్టి యమ స్టయిల్‌గా ఉన్నాడు. సిన్మా చూస్తున్నంతసేపు జోక్‌లు వేసుకోవడం ఒకరిమీద మరొకరు పడి నవ్వుకోవడం, అతను మీ ఆవిడ భుజంమీద చేతులు వేయడం, ఇంకా..."

"స్టాపిట్" అంటూ ఒక్కసారిగా అరిచాడు.

అంతా మేనేజర్‌కేసి అదోలా చూస్తున్నారు.

"నిన్న సిన్మాహాలులో మాఆవిడ పక్కన

కూర్చొని సిన్మా చూసింది నేనే. నిన్న మా పెళ్ళిరోజు. నేను, మాఆవిడ పొద్దున్నే గుడి కెళ్ళి తర్వాత స్టార్‌హోటల్‌లో బ్రేక్‌ఫాస్ట్ చేసి తరువాత మార్నింగ్ షో సిన్మాకెళ్ళాం. మాఆవిడ ముందు నేను ఏమాత్రం తీసిపో కూడదని తలకు రంగేయించుకుని, రేబాన్ గ్లాస్‌లతో మోడరన్‌గా తయారయ్యానంతే. సరేగానీ, సెలవు పెట్టకుండా నువ్వు మార్నింగ్‌షోకి ఎందుకొచ్చినట్లూ?" ప్రశ్నించేడు మేనేజర్ వీరానందం.

**-గుండాబత్తుల శ్రీనివాస్**

## 'క'న్నీటి బొట్టు!

ఇక మరణమే శరణ్యమనుకునేంతగా సమస్యల వలయంలో చిక్కుకున్న జోగారావుకి ఊరి బయటున్న సత్రంలో ఎవరో స్వామీజీ దిగారని తెలిసి మనసులో తళుక్కున ఓ ఆలోచన మెదిలింది.



నేడు దివ్యపురుషులుగా వెలిగిపోతున్న బాబాలు శూన్యంలోంచి ఏవేవో సృష్టించి భక్తులకు ప్రసాదిస్తున్నారు. తన అదృష్టం బాగుంటే ఈ స్వామీజీ బంగారంలాంటిదేదో సృష్టించి తన చేతిలో పడెయ్యకపోతాడా? తన సమస్యలు తీరకపోతాయా?! అని భావించాడు. అలా అనుకోవడమే తడవు జోగారావు తిన్నగా వెళ్ళి స్వామీజీ కాళ్ళపై వాలిపోయాడు.

"స్వామీజీ! నేనీ ఊరి మురికివాడలో ఒక పాకలో అద్దెకుంటున్నాను. దానిక్కూడా అద్దె కట్టలేని స్థితి నాది. ఇంటిల్లిపాదిమీ ఈతిబాధల మధ్య అనారోగ్యం పాలయ్యాం. ఎదిగిన కూతురు గుండెలపై కుంపటిలాగుంది. పెళ్లి చెయ్యాలంటే కట్నం కావాలి. కొడుకు నిరుద్యోగిగా రోడ్లంట తిరుగుతున్నాడు. నా భార్యకు క్షయవ్యాధి. ప్రస్తుతం ఓ పూట తింటే, ఓ పూట పస్తులుంటున్నాం. నా సంపాదన అంతంత మాత్రం. ఏదో నా అదృష్టంకొద్దీ ఇన్నాళ్లకి మీ పాదాలు దొరికాయి. ఇంక నేను మీ పాదాల్నొదల్ను. నాకు మీరేదైనా మార్గం చూపాలి'' అంటూ జోగారావు స్వామిజీ కాళ్లట్టుకుని గోడుగోడున ఏడ్చాడు.

స్వామీజీ చిన్మయానందంగా నవ్వారు. నవ్వి- "నాయనా! లే! ఈ లోకమంతా

బాధలమయం. అసలు సుఖంగా వున్న వాడెవడు చెప్పు?! అందుకే మనిషి ఈ లోకంలో వుండీ లేనట్లు బతకాలి. లేకా వున్నట్లు బతకాలి'' అన్నారు స్వామిజీ.

"స్వామీ! తాము చెప్పే ఒక్క మాటా నాకర్థం కాలేదు. దయచేసి నాకు విపులంగా చెప్పండి'' వేడుకున్నాడు జోగారావు.

"బిడ్డా! తామరాకుపై నీటిబొట్టులా బతకడం నేర్చుకో. నీ పరిసరాల్ని నువ్వు మర్చిపో. నీలో నువ్వు అంతర్గతంగా ఆనందం పొందు. అప్పుడు ఈ బాధలేవీ నిన్నంటవు'' చెప్పాడు స్వామీజీ.

"అదెలా సాధ్యం స్వామీజీ? ప్రకృతిలో వున్న మనిషి ప్రకృతికి అతీతంగా ఎలా వుండగలడు? పరిసరాల ప్రభావం మనిషిపై పడకుండా వుంటుందా? ప్రచండమైన గాడ్పులకీ గడ్డకట్టే చలికీ ఏ మనిషీ తట్టుకోలేడే? కాలకృత్యాలు తీర్చుకోకుండా ఒక్కరోజు కూడా ఉండలేమే? అలాటిది తామరాకుపై నీటిబొట్టులాగు మనమేలాగవుతాం స్వామీ?" అన్నాడు జోగారావు.

"దానికి యోగాభ్యాసం కావాలి నాయనా! నన్ను చూసి నేర్చుకో..." అంటూ స్వామీజీ ఇంకా ఏదో చెప్పబోతున్నారు.

ఇంతలో ఎవరో ఒకావిడ నుదుట పెద్ద కుంకుమ బొట్టుతో అపరకాళికాదేవిలా ఆ గదిలో ప్రత్యక్షమైంది.

"ఇన్నాళ్లూ ఎక్కడ చచ్చావో అనుకున్నాను. నీ బోధలతో అన్ని వూళ్లూ తగలెట్టి ఆఖరికి మనూళ్లోనే తగలడ్డావన్నమాట?!" అని జోగారావుకేసి తిరిగి "నాయనా! వీడి మాటలు వినకు. 'వద్దు మొర్రో!' అన్నా వినకుండా అరడజనుమంది పిల్లల్ని కనేసి ఏదో కాన్పు టైముకు ఇలా సన్యాసంలో కలిసిపోయిన సన్నాసి వీడు. ఏం!? ఇప్పుడు నన్నూ నా పిల్లల్నీ ఎలా బతకమన్నావూ'' అంటూ ఆ వీరవనిత మూలనున్న చీపురు కట్టనందుకుని స్వామీజీ మీదకి లంఘించింది. జ్ఞానోదయం కావటంతో స్వామీజీకన్నా ముందే అక్కడ్నించి లేచి పరుగందుకున్నాడు జోగారావు.

-రాంరవి

---

## భలే భార్య

"స్రవంతిగారు మూడునెలలనుంచి వడ్డీ ఇవ్వడం లేదు... ఒక్కసారి గుర్తుచేయండి... మేం రేపు ఉదయాన్న మళ్ళీ వస్తాం..."

వాళ్ళ మాటలు మనోహర్‌కు అప్పుడప్పుడు గుర్తుకు వస్తూనే ఉన్నాయి... అసలు స్రవంతికి అప్పు చేయాల్సిన అవసరం ఏమొచ్చిందో...? తనకు ఇంతవరకు ఎందుకు చెప్పలేదో... అతనికి అర్థంకావడంలేదు. తనంతట తానుగా చెప్పినప్పుడే వినాలని అతని ఆలోచన. అందుకే వడ్డీ సంగతి ఆమెకు గుర్తుచేయలేదుతను మరుసటిరోజు ఎలాగూ తెలుస్తుంది కదా అని.

ఉదయం పది గంటలవుతుండగా తలుపు చప్పుడైంది. "వస్తున్నా..." అంటూ తలుపు తీసాడతను.

"స్రవంతిగారు ఉన్నారాండి'' అన్నాడు వాళ్ళల్లో ఒకతను.

"ఆ... ఆ... ఉన్నారు. రండి లోపలికి'' అంటూ ఆమెను పిలవడానికి లోనికి వెళ్ళాడతను.

లోపలినుంచి వచ్చిన ఆమెను చూడగానే వాళ్లిద్దరు లేచి నిలబడ్డారు.

"నమస్కారమమ్మా... బావున్నారా''

"ఆ...ఆ... నమస్తే... కూర్చోండి'' అంటూ తను కూర్చుంది స్రవంతి.

"చెప్పండి ఏం పనిమీద వచ్చారు?" అడిగిందామె చిరునవ్వుతో.

"అది... అదేనమ్మా! మీరు గత మూడు నె...ల...లు...గా''

"అవునండి... నాకు గుర్తుంది. నేను ఆ విషయం ఫోన్ చేసి చెబ్దామని రెండుమూడు సార్లు ప్రయత్నించాను. మీరు ఫోన్‌లో దొరక లేదు. ఇదిగో... ఈరోజు ఆఫీసునుంచి అటు వచ్చి ఇద్దామనుకుంటున్నాను. ఈ లోపు మీరే వచ్చారు..." అంటూ లోపలికి వెళ్ళి డబ్బు తెచ్చిచ్చింది ఆమె.

"అమ్మా... మరోలా అనుకోకండి... మే మూ దీనిమీద బతకాల్సిన వాళ్ళమేకదా అందుకని అడగాల్సి వచ్చింది''

"లేదులెండి... నేనే వచ్చి చెప్పి ఉండా ల్సింది. ఏమైనా ఆరోజు అవసరానికి మీరు



ఆదుకున్నారు. నా జీవితాంతం ఈ విష యంలో మీకు రుణపడి ఉంటాను. నేను అన్నట్టుగానే వచ్చేనెలనుంచి నెలకు కొంత చొప్పున అసలుకు కూడా జమచేస్తాను. ఈ నెలకు మాత్రం క్షమించాలి'' అంది స్రవంతి అభ్యర్థిస్తున్నట్లుగా.

"మంచిదమ్మా! వెళ్ళొస్తాం, వస్తాం సార్' అంటూ వాళ్ళిద్దరు వెళ్ళిపోయారు.

అదంతా ఓ ప్రేక్షకుడిలా చూస్తూండిపో యాడు మనోహర్. భార్య తనకు తానుగా ఏదైనా చెప్తుందేమో అనుకున్నాడు. ఇక ఆగ లేకపోయాడు.

"స్రవంతి... ఏమిటిదంతా?... నువ్వు అంత డబ్బు నాకు తెలీకుండా అప్పుచే యడం ఏమిటి? అసలు ఆ అవసరం ఏమొ చ్చింది నీకు?"

"మీరు నన్ను అపార్థంచేసుకుంటున్నా రు. నేను ఇంత డబ్బు పెళ్ళికి ముందు అప్పుచేసాను. పెళ్ళికి ముందు మిమ్మల్ని అడగలేను కదా!

"ఇక 'ఎందుకు?' అంటారా. మిమ్మల్ని కొనుక్కోడానికి

అవును. అలా ఆశ్చర్యపోకండి. మిమ్మ ల్ని కొనిపెట్టేంత స్థోమత మా వాళ్ళకు లేదు. అప్పుచేయకుండా కొనుక్కునే స్థోమత నాకు లేదు. పైగా... ఉద్యోగం వచ్చినప్పటినుంచి నాకు కావాల్సిన వాటిని నేనే కొనుక్కుంటు న్నాను. అలాంటప్పుడు మొగుడ్ని మాత్రం ఎందుకు కొనుక్కోకూడదు? అందుకనే అప్పుచేయాల్సి వచ్చింది'' చాలా నెమ్మది గా నిర్భయంగా చెప్పిందామె.

"మొత్తం ఎంత?" కోపాన్ని నిగ్రహించు కుని అడిగాడతను.

"ఎంతండి. మొత్తం లక్షన్నర. దాంట్లో లక్షరూపాయిలతో మిమ్మల్ని కొనుక్కున్నా

నా. యాభైవేలు ఖర్చులకు సరిపోయాయి''

"నెలకు వందకు మూడు రూపాయిలు వడ్డీనండి. అది నాకు కాబట్టి. ఇంతని ఏముంది? అవసరంబట్టి రేటు మారుతుంటుంది. ఏం చేస్తాం. తప్పదు కదా!" అంది కాస్తంత అమాయకంగా మొహం పెట్టి.

— శైలబాల

---

## ఎదురు దెబ్బ

రవీంద్రనాథ్ సెక్రటేరియట్లో సెక్షన్‌ఆఫీసర్.

అతనితో పనిపడి చాలాకాలం తర్వాత వచ్చి కలుసుకున్నాడు అప్పారావు. కలిసీ కలవగానే తను వచ్చిన పని చేస్తే బాగుండదనీ, కాస్త ముఖస్తుతి వచనాలు పలకాలనీ అనుకున్నాడు. అప్పట్లో రవీంద్రనాథ్ కథలు రాసేవాడనీ, ఆదర్శం అనే కథల సంపుటి సొంతంగా అచ్చుకొట్టించుకుని కొనేవాళ్ళులేక తలా ఒకటి కాంప్లిమెంటరీ కాపీలు పంచాడనీ గుర్తుకొచ్చింది అప్పారావుకి.

"ఏమిటీ కథలు రాస్తున్నావా? " అడిగాడు అప్పారావు.

"నా బొంద? తీరికేదీ? తొమ్మిదింటికల్లా నాలుగు ముద్దలు కతికి టిఫిన్ బాక్సు పట్టుకుని పాతిక మైళ్ళు సిటీబస్సులో ప్రయాణం చేసి రావడం. ఇక ఆఫీసులో క్షణం తీరిక లేదు. దమ్మిడీ ఆదాయం లేదు అన్నట్లుంది నా పని. ఇక సాయంకాలం ఆదరాబాదరా బయల్దేరి సిటీబస్సులో చచ్చీచెడీ ఇంటికెళ్ళేసరికి ఎనిమిది దాటుతోంది? కథలు రాయడం కాదు గదా! పత్రికలు చదవడం గూడా లేదు. ఇంటికెళ్ళేసరికి నీరసం, నిస్సత్తువ ముంచుకొస్తాయి. కాళ్ళు చాపి కాసేపు టీ.వీ.ముందు కూర్చోవడం, నాలుగు ముద్దలు తిని పడుకోవడం. వెధవ రొటీన్! అంతా మెకానికల్ లైఫ్..." చెప్పాడు రవీంద్రనాథ్.

"సిటీలో అంతే మరి. దేనికీ తీరిక వుండి చావదు. అదే నువ్వు బెజవాడలో వుండి వుంటే పెద్ద రచయితవై పోయేవాడివే నోయ్! అప్పుడు నువ్వు రాసిన కథలు ఎంత బాగుండేవనీ! అప్పుడప్పుడూ పత్రికలు తిరగేస్తున్నాగా! అబ్బే! ఒక్కడికీ నీ స్టాండర్డ్ కనిపించడం లేదు నాకు. అన్నీ చెత్త కథలు వస్తున్నాయి" అన్నాడు అప్పారావు.

రవీంద్రనాథ్ మొహమాటంగా నవ్వాడు.

"అసలు అంత పరమ చెత్త కథలు పత్రికల వాళ్ళెందుకు అచ్చుగుద్దుతున్నారంటావ్? " అడిగాడు అప్పారావు.

"ఏదో! వచ్చిన వాటిలో మంచివి చూసి వేస్తుంటారు. అంతకంటే వాళ్ళేం చేస్తారు? " చెప్పాడు రవీంద్రనాథ్.

"నీ కథల సంపుటి 'ఆదర్శం' ఎంత గొప్ప కథల సంపుటనీ, అవునూ ఆ కథలకి సాహిత్య అకాడమీ అవార్డు వచ్చిందా? "

"అబ్బే! లేదోయ్!"

"ఛీ... ఛీ... ప్రతిభకి ఇండియాలో ప్రోత్సాహం లేదోయ్! తెలుగు వాళ్ళకి అసలుదిక్కులేదు. అవార్డులు గూడా రికమండేషన్లతోనే వస్తుంటాయ్! మరీ దారుణం లేవోయ్"

"పోనీలేవోయ్! ఇప్పుడు మనకొచ్చిన నష్టం ఏముంది? " అని నవ్వాడు రవీంద్రనాథ్.

"నష్టం అని కాదు. ఒక రచయిత సొంత డబ్బు ఖర్చుపెట్టి అచ్చుకొట్టించుకుంటే ఎవరైనా ప్రోత్సహించాలా లేదా? దేన్నికైనా సంస్కారం వుండాలోయ్! అది వున్నప్పుడే

మరొకడి గొప్పతనం మెచ్చుకోగలుగుతారు. మనవాళ్ళకి అది లేదుగా!"

అప్పట్లో తన కథల సంపుటి కొనమని అడిగితే డబ్బుల్లేవని నాటకమాడడం, తను సంతకం చేసి కాంప్లిమెంటరీ కాపీ ఇవ్వడం గుర్తొచ్చిన రవీంద్రనాథ్ అప్పారావు మాటలకు నవ్వుకున్నాడు.

"నీ దగ్గర ఆ కథల పుస్తకాలుంటే ఒక వంద ఇవ్వవోయ్ నా సర్కిల్లో అమ్మిపెడతాను. ఎందుకు అడుగుతున్నానంటే అప్పుడు నువ్వు ఇచ్చిన కథల పుస్తకం ఇప్పటికీ అప్పుడప్పుడూ మళ్ళీమళ్ళీ చదువుతూ వుంటాను. అంతేకాదు నా ఫ్రెండ్స్‌తో గూడా చదివిస్తూ వుంటాను. వాళ్ళేమో మాకొక పుస్తకం వుంటే తెచ్చిపెట్టండని తెగ ప్రాధేయపడుతూ వుంటారు" అన్నాడు అప్పారావు.

"ఎప్పుడో పాతికేళ్ళక్రితం అచ్చయిన పుస్తకాలు ఇప్పుడెక్కడ వున్నాయ్! నిజం చెప్పాలంటే నా దగ్గర ఒక్క కాపీ గూడాలేదు"

"అన్నీ అమ్ముడు పోయాయా? మళ్ళీ ప్రింట్ చేయించలేకపోయావా?"

"ఆఁ... ఆ రోజుల్లోనే కొని చదివే వాళ్ళు ఎవరు? బెజవాడలో ఒక పబ్లిషర్‌కి ఐదొందలు కాపీలిచ్చా! అన్నీ లైబ్రరీలకు అమ్ముకుని మొండిచెయ్యి చూపించాడు. నా దగ్గర వున్నవన్నీ కాంప్లిమెంటరీ కాపీల కింద ఖర్చయిపోయాయి. ఇక మళ్ళీ కొట్టించడమంటావా? టీ.వీ.లొచ్చాక పుస్తకాలెవరు చదువుతున్నారు? గొప్ప పాపులర్ రచయితల పుస్తకాలే వేసే వాళ్ళు లేరు. ఇక నా బోటిగాడి పుస్తకాలు ఎవరు కొంటారు?"

"అవునవును" అన్నాడు అప్పారావు.

"ఆ మధ్య మా కోడలు అడిగింది. మావయ్యా! మీరేవో కథలు రాసేవారంటగా అని. చూపిద్దామంటే పుస్తకం దొరకలేదు. ఆఖరికి ఆబిడ్స్‌లో ప్లాట్‌ఫారంమీద పాతపుస్తకాలు అమ్మేవాడి దగ్గర దొరికింది"

"నీ కథల పుస్తకమే"

"అవునోయ్! ఆదర్శం అని కథల సంపుటి. గమ్మత్తు చూశావా? అది నీకు నేను కాంప్లిమెంటరీగా ఇచ్చిందే!" అన్నాడు రవీంద్రనాథ్.




– వాణిశ్రీ

# ఏరిన ముత్యాలు

★ మంచి భార్య, మంచి ఆరోగ్యం- ఇవే ప్రతి పురుషుడికి గొప్ప సంపదలు

—థామస్ ఫుల్లర్

★ విద్యార్థి జీవితం విలాసయుతంగా ఉండుటకంటే సామాన్యంగా ఉండుటే మంచిది.

—బాబూ రాజేంద్రప్రసాద్

★ మనసులోని ఆలోచన లేక యోచన, మాటలోని సూచన, క్రియలోని ఆచరణ మూడు ఒకటిగా ఉండాలి.

—సత్యసాయిబాబా

★ గమ్యం, గమనం రెండూ ఉత్తమంగా ఉండాలి, క్రమశిక్షణ లోపిస్తే క్షీణదశ తప్పదు.

—మహాత్మాగాంధి

★ మనకున్న అన్ని ఆశలను గురించి మనకు తెలియకపోవడమే మంచిది.

—రాక్‌పోకాల్ట్

★ ప్రపంచంలోని అన్ని పుస్తకాలకన్నా జీవితచరిత్ర చాలా విలువైన గ్రంథం, ఉత్తమమైన ప్రయోజనకరమైన పఠనానికి అది సర్వదా యోగ్యం.

—కార్లయిల్

★ ఉత్తరాలు వ్రాసిన వ్యక్తికి అవి అందుకున్న వ్యక్తుల స్వభావాలకు ప్రతీకలు.

—చెస్టర్ ఫీల్డ్

★ జీవితలక్ష్యం శీలం కావాలి. అంతేకాని ఆనందం కాకూడదు.

— హెచ్.డబ్ల్యు.భాషన్

★ ద్వేషించుట సులభం కానీ, ప్రేమించుట ఆరోగ్యం.

—సర్వేపల్లి రాధాకృష్ణన్

★ వెలుతురులో నీడ సహజం- జీవితంలో తప్పులు సహజం.

—ఎరస్ట్‌జాంగర్

★ జీవితంతో సంబంధం లేని భావాలు మానసికంగా బరువైనవి.

—ఎ.ఎన్.నైట్ హేడ్

★ తెలుగు కావ్యాల్లో శృంగార రసానికి ఉన్న ప్రాధాన్యత హాస్యరసానికి లేదు.

—గురజాడ అప్పారావు

★ మానవుని అత్యుత్తమ శక్తి ధ్యానం. —అరిస్టాటిల్

సేకరణ: చింతా కృష్ణమోహన్

# చతుర ప్రపంచం

## అపవిత్ర వాతావరణంలో ఆలయాలు

**మ**నిషి జీవితంలో మతానికి చాలా ప్రాముఖ్యత వుంది. మనిషిని లౌకిక మార్గంనుంచి, ఆధ్యాత్మికపథంవైపుకి మళ్లించగలిగేదీ, అందుకు దోహదం చేసేదీ 'మతం'. అయితే మరి... ఇప్పుడు మనిషి ఆ మతాన్ని అండగా చేసుకుని పురోగమిస్తున్నాడా లేక, తిరోగమించి మానవత్వంనుంచి దానవత్వం వైపుకి మళ్లుతున్నాడా అన్న ప్రశ్నకు 4, 5 ఏళ్ల పసివాడు కూడా సరైన సమాధానమే చెపుతాడు.




భారతప్రభుత్వం దేశంలోని ముస్లింలకు చెందిన మసీదులన్నీ చెక్కుచెదరకుండా భద్రంగానే వుండేలా జాగ్రత్తలు తీసుకుంటోంది. అయితే పాకిస్తాన్‌లో అక్కడక్కడ వున్న హిందూ దేవాలయాలు ఇలాగే భద్రంగా చూడబడుతున్నాయా అన్నదానికి సమాధానం 'లేదు' అనే. లాహెూర్‌లోని షామిలీ దర్వాజా ఏరియాలో ఓ హిందూ దేవాలయం వుంది. ఆ దేవాలయ ప్రాంగణంలో ఓ పక్క ఓ వ్యక్తి బట్టలు ఇస్త్రీ చేస్తుంటే, మరోపక్క ఇంకోవ్యక్తి సిగరెట్లు, కిళ్లీలు అమ్ముతూవుంటాడు. ఇంక... విగ్రహానికి దగ్గరలోనే చెత్తాచెదారాల కుప్పలు కనిపిస్తాయి. ఎక్కడ చూసినా సాలిగూళ్లతో భయంకరంగా వుంటుందా ఆలయం. విగ్ర

హాన్ని చూస్తే ఎన్నోసార్లు ఊడబెరికి మళ్ళీ స్థాపించిన చిహ్నాలు కనిపిస్తాయి. దేవాలయ శిఖరం విరిగిపడిపోయివుంది. ఇంతకీ ఆ దేవాలయ పూర్వాపరాలేమిటంటే అది ఓ పురాతనమైన చారిత్రాత్మకమైన శీతలాదేవి గుడి. ఒకానొకకాలంలో సుమారు 10 వేల మందిదాకా భక్తులు ఈ దేవాలయాన్ని సందర్శించేవారు. శ్రీరామనవమి, కృష్ణాష్టమి దినాలలో ఆ దేవాలయంలో ప్రత్యేక అలంకరణలు జరిగేవి.

ఇండియా, పాకిస్థాన్ యుద్ధసమయంలో ఈ దేవాలయాలను పాడుచేయడం ప్రారంభమైంది. దేవాలయాల్ని పడగొట్టడమే కాకుండా, విగ్రహాల ఆభరణాలు కూడా దొంగిలించబడ్డాయని తెలుస్తోంది. ఈనాటికీ ఈ దుష్కార్యాలు జరుగుతూనే వున్నాయంటారు కొందరు. కొంతమంది భారతీయులు దశాబ్దాలక్రితం అక్కడే స్థిరపడిపోవడంతో భారతదేశానికి తిరిగి రాలేక అక్కడే వుండిపోయారు.

లాహెూర్‌లోను, ఆ చుట్టుపక్కల నివశించే హిందువులు అక్కడి డిస్ట్రిక్ట్ మేజిస్ట్రేట్‌కి పిటిషన్ పెట్టుకున్నారు. "మా దేవాలయాలను బాగుచేయడమో లేక పునర్నిర్మించడమో చేస్తే ఇక్కడున్న హిందువులం పూజా కార్యక్రమాలని నిర్వహించుకుంటాం" అని! ఆ విన్నపానికి సమాధానం రాలేదు.

లాహెూర్‌లోనే సాల్మీచౌక్‌లోని రామమందిరం కూడా శిథిలమయివుంది. ఒకప్పుడు ఆ దేవాలయంలో 8 అడుగుల రామవిగ్రహం, చక్కటి ఆభరణాలతో అలంకరించబడివుండేది. ప్రస్తుతం దేవాలయం గోడలు తప్ప ఇంకేమీ కనుపించవు. ఈ ఎనిమిది అడుగుల చలువరాయి రామవిగ్రహం ఓ అమెరికన్ యాంటీక్ డీలర్ పరమయిందంటున్నారు. ప్రస్తుతం రామవిగ్రహం స్థానంలో అంత ఎత్తున చెత్తకుప్ప మాత్రం వుంది.

మరో దేవాలయం పరిస్థితి మరింత భయంకరంగా పబ్లిక్ లావెటరీలా తయారయిందంటున్నారు. మరోచోట వున్న హనుమాన్‌గుడి, కాళీమాత గుడి కూడా అలాంటి స్థితిలోనే వున్నాయని తెలుస్తోంది. ఎవరైనా ముస్లిములు పాకిస్థాన్‌నుంచి ఇండియాకి వస్తే ఇక్కడి మసీదులు చూసి సంతృప్తిగా తిరిగి వెడతారుగానీ, హిందువులు పాకిస్థాన్ వెళితే అక్కడి దేవాలయాలు దర్శించాక వాళ్ళ మనోస్థితి అలా ఉండటం లేదంటున్నారు

---

## 'అన్నం' కథ

వరి అన్నాన్ని ప్రజలు శతాబ్దాలనుంచీ ఆహారంగా తీసుకుంటూ వస్తున్నా సదరు వరి గురించిన కొన్ని ముఖ్య విషయాలు చాలామందికి తెలియకపోవచ్చును.

పచ్చగడ్డి మొక్కజాతిలా కనిపించే వరి మొక్క సామాన్యంగా 60 నుంచి 120 సెం.మీ. ఎత్తుకు ఎదుగుతుంది. ఆసియాలోని వైల్డ్ ప్లాంట్స్ నుంచి ఈ వరిమొక్క వచ్చిందని ఓ కథనం. మొట్టమొదట వరిని పండించి, ఆహారధాన్యంగా ప్రపంచానికి వెల్లడించింది సౌత్‌ఈస్ట్ ఏషియా, సదరన్ చైనా అంటున్నారు. 1970లో చైనాలో దొరికిన కొన్ని తవ్వకాల్లో దొరికిన బియ్యపుగింజలు 7,000 సంవత్సరాల నాటివి అంటున్నారు శాస్త్రజ్ఞులు.

పరిశోధకులు చెప్పేదేమిటంటే క్రీ.పూ. 5000 సంవత్సరాల క్రితం భారతదేశపు అడవులలోని 'నివర్' మొక్క పరిణామం చెంది వరిగా రూపాంతరం చెందిందని. థాయ్‌లాండ్‌లో దొరికిన మచ్చుగింజలు 4000 సంవత్సరాలకి పూర్వంవి అని ఓ కథనం వుంది.

ఆసియాలో వరి కేవలం ఆహారపదా

ర్థంగానే కాకుండా మరెన్నో విధాల ఉపయోగపడుతుంది. వరినుపయోగించి ప్రాచీన చైనాదేశీయులు రకరకాల ఎముక వ్యాధులను, ఉదర సంబంధమైన వ్యాధులను, విషజ్వరాలను తగ్గించేవారు. అల్లాన్ని వేపిన బియ్యంతో, సారాయితో ముద్దచేసి ఈ ముద్దను గుడ్డలో మూటకట్టి ఆ మూటను నొప్పి వున్న భాగాల్లో కట్టేవారు.

బియ్యానికి పసుపు కలిపి అక్షింతలుగా ఆశీర్వాదానికి ఉపయోగించే పద్ధతి భారత, చైనా దేశాలలో చాలాకాలంనుంచే అమలులో వుంది. జపానీస్ జానపదగీతాలు ఏం చెబుతాయంటే సూర్యభగవానుడు స్వర్గసీమల్లో ధాన్యపు విత్తనాలను వెదజల్లాడని.

జమీందార్ల ఆధిక్యత వారికున్న వరిచేలను బట్టే గుర్తించేవారు ఆ రోజుల్లో. యుద్ధంలో వీరోచితంగా పోరాడిన సైనికులకు బియ్యాన్ని ఇచ్చి సత్కరించేవారు ఆ కాలంలో.




అమెరికా తన దేశ వాతావరణానికి సరిపడ విభిన్నరకాల వరి పంటలను పండించేది. కాలిఫోర్నియాలో ఆ రోజుల్లో ఎకరానికి 2,890 కిలోల బియ్యాన్ని పండించేవారు. ఇది ప్రపంచ రికార్డు. మామూలు వరి పంటకు ఇది మూడు రెట్లుండేది.

ఊడ్పులు, కోతలు, మిల్లు పట్టడం వగైరా అన్ని పనులు మెషీన్లతో చేసేవారు అమెరికాలో. 3 నెలల్లో పంటచేతికి వచ్చేది.

ప్రపంచమంతా పరిశీలిస్తే రకరకాల బియ్యాన్ని రకరకాల పద్ధతుల్లో వండుతారు. యూరప్, సౌత్ ఆఫ్రికాలలో చాలా పొడవుగా వుండే బియ్యాన్ని పండిస్తారు. దాన్ని రైస్ సూప్స్, సలాడ్స్‌లో ఎక్కువ వాడతారు. జపాన్, కొరియా, సౌత్ ఈస్ట్ ఆసియాలలో మరీ పెద్దవికాక, మరీ చిన్నవిగాక మధ్య సైజులో వుంటుంది బియ్యపు గింజ. ఇది ఒక్క ఉడుకు ఎక్కువయితే ముద్దలా తయారవుతుంది. దీనితో స్వీట్స్ చేస్తారు ఆయా దేశాలవారు.

కొన్ని ప్రాంతాల్లో బియ్యాన్ని ఉపయో

గించి బీర్‌ను, సారాయిని కూడా తయారుచే స్తారు.

ఫిలిప్పీన్స్‌కు చెందిన ఇంటర్నేషనల్ రీసె ర్చి ఇన్‌స్టిట్యూట్‌వారు 60,000 రకాల వరి గింజలపై పరిశోధన చేశారు. రేడియేషన్ టెక్నిక్ ద్వారా ఒక రకమైన పొట్టిగింజలా కనిపించే బియ్యాన్ని తయారుచేశారు. దీన్ని పండించడం చాలా తేలిక.

ప్రపంచం మొత్తంమీద వరిని ఇష్టంగా తినేవారు చాలామందే వున్నారు. ఇటాలియ న్లు రైస్‌నుంచి చాలా రుచికరమైన పిండి వంటలు చేస్తారు. స్పెయిన్ ప్రజలు బియ్యా న్ని చేపలు, చికెన్ మొదలైన వాటితో కలిపి 'పయేలా' అనే ఓ ఖాద్య పదార్థాన్ని తయా రుచేస్తారు. లాటిన్ అమెరికావారు బియ్యా న్ని చికెన్‌తో కలిపి ఎరోజ్‌కాన్‌పోలో అనే ఓ అద్భుతమైన ఆహారపదార్థాన్ని తయారుచే స్తారు.

ఫ్రాన్స్, సెంట్రల్ ఈస్టిండియాలలో రకర కాల మాంసాలను బియ్యంతో కలిపి రుచికర మైన పలావ్‌లను తయారుచేస్తారు.

జపనీయులు బియ్యంతో చేసే ప్రత్యేక ఖాద్యపదార్థం పేరు 'సుషి'. ఇండోనేషియా వారు కూడా బియ్యంతో పిండివంటలు చెయ్యడంలో దిట్టలే. చైనీయులు చెప్పనే అఖ్ఖరలేదు. చక్కని కేక్‌లు, న్యూడిల్స్ ఇలా ఎన్నోరకాలు తయారుచేస్తారు.

ప్రపంచంలో అన్నిదేశాలకంటే చైనా, జపాన్ దేశాల్లోనే వరి ఎక్కువగా తింటారు. జపాన్‌లోని చిన్న చిన్న దేవాలయాల్లో వరి పంటకి అధిదేవతల విగ్రహాలుంటాయి. జపాన్‌లోని కొత్త సంవత్సరం బియ్యంతో తయారైన 'మోచి' అనే కేక్ తినడంతో ప్రారంభమవుతుంది.

బియ్యాన్ని ఎక్కువగా కడగటం, వా ర్చడం చేస్తే అందులోని విటమిన్స్ పోతాయి అంటారు పెద్దలు. బియ్యంలో కార్బోహైడ్రే ట్స్ ఎక్కువగా వున్నమాట నిజమే అయినా అందులోగల ప్రోటీన్‌లో ఎనిమిదిరకాల ఎమి నోయాసిడ్స్ వున్నాయి. అయినా నేటికాలు ష్య వాతావరణంలో ఎరువుల వాడకంతో రైస్ ఎక్కువగా తినడంవల్ల మేలుకన్న కీడే ఎక్కువ జరుగుతోందని చెప్పక తప్పదు.

## 'మీ ఆరోగ్యానికి'

**ఈ** రోజుల్లో ఏ పత్రిక తిరగేసినా తప్ప కుండా ఓ పేజీ 'మీ సౌందర్య సాధనకు' అన్న విషయానికి కేటాయించబడి వుంటుంది. చదివేటప్పుడు ఎంతో ఆసక్తిక రంగా చదివేస్తాంగానీ, పాటించేటప్పుడు మా త్రం చాలామంది శ్రద్ధ చూపించరు. అయితే ఇలా సౌందర్యాభివృద్ధికి కాకుండా 'ఆరోగ్యా నికి' అంటూ మహమ్మద్‌నబి అనే ఓ ము స్లిం గురువుగారు చక్కని చిట్కాలను మనకు అందిస్తున్నారు. నిజానికి మన వంటింట్లో మన పోపుల పెట్టెలోనే ఎన్నో రోగాలను తగ్గించే అద్భుత ఔషధాలున్నా యని చాలామంది మహిళలకు తెలియదని అంటారాయన. ప్రజలు ఆయన బోధనలక న్న ఆయన చెప్పే వైద్యచిట్కాలకోసమే ఎక్కువగా వెడుతూవుండేవారు ఆయన వద్దకు.

మూత్రపిండాల్లో రాళ్లున్నట్లయితే నల్లజీల కర్రపొడిని తేనెతో కలిపి తీసుకుంటూవుంటే క్రమేపీ ఆ రాళ్లు కరిగిపోతాయి. శరీరంమీద ఎక్కడయినా వాపు కనిపిస్తే సబ్బునురగని ఉప్పుతో కలిపి ఆ ప్రదేశంలో మర్దనా చేస్తే తగ్గుతుంది.

కొందరికి లూకోడెర్మా వస్తుంది (తెల్లమ చ్చలు). పూర్తిగా వస్తే కష్టమేగానీ ప్రారంభద శలో మచ్చలు కనిపించగానే మధ్యాహ్నం, రాత్రి భోజనానికి కూర్చోబోయేముందూ, తర్వాత ఓ చిటికెడు ఉప్పు నాకాలి. ఇక

భారీకాయం వారికి కూడా ఓ చిట్కా చెప్పారా యన. మేక కాలేయాన్ని ఆవుపాలలో ఉడి కించి తినాలి. పొరపాటున పాలకి కక్కుర్తిప డి నీళ్లలో ఉడికించితే బరువు పెరిగిపో తుందండోయ్. పెరగడానికి నీళ్లూ, తరగడా నికి పాలూ మరి. నల్లజీలకర్ర, వాము ఆకులను ముద్దచేసి దాన్ని కళ్లమీద పెట్టు కుంటే కొన్ని నేత్రవ్యాధులు మటుమాయం.

నువ్వులు కూడా ఆరోగ్యాన్ని ప్రసాదించ డంలో ప్రత్యేకపాత్ర వహిస్తున్నాయంటారా యన. తీరికున్నప్పుడు ఓ రెండు నువ్వు గింజలు నోట్లో వేసుకుని నములుతూ వుంటే

మైన బేబీ కావాలనుకునే గర్భిణీ స్త్రీలు ఆ 9 నెలలూ (దొరికితే) అప్పుడప్పుడు పుచ్చ కాయ తినాలి.

జ్ఞాపకశక్తికి అద్భుత ఔషధం తేనె. ఈ తేనెను ఏదైనా పళ్లరసంతో కలిపి తీసుకుంటే అది జ్ఞాపకశక్తిని వృద్ధి చేస్తుంది. తేనెను విడిగా మాత్రం తీసుకోకూడదంటున్నారు నబీ. మరో చిత్రమైన... తేలికైన వైద్యం... దేనికో తెలుసా... టెన్షన్స్‌నుంచి, వర్రీస్ నుంచి బయటపడేందుకు... మన భోజ నంలో ఎక్కువగా ఆనపకాయ వుండేలా చూసుకోవడమే.




చాలు. ఇది నరాలకు మంచి శక్తినిస్తుంది. నువ్వులను మెత్తగా దంచి కొబ్బరినూనెతో కలిపి కురుపులకి, గాయాలకి రాస్తే మానిపో తాయి.

వెల్లుల్లి పళ్లకి చాలా మేలు చేస్తుంది. కొద్దిగా వెల్లుల్లి పాయలను నీళ్లలో ఉడకబెట్టి ఆ నీటిని పుక్కిలించి ఉమ్మేయాలి. ఇలా రోజూ చేయగలిగితే కొన్నాళ్లకి పళ్లు, చిగుళ్లు అన్నీ పరిశుభ్రపడి ఆరోగ్యకరంగా, శక్తి వంతంగా వుంటాయి.

మిలమిల మెరిసే మేనిఛాయతో అంద

బిల్వఫలం అంటే మారేడుపండు అని అందరికీ తెలిసే వుంటుంది. ఈ గుజ్జు పాలిచ్చే తల్లులకు వరదాయిని. పాలను సమృద్ధిగా పడేలా చేస్తుంది. ఇక్కడ మనం తెలగపిండిని కూడా చేర్చచ్చు. తెలగపిండిని కూరగానో, పప్పుగానో చేసి బాలింతలకి పెడితే పాలు పడతాయి.

ఎవరైనా తిన్నది అరక్క బాధపడు

తుంటే కీరా (ఆకుపచ్చ దోసకాయ) ముక్కలు ఉప్పు అద్దుకుని తింటే మంచిది. ఈ పని భోజనం అయిన వెంటనే చేస్తేనే ఫలితం.

తేలు కుట్టిన చర్మభాగాన్ని ఉప్పు కలిపిన నీటితో కడిగితే బాధ ఉపశమిస్తుందంటున్నారుగానీ, విషంమాట చెప్పలేదాయన మరి. కలరా వచ్చి పడుకున్న రోగి గదిలో అగరువత్తులు, సాంబ్రాణి ధూపాలు వేసి అత్తర్లు జల్లితే ఆ సూక్ష్మక్రిములు వేగంగా చుట్టుపక్కలకి వ్యాపించడాన్ని అరకట్టవచ్చు అంటున్నారు.

కోడి మాంసం మేహనెప్పులకి చాలా మంచిదని, మేధోశక్తిని కూడా పెంచుతుందని అంటారు. ఇకపోతే ఆఖరుగా మనకు అంటుబాటులో లేని ఓ కాయ గూర... తింటే ఆనందకరమైన చిరకాల దాంపత్యజీవితం నడుస్తుంది అంటారు. అయితే 'లాబియా' అనే ఆ కూర అరేబియాలో మాత్రమే దొరుకుతుంది మరి.

---

## 'తత్వం' చెబుతున్న తామర

పద్మపత్రాక్షీ, కమలనేత్రి, కంజదళాయతాక్షీ అంటూ స్త్రీల నయనాలను, లేదా మృదుచరణాలను సున్నితమైన, సుందరమైన పద్మాలతో పోలుస్తారు కవులు. పద్మానికి సాహిత్యపరంగాను, మతపరంగాను, ఆధ్యాత్మపరంగాను విభిన్నమైన అర్థాలు, స్థానాలు వున్నాయి. చైనాలో స్కూలు విద్యార్థులు ప్రతిరోజూ పద్మాలని పొగుడుతూ ప్రార్థనలు చేస్తారు స్కూళ్లలో. తామర పువ్వుకి శాస్త్రీయ నామం 'నెలెంబియమ్ స్పాటియోకమ్', 'నెలెంబు' అన్నపదం సింహళ భాషకు చెందింది.

తాత్వికంగాను, వేదాంతపరంగాను ఈ తామరకు అత్యంత ప్రముఖ స్థానముంది. సౌందర్యానికి, పవిత్రతకి, పునర్జన్మకి, స్త్రీత్వానికి గుర్తుగా ఈ తామరని పరిగణిస్తారు చాలాదేశాల్లో. ఆసియాలో అనేకచోట్ల ఈ తామర కొలనులు లెక్కకు మిక్కుటంగా వున్నాయి. వ్యాపార ప్రయోజనాలకోసం ఈ తామరలను పెంచడంలో కొత్తపద్ధతులను, ప్రత్యేక జాగర్తలను తీసుకోడం జరుగుతోంది.

సాధారణంగా బాగా విచ్చిన తామర తెలుపు లేదా లేత ఎరుపు రంగుల్లో వుంటాయి. ఉత్తర అమెరికాలో పసుపుపచ్చ తామరలు కూడా దర్శనమిస్తాయి. ఈ తామర కాడ లోపల ఖాళీగా వుండి నిట్టనిలువుగా వుంటుంది. తామర బాగా విచ్చుకున్నాక విత్తనాలను తయారుచేయడం ప్రారంభిస్తుంది. వీటిని వేల సంవత్సరాలు నిలవ వుంచినా పాడవక మొలకెత్తుతాయి. 1951లో టోక్యోలోని ఓ ప్రాంతంలో 2000 సంవత్సరాల నాటి తామర విత్తనాలు లభించాయి. అంతేకాదు అవి చక్కగా మొలకెత్తి పూలు పూశాయి.

మధ్య ఆసియాలో ఇంచుమించు అన్ని దేశాల్లో తామరలు పూస్తాయి. ప్రాచీన శిల్ప సంపదను పరిశీలిస్తే స్తంభాలపై తామర పువ్వుల చెక్కడాలు కనిపిస్తాయి.

కానీ ఈ తామర ఈజిప్టును చేరింది మాత్రం క్రీ.పూ 6వ శతాబ్దంలో మాత్రమే. బహుశా ఈజిప్టుపై దండెత్తిన ఇరానియన్ల ద్వారా ఈ తామర బీజం ఈజిప్టును చేరి వుండవచ్చని కథనం. హెరిడోటస్ అనే పర్షియన్ రచయిత తన 'ట్రావెలాగ్స్'లో ఈ పద్మాల గురించి విపుల వివరణ ఇచ్చాడు.

సింధులోయ తవ్వకాల్లో బయల్పడిన ఓ స్త్రీ విగ్రహాన్ని పరిశీలిస్తే ఆమె తలపై తామరలతో అలంకరణ కన్పించింది. అప్పటి నుండి తామరకు మతపరమైన ప్రాముఖ్యత ఏర్పడిందంటారు పరిశీలకులు. ఈ విగ్రహం క్రీ.పూ 3000వ సంవత్సరంనాటిది. తామర

లక్ష్మీదేవి నివాసస్థానమని శాస్త్రాలు చెపుతున్నాయి. బౌద్ధులు తామరను తమ మతచిహ్నంగా 2000 సంవత్సరాలకు పూర్వమే స్వంతంచేసుకున్నారు. యువరాజు సిద్ధార్థుడి అడుగుల కింద తామరలు మొలిచాయని బౌద్ధజానపదగీతాలు చెబుతాయి. బౌద్ధమతంతోపాటు, తామర ప్రాముఖ్యం కూడా ఆసియా అంతటా వ్యాపించింది. జావాలో బోరోబుదర్, బర్మాలో పగన్, థాయ్‌లాండ్‌లోని సుఖోథాయ్, కంపూచియాలోని ఆంగ్‌కోర్‌వాట్‌లలోగల బౌద్ధదేవాలయాల్లో తామ




రకి ప్రముఖస్థానం ఈయబడింది. శ్రీలంకలోని దేవాలయ స్థంభాలపై తామర పువ్వులు చెక్కివుంటాయి.

జపనీయులు తామరను పుట్టుకతోను, మృత్యువుతోనూ కలుపుతూ కొన్ని నమ్మకాలను వ్యక్తపరుస్తారు. ప్రాచీన కాలంలోని జపనీయుల పువ్వుల అలంకరణని పరిశీలిస్తే రేకులు విడిపోయిన తామర భూతకాలానికి, కొత్త పువ్వువర్తమానానికి, మొగ్గ భవిష్యత్ కాలానికి ప్రతీకగా అమరుస్తారు. చైనా కళాకారులు చిత్రాలలో, మట్టిపాత్రలపై, దుప్పట్లపై తామరలను వేసవికాలానికి ప్రతీకగా చిత్రించి ప్రదర్శిస్తారు. చైనాలోని బీజింగ్‌లో లోటస్ గార్డెన్స్ ప్రపంచ ప్రఖ్యాతిపొందినవి.

ఈ పువ్వు ఔషధంగా కూడా ఉపయోగిస్తారు కొన్ని ప్రాంతాల్లో. దీని కాడలో ప్రొటీన్లు, స్టార్చ్, విటమిన్ సి ఉన్నాయి. దాన్ని సూప్‌గాను, కూరగాను కూడా సేవిస్తారు కొంతమంది. సువాసనలు వెదజల్లే తామరాకుపై భోజనం ఎంతో రుచికరంగా వుంటుందంటారు చైనీయులు.

తామర విత్తనాలను స్వీట్లు, పుడ్డింగ్‌లలో ఉపయోగిస్తారు చైనీయులు. విత్తనాలను ఎండబెట్టి పొడిచేసి ఔషధంగా వాడతారు. థాయ్‌లాండ్‌లో గర్భిణీ స్త్రీలు తామరపుష్పాలతో తయారయిన 'టీ'ని సేవిస్తారు. దీనివల్ల సుఖప్రసవం అవుతుందని వారి నమ్మకం.

ఏదిఏమయినా ప్రపంచంలోని విభిన్న నాగరికతలను ఒక కప్పుకిందకి తీసుకురావడంలో తామర పుష్పం పాత్ర ఎంతయినా వుందని చరిత్రకారులంటారు.

# 'వేయి సూర్యుళ్ళు' పై సమీక్షలు



జనవరి 'చతుర'లో ప్రచురితమైన సింహప్రసాద్ నవల 'వేయి సూర్యుళ్ళు'పై మాకందిన ఉత్తమ సమీక్షలు.

## నూతన సంవత్సర కానుక

*(ప్రథమ బహుమతి రు: 100/- పొందిన సమీక్ష)*

రచనలకి ఆయువుపట్టయిన గ్రామీణ పరిస్థితులను కథాంశంగా తీసుకుని తరాల మధ్య అంతరాలు, మార్పులు చేర్పులు, సామాజిక చైతన్యం, ఇంతకాలం అణగదొక్కబడ్డ నిమ్న కులస్తులలో వస్తున్న రాజకీయ చైతన్యం గురించిన జనవరి నెల 'చతుర' నవల "వేయి సూర్యుళ్ళు"లో రచయిత సింహప్రసాద్‌గారి వర్ణన, పాత్రల విశ్లేషణ రియల్లీ సూపర్బ్.

బ్రాహ్మణకులంలో పుట్టిన అలివేలు, సారథి నిమ్నకులంలో పుట్టిన సూర్యం తమ స్థాయిని మించి ఆలోచించడంలో, వారి ఆలోచనలను కార్యరూపంలోకి తేవడంలో కావాల్సిన ఆత్మస్థైర్యాన్ని అందించడమే కాకుండా వారికి తగిన సమయంలో యోగ్యమైన సలహాలనిస్తూ వారిని వెన్నంటి ప్రోత్సహించిన క్రిష్టయ్య మాష్టారులాంటి వ్యక్తి నిజంగా ఉపాధ్యాయులందరికీ స్ఫూర్తి.

రాజకీయం తెల్సినవాళ్ళు తమ అధికారపీఠాన్ని కాపాడుకోవడంలో అహంతో ఎంతకైనా తెగిస్తారని అనంతయ్య రామదాసుని నిలువునా సజీవదహనం చేసి నిరూపిస్తే, పెద్దమునసబు నిమ్నకులస్థుల ఆలయప్రవేశ విషయంలో సూర్యం వాదనను కొట్టివేయలేక వారి పెద్దవారిని బెదిరించడం దగ్గరనుండి చివరికి తన సాటి కులస్థులను కూడా తన రాజకీయ చదరంగంలో పావులుగా ఉపయోగించుకునేవరకూ అడుగడు

గునా అధికార దాహంతోనే తహతహలాడాడు.

"ఒడ్డు చేరిన తరువాత తెప్ప తగలేసిన" చందాన తమ సాటికులస్తుడని, తమని ఉద్ధరిస్తాడని అధికారం కట్టబెడితే మితిమీరిన స్వార్థంతో, బంధుప్రీతితో అగ్రకులాలవారి అనుగ్రహం పొందిన పాత్రలో పెరుమాళ్ళుని, పెద్ద కులపోళ్ల వెనుకబడిన వారిని చులకనగా చూడడమే కాకుండా వారినేం చేసినా ఎదురుండదని విర్రవీగే పాత్రల్లో, సురేష్, వెంకటరెడ్డిలను చక్కగా చిత్రించారు. వీరందరికి దీటైన సమాధానంగా నిలిచిన సూర్యం నిమ్నకులస్తులకి నిజంగా సూర్యుడే.

స్వాతంత్ర్య స్వర్ణోత్సవాలను జరుపుకుంటున్న తరుణంలో వెనుకబడ్డ జాతులకి, వెనుకబడ్డ కులాలవారికి స్వాతంత్ర్యం వల్ల ఒరిగిందేమీలేదని, ఏ ప్రభుత్వమూ, ఏ చట్టమూ వారి బతుకుల్లో మార్పుని తీసుకురాలేకపోయాయని, కనీస అవసరాలయన కూడు, గూడు, గుడ్డ కూడా వారికి అందుబాటులోకి తేలేకపోయాయని, మారుచీర లేని బంగారి, పిల్లల ఆకలికి షావుకారికి లొంగిపోయిన రంగి పాత్రల ద్వారా రచయిత సమాజానికి గుర్తుచేశారు.

నూతన సంవత్సరంలో ఇంత మంచి సామాజిక దృక్పథం కలిగిన నవల అందించిన 'చతుర'కు శుభాకాంక్షలు తెలియజేస్తూ, ముందు ముందు కూడా ఇలాంటి మంచి నవలలు చతురలో చదవాలని ఆశిస్తున్నాను.

–యం. చినవెంకటరావు
శివాపురం-521 190

## నేపథ్యం

*(ద్వితీయ బహుమతి రు: 75/– పొందిన సమీక్ష)*

వర్తమాన భారతంలో తరతరాలుగా అణగారిన వారి చరిత్ర గమనంలో వెనక్కి నెట్టబడ్డ దళితుల జీవనసరళి నేపథ్యంగా సాగిన సింహప్రసాద్ నవల "వేయిసూర్యుళ్ళు" కొత్త కాంతులు చిందించింది.

ఏదో రకమైన పీడనలోని బాధితులు ఏ దేశంలోనైనా నలిగిపోతూ ఉన్నంతకాలం తమ ఉన్నతికోసం తప్పనిసరి పరిస్థితుల్లో చేసే పోరాటమే ఆ దేశ అభివృద్ధికి సోపానమవుతుంది.

నవలలో సూర్యం పాత్ర చాలా బ్యాలన్స్‌డ్‌గా తీర్చిదిద్దారు. రచయిత ఉటంకించిన సన్నివేశాలు కీలమ్మేణి, చుండూరు మొదలైన ప్రదేశాల్లో జరిగిన ఘటనల్ని తలపిస్తున్నాయి.

కులం నిచ్చెనలపైననే పైకివచ్చి అగ్రవర్ణాలకే ఉపయోగపడుతున్న 'పెరుమాళ్ళు', దళితుల విలువైన శ్రమశక్తికి లెక్కలు కడుతూ బ్యాంక్ బాలన్స్ ఎలా పెంచుకోవాలో మాత్రమే తెలిసిన 'కృష్ణమాచారి', అడుగడుగునా కుయుక్తులతోనే పెద్దరికం నిలబెట్టుకోవడం ఎరిగిన 'మున్సబ్‌గారు' దళితుల జీవితాల్లో చీకట్లు నింపే అసలు సిసలు నేరస్తులు. వీళ్ళని ప్రాసిక్యూట్ చేయనిదే సామాజిక పురోగమనం సాధ్యం కాదు.

దళితుల్ని విడదీయాలని చేసే ప్రయత్నాలు కూడా బెడిసి కొడ్తాయనేది 'మల్లిగాడు' పాత్రద్వారా తెలియజేశారు. ఈ నవలలోని ప్రతిపాత్ర సామాజిక ప్రతిబింబమే. కులభేదాలు రూపుమాపడానికి చక్కని పరిష్కారం 'వర్ణాంతర వివాహం' అనే దృష్టితో సారధిలాంటి అగ్రవర్ణాల యువకులు దళిత మహిళల్ని వివాహమాడడం ప్రోత్సహించదగిన విషయం. వరకట్నంలాంటి సామాజిక దురాచారం రూపుమాపడం వర్ణాంతర వివాహం ఒక్కటే చేయగలదు.

దళితుల పురోగమనాన్ని అడ్డుకోవడం

అసాధ్యమని రచయిత సూర్యం పాత్ర ద్వారా క్లయిమాక్స్‌లో చిత్రీకరించిన తీరు అద్భుతంగా వుంది. వెలుగురేకలు ప్రసరింపజేసే సూర్యంలాంటి వాళ్ళు వేయి సూర్యుళ్ళుగా సామాజిక చీకట్లు పారద్రోల్తే భారతావని తేజస్సు ద్విగుణీకృతమవుతుందనేది చారిత్రక సత్యం. అణగారిన పేదలంతా కులాలు విస్మరించి ఒకటిగా నిలిస్తేనే ఇది సాధ్యం.

—జి. చంద్రమోహన్
సికింద్రాబాద్

## మూస ఇతివృత్తం

*(తృతీయ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

తెలుగు తెరను అలరించిన కొన్ని 'ఎర్ర మార్కు' సినిమాల ధోరణిలో మలచిందే 'వేయిసూర్యుళ్ళు' నవల. దళిత చైతన్యపు ఆవశ్యకత గురించి వివరిస్తూ, అగ్రవర్ణాల ఆభిజాత్యంపై 'కొరడా' ఝుళిపించారు రచయిత. నవలలో కొద్దిగా విభిన్నపు కథనం ఏమిటంటే పూజారి కృష్ణమాచార్యులు 'రొయ్యల చెరువు' సాగుచేయడం ద్వారా డబ్బు సంపాదించడం.

'మూస' విధానానికి చిత్రిక పట్టిన ఈ నవలలో నాయకుడు సూర్యం. అతనిపై యజమాని కూతురు అలివేలు మనస్సు పారేసుకోవడం, దానికి ఆమె తల్లిదండ్రుల అనంగీకారం షరా మామూలే! మునసబు, సర్పంచ్ ఇత్యాది పెద్దల పాత్రల చిత్రణ, కిష్టయ్య మాస్టారి పాత్రను మలచిన విధానం, ఆ మాస్టారి బదిలీని ఆపుచేసిన వైనం, తోటి దళితులకు 'మార్గం' చూపిన సూర్యం హీరోయిజం అంతా 'ఫక్తు' సినిమా టిక్‌గానే సాగింది.

బాలింతరాలయిన దళిత యువతిని సురేష్ అనే ధనమదాంధుడు 'పరీక్ష' చేసిన విధానం ఆ మధ్య ఒక గిరిజన బాలింత యువతిని రక్షణ భటులుగా 'మార్కు' తగిలించుకున్నవారు పరీక్షించిన విధానాన్ని పోలివుంది. పత్రికల్లో వెలువడిన ఈ వార్తను రచయిత తన నవలకు వాడుకున్నారన్నమాట.

చివరలో నాయకుడు సూర్యాన్ని మట్టుపెట్ట ప్రయత్నించిన విధానం, ఊరిపెద్దల అనైక్యత, వారి అంతర్మథనాల ద్వారా వివరించిన తీరు ఫర్వాలేదనిపించింది. అయితే ఈమధ్య తరచూ వినవస్తోన్న 'దళిత చైతన్యపు' పదాలు అగ్రవర్ణాలు సైతం వల్లిస్తున్నవే. ఓట్లుకోరే రాజకీయపక్షాల సంగతి చెప్పనవసరంలేదు. అగ్రవర్ణాల డబ్బున్నవారి కొమ్ముకాసే అధికారగణం గురించి పలుచలన చిత్రాల్లో ప్రతినాయకుల పాత్రల్లో చూపి, దుయ్యబట్టి చాలామంది దర్శక నిర్మాతలు సొమ్ము చేసుకునే ఉన్నారు.

దాదాపు రెండు దశాబ్దాల క్రితం 'రామదాసు' అనే దళిత యువకుణ్ణి ఆ ఊరి మోతుబరి సజీవదహనం చేసినా, నోరు మూసుకుని తిలకించినట్లు, ఏ ఒక్కరూ సాక్ష్యం చెప్పడానికి సాహసించనట్లు, అటువంటి చైతన్యరహిత పరిస్థితులు నేడు లేవు అని చెప్పడానికి రచయిత ఈ ఇతివృత్తాన్ని ఎన్నుకున్నట్లు కనిపిస్తుంది. ఇటువంటి నవలల్లో 'నవ్యత' లేదని అనుకోవడం, పెదవి విరవడం వంటివి ఏ పాఠకుడూ చేయలేడు.

—పంతంగి రవీంద్ర శ్రీనివాస్
సూర్యాపేట-508 213

## కూలుతున్న గోడలు

*(నాలుగవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

'వేయి సూర్యుళ్ళు'లో రచయిత కల్పించిన కథ అంతంతమాత్రమే అయినా చిత్రించిన

పాత్రలు, సృష్టించిన సన్నివేశాలు, ప్రదర్శించిన ఆదర్శాలు ప్రసంశనీయం.

ఈ నవలలో పల్లెటూర్లలో పాతుకుపోయిన అంటరానితనాన్ని మంటకలపాలనే ప్రబోధం, పరిష్కారం సృజనాత్మక రూపంలో ఆవిష్కరింపజేశారు సింహప్రసాద్‌గారు.

'అయితే మీరు మీ అమ్మానాన్నలకు పుట్టలేదన్నమాట' వంటి ఈటెపోటు మాటలతో పెద్దలనే వులిక్కిపడేలా చేసిన కుర్రకారు గుడిప్రవేశం, 'రామదాసు కాలం కాదిది గుర్తుంచుకోండి' అంటూ సూర్యం శివస్వామిపై సవాలు చేయటం, పరంధామయ్యను మాలపల్లిలో కట్టివేయటం మొదలైన ఘటనలన్నీ అన్యాయాన్ని ప్రశ్నించి, దౌర్జన్యాన్ని ఎదిరించి నవసమాజ నిర్మాణానికి పురికొల్పిన చైతన్య సన్నివేశాలే.

కిష్టయ్య మాష్టరు లాంటి మహనీయుల ప్రబోధాలు, సారధి, అలివేలులాంటి సహృదయుల సహకారాలుంటే- కొంతకాలానికి ఈ కులం గోడలు వాటంతటవే కూలిపోగలవని చెప్పవచ్చు

రామదాసు సజీవదహనం, శివస్వామి ఎర్రెంకణ్ణి ఈడ్చుకెళ్ళి కొట్టడం, వెంకటరెడ్డి చల్లయ్య తల్లిని చావగొట్టడం, సురేష్ చంద్రికి పెట్టిన పరిక్షా- మొదలైన ఇతివృత్తానికి అతిముఖ్యమైన సన్నివేశాలన్నీ అగ్రకులాల అహంభావానికి నిదర్శనాలు. ఇకమీదట ఇటువంటి సంఘటనలు నివారించాలన్నదే ఈ నవల సంకల్పమనవచ్చు

పోతే, స్కూల్ ఫంక్షన్‌లో రాజన్నకు ప్రైజులివ్వటమనే భాగం ఈ నవలలో ఇమడదనిపిస్తుంది. దానికి బదులు గ్రామాలలో హరిజనులను నిజంగా అవమానాలకు గురిచేస్తున్న అసలు విషయాలైన హోటల్లో వారి గ్లాసు పక్కన పెట్టడం, ఊరందరికీ ఉతికే చాకలి హరిజనుల గుడ్డలు ఉతికేందుకు నిరాకరించడం, మంగలి క్రాఫ్ చేయడానికి వెనుకంజవేయటం వంటి విషయాలు చిత్రించి ఉంటే ఇంకా బాగుండేది.

మొత్తంమీద ఈ నవల అందరూ చదవదగింది.

-ఆంధ్రా నాగప్ప
గుత్తి

## మూస నవలిక

*(అయిదవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

దళితవాదం విషయంగా వచ్చిన ఎన్నో మూస రచనలలో ఒకటి సింహప్రసాద్ వ్రాసిన "వేయి సూర్యుళ్ళు". సెక్స్ దోపిడితో పాటు అన్నిరకాల దోపిడీలను ఎదిరించాలని అన్న సూర్యం దేవాలయంలోకి తన వాళ్ళకి ప్రవేశం కల్పించాలనటం ఈరోజుల్లో ఆధ్యాత్మికపరంగా దోపిడీని ఏరికోరి చేయించుకోవడం అవదా? సారధి-లక్ష్మిల ప్రేమవివాహం స్థాయి వేరు. ఇద్దరూ విద్యాధికులూ, ఆర్థిక స్వేచ్ఛ గలవారు. సూర్యం, అలివేలు విషయం అలా కాదే. అలివేలుది వయసుపరమైన ఆకర్షణ అని చెప్పక తప్పదు. అలివేలులో మొదట ప్రేమచైతన్యాన్ని చూపించారు. ఆ చైతన్యంలోనే ఆమె సూర్యంపట్ల అభిమానం చూపించింది. తరువాత అకస్మాత్తుగా ఆమె సామాజిక స్పృహ గల యువతి అని నిరూపించేశారు. వార్తలుగా వచ్చిన అంశాలు, దళితపద సాహిత్యంలో మూసగా వచ్చే అంశాలన్నీ ఇందులో ఉన్నాయి. "మా పరువు వెలకట్టలేనిది. మా అభిమానం అమూల్యమైనది" అన్న సూర్యం పాలేరుగా ఉండి ఆ పరువు, ఆ అభిమానం నిలుపుకోవడం సాధ్యమా? రచయిత నాటకీయంగా ఆ డైలాగులు చెప్పించారు. సారధి-లక్ష్మిల పాత్రలే ఆదర్శవంతంగా ఉన్నాయి.

-మరో ఛార్లెస్
విజయవాడ-520 008

# FORM IV (See Rule 8)

Statement about ownership and other particulars of CHATURA.

1. Place of Publication : 6–3–570, Eenadu Compound, Somajiguda, Hyderabad–500 082.

2. Periodicity of its Publication : Monthly

3. Printer's Name : **RAMOJI RAO**

Whether citizen of India : Yes
If foreigner, state the country of origin : –

Address : 6–3–570, Eenadu Compound, Somajiguda, Hyderabad–500 082.

4. Publisher's Name : **RAMOJI RAO**

Whether citizen of India : Yes
If foreigner, state the country of origin : –
Address : 6–3–570, Eenadu Compound, Somajiguda, Hyderabad–500 082.

5. Editor's Name : **RAMOJI RAO**

Whether citizen of India : Yes
If foreigner, state the country of origin : –
Address : 6–3–570, Eenadu Compound, Somajiguda, Hyderabad–500 082.

6. Name and address of individuals who own the newspaper and partners or shareholders holding more than one percent of the total capital. : **VASUNDHARA PUBLICATIONS** 6–3–570, Eenadu Compound, Somajiguda, Hyderabad–500 082.

**I, RAMOJI RAO,** hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

**for VASUNDHARA PUBLICATIONS**
Date: March 1, 1998 **Sd/– RAMOJI RAO**
Publisher

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 290328. Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 83216; Suryapet: 21146; Guntur: 353942; Nellore: 331250.

CHATURA Telugu Monthly Hyderabad- 500 482 Regd. No. H/HD/402-RNI/32186/78